# వీక్షణం

ఆర్థిక, సామాజిక పత్రిక

ఆగస్ట్ 2005 49 రూ. 10

- ఆంధ్ర ప్రదేశ్ లో వైద్య, ఆరోగ్య సేవలు
- అమ్మకానికి ఆంధ్ర ప్రదేశ్ - వోక్స్ వాగెన్
- సహజ వాయుసంపద - చేయిజారిన అవకాశం
- సాగునీటి ప్రాజెక్టులు ఎవరి కోసం?
- హైదరాబాద్ అభివృద్ధి - నిజానిజాలు
- కుప్పం తరహా వ్యవసాయంతో పండేదేమిటి?

# Admission Notification

**3 year course in General Nursing and Mid-Wifery**

**(2005-06)**



## Vision

*To build and nurture a caring paramedical community which comprehensively enhances the quality of healthcare systems*

- Eligibility - Intermediate Pass (any subject)
- Excellent Faculty and Facilities
- Hostel Accommodation provided
- Scholarships available for SC/STs
- Placement assistance will be provided

MM School of Nursing (MMSN) is recognised by Govt. of Andhra Pradesh and Nursing Council of Andhra Pradesh. The school offers 3-year course in General Nursing and Midwifery (GNM).

Apart from Tilaknagar Hospital, the nursing school has a tie-up with two more multispecialty hospitals - 150 bedded Sai Krishna Neuro Hospital, Kachiguda and 40 bedded Sai Kamala Hospital, Dilsukhnagar.

Contact for Application Forms



## MM School of Nursing

(managed by St. Joseph's Education Society)
Tilak Nagar Hospital Campus, Tilak Nagar, Hyderabad, Andhra Pradesh - 44.
Phone: 27561600, 27561400, Mobile: 9346909022

విడి ప్రతి: రు. 10
వార్షిక చందా: రు.150

వీక్షణం
ఆర్థిక, సామాజిక పత్రిక
సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ
49 ఆగస్ట్ 2005

సంపాదకీయం

# సామాజిక విలువల పతనం

మన రాజకీయ రంగపు దివాళాకోరు తనానికి నిదర్శనాలు రోజురోజుకూ పెరిగిపోతున్నాయి. ఇది కేవలం రాజకీయ రంగానికి అంటిన జబ్బు మాత్రమే కాదని, అది కార్యనిర్వాహక, అధికార యంత్రాంగానికి, న్యాయ వ్యవస్థకు కూడా పాకిందని ఇటీవలి ఘటనలు చూపుతున్నాయి. ఈ నెలలో రాష్ట్రంలో సంభవించిన అనేక ఘటనల నుంచి ఈ సామాజిక విలువల పతనాన్ని రుజువుచేయవచ్చు. ఉదాహరణకు ఆర్.టి.సి. సమ్మెపట్ల రాజకీయ నాయకత్వం, న్యాయ వ్యవస్థ వ్యవహరించిన తీరు, తెలంగాణ రాష్ట్ర సమితి మంత్రి వర్గం నుంచి ఉపసంహరించుకున్న తీరు, ఆ తర్వాత ఢిల్లీ సమావేశంలో కాంగ్రెస్‌కు పూర్తిగా లొంగిపోయిన తీరు, జూనియర్ డాక్టర్ల సమ్మెపట్ల రాజకీయ, అధికార, న్యాయ వ్యవస్థల ప్రతిస్పందన, వోక్స్ వాగెన్ ఉదంతం - ప్రతి ఒక్క పరిణామం మన సామాజిక విలువలు ఎంతగా దిగజారిపోతున్నాయో, ఏ ఒక్క వ్యవస్థ, ఏ ఒక్క విలువకు, నియమానికి కట్టుబడని స్థితి ఎట్లా పెరిగిపోతున్నదో చూపుతున్నాయి.

ఆర్.టి.సి. కార్మికులు, సిబ్బంది తమ సంస్థ పరిరక్షణ కోసం, అంటే విస్తృత, దీర్ఘకాలిక ప్రజా ప్రయోజనం కోసం సమ్మెకు దిగారు. ఆ సమ్మె వెనుక వున్న నిజమైన కారణాన్ని చూడడానికి నిరాకరించిన న్యాయవ్యవస్థ ముందు సమ్మె విరమించి చర్చలు జరపమని ఆదేశించింది. అప్పటికే సంస్థను ధ్వంసం చేసి ప్రైవేటీకరించడానికి ఉవ్విళ్ళూరుతున్న ప్రభుత్వాన్ని ఏమాత్రం కట్టడి చేయకుండా, ఆ ప్రయత్నాన్ని అడ్డుకుంటున్న కార్మికుల మీదనే కొరడా ఝుళిపించడం న్యాయవ్యవస్థ చేయదగని పని. మూడు వారాలలోపల చర్చలు జరిపి పరిష్కారం కనిపెట్టాలని ఆర్.టి.సి. యాజమాన్యానికి, ప్రభుత్వానికి చేసిన సూచన కేవలం కంటితుడుపు చర్యేనని, అది వాస్తవ రూపం ధరించదని జూలై 6న ఆ సూచన రాగానే వ్యక్తమైన అనుమానం ఇది రాస్తున్న సమయానికి నిజమని తేలిపోయింది. ఆర్.టి.సి. విషయంలో ప్రభుత్వానికి దురుద్దేశ్యాలు ఉన్నాయని స్పష్టమైన తర్వాత కూడా అంటే రాజకీయ, కార్యనిర్వాహక వర్గాల దివాళాకోరుతనం బయటపడిన తరువాత కూడా న్యాయ వ్యవస్థ ఆ దివాళాకోరు తనాన్ని సమర్థించే ప్రయత్నమే చేసింది.

ఇక తెలంగాణా రాష్ట్ర సమితి 14 నెలలపాటు మంత్రివర్గంలో ఉండి తెలంగాణా వ్యతిరేక నిర్ణయాలెన్నిటినో సమర్థించి, తన విశ్వసనీయతను, సాధికారతను తానే రద్దుచేసుకుంది. ఆ నిర్ణయాల గురించి తాను అప్పుడే మేలుకొన్నట్లు మంత్రి వర్గంలోంచి వైదొలగడం ఒకరకంగా సరైన చర్యే అనుకుంటే, వారం పది రోజులు తిరగకుండానే ఢిల్లీ సమావేశంలో కాంగ్రెస్‌కు దాసోహం అంది. బూటకపు ఎన్‌కౌంటర్ల కారణంగా రాజీనామా చేస్తున్నట్టు ప్రకటించిన తెరాస ఢిల్లీ సమావేశంలో ఆ ఊసే ఎత్తలేదు. అంటే గత పద్నాలుగు నెలల పిల్లిమొగ్గలు అలా ఉంచినా, రెండు వారాల వ్యవధిలోనే ఎన్ని పిల్లిమొగ్గలు వేయగలదో, ఎంత పరవంచనకు, ఆత్మవంచనకు పాల్పడగలదో చూపెట్టుకుంది.

ఈ సామాజిక విలువల పతనాన్ని అడ్డుకోగలిగింది, ఈ దిశను మార్చగలిగేది నిరంత జాగరూకతతో ఉండే ప్రజానీకమే. 'నిరంతర జాగరూకతే ప్రజాస్వామ్యానికి మనం చెల్లించే మూల్యం.'

## లోపలి పేజీల్లో...



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష సామాజిక, ఆర్థిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్ని రకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

## ఉత్తరాలు:

జూలై 2005 సంచికలో 'మానవ సంబంధాలే మదుపు, లాభార్జనే పరమార్థం' - దిలీప్‌గారి వ్యాసం చాలా బాగుంది. మధ్యతరగతి ప్రజానీకంలోకి చొచ్చుకొస్తున్న వస్తు సంస్కృతి, విచ్ఛిన్నమవుతున్న మానవ సంబంధాలు ఈ వ్యాసంలో చాలా చక్కగా చెప్పారు. ఇరుగు పొరుగుల పలకరింపు స్వభావాలే మారిపోయాయి. పెద్దగా పరిచయం లేనివారు ఆత్మీయంగా మాట్లాడితే భయమేసే పరిస్థితి. నిజంగానే మాట్లాడడం అంటే సరుకు అమ్ముకోవడం కోసమనే విధంగా మారిపోయింది. డైరెక్ట్ మార్కెటింగ్ పేరుతో వస్తున్న ఆమ్వే, క్వాంటమ్, టప్పర్‌వేర్, హెర్బాలైఫ్, ఇలాగే మరిన్ని స్కీములు మందిని ముంచడానికే.... తస్మాత్ జాగ్రత్త!

- కె.వెంకటేశ్వర్లు
వరంగల్

రెండు రెళ్ళు ఆరు శీర్షికతో మీరందిస్తున్న సమాచారం ఆలోచింపజేసేదిగా ఉంటోంది. ఆ పేజీని రెగ్యులర్‌గా వేస్తే బాగుంటుంది.

అలాగే రకరకాల కారణాలతో రైతులు, కార్మికులు, స్త్రీలు, నిరుద్యోగ యువత, వివిధ రంగాల ప్రజలు అసహజ మరణాల పాలవుతున్నారు. మొత్తంగా ఈ అసహజ మరణాల సంఖ్యను వీక్షణంలో తేగలిగితే బావుంటుంది.

- ప్రభాకర్
విశాఖపట్నం

'వీక్షణం' విడి ప్రతి వెల సాధారణంగా రు.10 ఉండగా, సంవత్సర చందా రు.150 ఉండడం గురించి మిత్రులు సందేహాలు వ్యక్తం చేస్తున్నారు. ప్రతి సంవత్సరం కనీసం ఒక ప్రత్యేక సంచిక ప్రచురించడం ద్వారా, ఆసక్తిదాయమైన పుస్తకం ఒకటి చందాదారులందరికి పంపించడం ద్వారా వారు చెల్లించిన సొమ్ముకు సమానమైన, లేదా ఎక్కువ విలువైన పత్రికలు, పుస్తకాలు అందించడం జరుగుతుంది.

-సం.


వీక్షణం ఆర్థిక, సామాజిక పత్రిక
సమతా పబ్లికేషన్స్
సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 025. ఫోన్ : 040 - 55843495
ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్, అజామాబాద్, హైదరాబాద్.

## అమ్మకానికి ఆంధ్రప్రదేశ్ - రెండో అంకం : రెండో దృశ్యం

# వోక్స్ వాగెన్ - డబ్బు లాగెన్

- ఎన్. వేణుగోపాల్

ఆంధ్రప్రదేశ్ వనరుల మీద, మార్కెట్ల మీద అధికారాన్ని బహుళ జాతి సంస్థలకు, దేశ విదేశాల పెట్టుబడి దార్లకు అప్పగించే ప్రక్రియను 'అమ్మకానికి ఆంధ్రప్రదేశ్' గా నిర్వచించుకుంటే ఈ ప్రక్రియ ప్రారంభమై చాల దశాబ్దాలు గడిచింది. చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా ఉండిన తొమ్మిది సంవత్సరాల కాలంలో ఈ ప్రక్రియ చాల ఉధృతంగా, వేగవంతంగా జరిగింది. ఆ సమయంలో ప్రతిపక్షనాయకుడిగా ఉండిన డా. వైఎస్ రాజశేఖర రెడ్డి ఈ ప్రపంచబ్యాంకు నిర్దేశిత ప్రక్రియను తీవ్రంగా ఖండించారు. అందువల్ల, కాంగ్రెస్ చరిత్ర తెలిసిన వారుకూడ, రాజశేఖర రెడ్డి పాలన వస్తే అమ్మకానికి ఆంధ్రప్రదేశ్ ప్రక్రియ ఆగిపోతుందనో, మందగిస్తుందనో భావించారు. కాని గత పద్నాలుగు నెలల కాంగ్రెస్ పాలన ఆ అభిప్రాయాలను వమ్ము చేసింది. చంద్రబాబు నాయుడు మార్గంలోనే, ఆయన ప్రారంభించిన కార్యక్రమాన్నిటినీ, రాజశేఖర రెడ్డి ప్రభుత్వం ముందుకు తీసుకు పోతోంది. అంటే అమ్మకానికి ఆంధ్రప్రదేశ్ ప్రక్రియ ఆగిపోలేదు సరిగదా, రెండో అంకం మొదలయింది. ఆ రెండో అంకంలో ఇప్పటికే చాల దృశ్యాలు జరిగి పోయాయి. తాజా దృశ్యం వోక్స్ వాగెన్ ఉదంతం.

వోక్స్ వాగెన్ ఉదంతాన్ని కేవలం ఒకానొక అవినీతి చర్యగా, కుంభకోణంగా, ఎవరో ఒకరిద్దరు అధికారుల, మంత్రుల ముడుపుల భాగోతంగా మాత్రమే అర్థం చేసుకుంటే దాన్నిపూర్తిగా అర్థం చేసుకున్నట్టు కాదు. బహుళజాతి సంస్థల అనైతిక, అత్యాశా పూరిత ప్రవర్తన, బహుళజాతి సంస్థల ప్రతినిధులు మూడో ప్రపంచదేశాలలో సాగిస్తున్న ఆర్థిక, రాజకీయ, నైతిక అరాచకాలు, పేద దేశాల రాజకీయ నేతల, ప్రభుత్వాధికారుల కక్కుర్తి, పేదదేశాల ప్రభుత్వ విధానాలలో ప్రబలిపోతున్న అవినీతి, పద్ధతిలేని పనితీరు, ఆంధ్రప్రదేశ్‌లోని ప్రధాన నగరాలలో వేలం వెర్రిగా పెరిగిపోతున్న రియల్ ఎస్టేట్ అక్రమాలు, వోక్స్ వాగెన్ ఉదంతం బయటపడిన తీరు, ఈ ఉదంతంలో ఇమిడి ఉన్న చట్ట వ్యతిరేక, నీతిబాహ్య అంశాలు, ఈ ఉదంతాన్ని మసిపూసి మారేడుకాయ చేయడానికి జరుగుతున్న ప్రయత్నాలు - వంటి ఎన్నో సంక్లిష్ట అంశాలను కలుపుకొని, పెట్టుబడిదారీ లాభాపేక్ష ఎంత దుర్మార్గానికి ఒడి గట్టగలదో గుర్తించే అవగాహనతో అధ్యయనం చేస్తేనే ఈ ఉదంతాన్ని ఎక్కువగా అర్థం చేసుకోగలము.

మొట్టమొదట మన సమాజంలో చంద్రబాబు నాయుడు పాలనా కాలంలో, ముఖ్యంగా మధ్యతరగతిలో, వ్యాపించిన ఒక జాడ్యాన్ని వదుల్చుకోకపోతే వోక్స్ వాగెన్ ఉదంతాన్ని సవ్యంగా అర్థం చేసుకోలేం. ఆ జాడ్యం ఏమంటే బహుళజాతి సంస్థలు నాణ్యతకూ, సమర్థతకూ, సమగ్రతకూ మారుపేర్లని భావించడం. తెల్లతోలు చేసిన పని ఏదయినా గుడ్డిగా సమర్థించడం. ప్రపంచబ్యాంకు మానసపుత్రుడే అయిన మన్మోహన్ సింగ్ కూడ ఇటీవల ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ ప్రసంగంలో ఈ అభిప్రాయమే ప్రకటించారు. ఈ జాడ్యం వల్ల మన దగ్గర వనరులున్నాయాలేవా, మనకు ఆ అవసరం ఉందా లేదా అనే విచక్షణ లేకుండా ఏ తెల్లతోలు మనిషి వచ్చి ఇక్కడ ఒక కార్ఖానా పెడతానన్నా, దుకాణం తెరుస్తానన్నా, నిరభ్యంతరంగా వందల, వేలఎకరాల భూమి ఇవ్వడం, అన్ని సౌకర్యాలు కల్పించడం అలవాటయిపోయింది. ఈ జాడ్యమే మరొక వెర్రితల వేసి, తెల్లతోలు కాకపోయినా సరే, టకటకా ఇంగ్లీషుమాట్లాడి, నాలుగు డబ్బులు గలగలలాడిస్తే సాగిలపడిపోయే రాజకీయనేతలు, అధికారులు తయారయ్యారు.

కాని బహుళజాతి సంస్థలలో ఏ ఒక్కటి కూడ గౌరవనీయమైన చరిత్ర ఉన్నవి కావు. మామూలుగా పెట్టుబడిదారీ విధాన అభివృద్ధే దోపిడీ, పీడనల మీద, దుర్మార్గం మీద ఆధారపడి జరిగిందనుకుంటే, బహుళజాతి సంస్థల అభివృద్ధిలో అటువంటి లక్షణాలు మరింత ఎక్కువగా ఉన్నాయి. ఇంకా ప్రజల వైపు నుంచి, పేదదేశాల వైపు నుంచి బహుళజాతి సంస్థల దుర్మార్గాలను సంపూర్ణంగా విశ్లేషించే పని పెద్దఎత్తున జరగడం లేదు గాని ఆ బహుళజాతి సంస్థల మధ్యనే ఉన్న పోటీవల్ల, వైరాల వల్ల ఇప్పటికే ఎన్నో అక్రమాలు బయటపడుతున్నాయి. ఇటీవలి చరిత్రే చూస్తే ఎన్రాన్ వరల్డ్‌కామ్, బ్యాంక్ ఆఫ్ క్రెడిట్ అండ్ కామర్స్, మైక్రోసాఫ్ట్, క్రెడిట్ లయన్నైస్, జిరాక్స్, హాలిబర్టన్, వరల్డ్ ఆన్‌లైన్, ఇన్ఫోమాటెక్, మెరిల్ లించ్, టైకో ఇంటర్ నేషనల్, డైనెజీ, న్యూయార్క్ స్టాక్ ఎక్స్‌చేంజ్, కోకా కోలా వంటి బహుళజాతి సంస్థల దిగ్గజాలు ఎన్నెన్ని ఘోరాలకు, నేరాలకు, అవినీతికి పాల్పడ్డాయో బయట పడింది.

ఈ వరుసలో కొత్తగా చేరింది వోక్స్‌వాగెన్. జర్మన్ భాషలో దాని అర్థం ప్రజల వాహనం అని. యూరప్‌లో అతి పెద్ద కార్ల

తయారీదారుగా ఘనత పొందిన ఈ కంపెనీకి అనేక దేశాలలో కార్ల అమ్మకాల ప్రయోజనాలున్నాయి. దీని కార్ల, ఇతర వాహనాల ఉత్పత్తి సామ్రాజ్యం ఎన్నో దేశాలకు విస్తరించింది. ఈ బహుళజాతి సంస్థ జాబితాలో ఇటీవలిదాకా భారత మార్కెట్ లేదు. ఆసియాలో చైనా, తైవాన్, సింగపూర్ వంటి దేశాలలో వాహనాల ఉత్పత్తో, బిగింపో, ప్రధాన పంపిణీదార్ల ద్వారా వ్యాపారమో సాగిస్తున్న వోక్స్ వాగెన్ భారతదేశంలో విడి భాగాల తయారీకి గాని, కార్ల బిగింపుకు గాని అవకాశం ఉందని అనుకోలేదు. నూతన ఆర్థిక విధానాల తర్వాత బహుళజాతి సంస్థలన్నీ ఇటువైపు చూడడం ప్రారంభించిన తర్వాత కూడ భారతదేశ మార్కెట్ వోక్స్ వాగెన్‌ను ఆకర్షించలేదు. వోక్స్ వాగెన్ భారత మార్కెట్ ప్రవేశం 2001లో దాని అనుబంధ సంస్థ (చెక్ దేశానికి చెందిన కార్లతయారీ దారు) స్కోడా ఆటో ద్వారా ప్రారంభమైంది. స్కోడా మహారాష్ట్రలోని ఔరంగాబాదులో తన కార్ల తయారీ యూనిట్‌ను స్థాపించింది. అప్పటి నుంచీ అటు మహారాష్ట్ర, ఇటు తమిళనాడు వోక్స్ వాగెన్‌ను తమదగ్గర కార్ల ఉత్పత్తి కేంద్రాన్ని స్థాపించమని అడుగుతూవచ్చాయి. అప్పటికే ఆ రెండు రాష్ట్రాలకు ఆటోమొబైల్ పరిశ్రమతో సన్నిహిత సంబంధం ఉంది. అందువల్ల అక్కడ విడి భాగాల పరిశ్రమలు, అనుబంధ పరిశ్రమలు కూడ విస్తరించాయి. ఆ రెండు రాష్ట్ర ప్రభుత్వాలు తమ ఈ అనుభవాన్ని చూపెట్టడంతోపాటు ఎన్నో రాయితీలు కూడా ఇవ్వజూపాయి.

ఈ స్థితిలో 2003 మధ్య భాగంలో ఆంధ్రప్రదేశ్ కూడా ఈ పోటీలోకి దిగింది. ఓడరేవు పట్టణమైన విశాఖపట్టణంలో కార్ల తయారీ కేంద్రాన్ని స్థాపించవచ్చునని, స్థాపించే ఆలోచన వుంటే భూమి ఇస్తానని, అనేక ఇతర సౌకర్యాలు కల్పిస్తానని చంద్రబాబునాయుడు ప్రభుత్వం ప్రతిపాదించింది. ఈ పరిణామాలతో వోక్స్ వాగెన్ అప్పటికి స్కోడాలో మానవ వనరుల విభాగానికి అధిపతిగా ఉన్న డా॥ హెల్మట్ షుస్టర్‌ను ఇండియా ప్రాజెక్ట్ లీడర్‌గా నియమించింది. ఇండియా ప్రాజెక్ట్‌కు ప్రధాన సలహాదారుగా అశోక్ జైన్‌ను నియమించింది. ఈ ఇద్దరితోపాటు కంపెనీ బాధ్యులు సెప్టెంబర్ 2003లో చెన్నైని, విశాఖపట్టణాన్ని సందర్శించారు. అప్పటినుంచి 3, 4 నెలలపాటు జరిగిన చర్చల ఫలితంగా 2004 జనవరి 20న వోక్స్‌వాగెన్ కార్ల తయారీ కేంద్రాన్ని రూ.1700 కోట్ల వ్యయంతో విశాఖపట్టణంలో స్థాపించే అవకాశం వుందని అధికారిక ప్రకటన వెలువడింది. ఫిబ్రవరి 14న అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు తయారీ కేంద్రం స్థాపనకు సూత్ర రీత్యా అంగీకారం కుదిరిందని ప్రకటించారు. కానీ ఈలోగా ఎన్నికల ప్రకటన, ఎన్నికల క్రమం మొదలుకావడంతో వోక్స్ వాగెన్ ప్రయత్నం వెనక్కుపోయింది.

కొత్త ప్రభుత్వం వచ్చిన తరువాత, పాత ప్రభుత్వంతో లావాదేవీలు జరిపిన బహుళ జాతి సంస్థలన్నీ త్వరలోనే రెండు ప్రభుత్వాల మధ్య తేడా లేదని తెల్చుకున్నాయి. కొత్త ప్రభుత్వంతో పాత లావాదేవీలను కొనసాగించడం ప్రారంభించాయి. మరోవైపు పాత ప్రభుత్వం కింద ఆ లావాదేవీలు నడిపి కోట్ల రూపాయలు ముడుపులు సంపాదించిన అధికార వర్గం, కొత్త మంత్రులకు, రాజకీయ నాయకులకు ఈ కొత్త ఆదాయ మార్గాన్ని పరిచయం చేసింది. ప్రతిపక్షంలో ఉన్నప్పుడు చంద్రబాబు అవినీతిమీద ఆరోపణలు గుప్పించిన కాంగ్రెస్ నాయకులందరూ, ఆరోపణలు చేసింది ఈర్ష్యాసూయలతోనే తప్ప నీతి మీద గౌరవంతో కాదు. అందువల్ల పది సంవత్సరాలపాటు అధికారానికి దూరమైన కాంగ్రెస్ నాయకులకు బహుళజాతి సంస్థల ముడుపుల రుచి దొరికింది.

ఇక్కడ ఒక్క క్షణం ఆగి వోక్స్ వాగెన్ ఘన చరిత్ర తెలుసుకోవాలి. జర్మనీలో రాజకీయ నాయకులతో సన్నిహితంగా మెలిగే ఈ కంపెనీ వారికి నిధులు అందించడంలో, వారి సెక్స్ కార్యకలాపాలకు సహకరించడంలో ఎంతటి అవినీతికైనా పాల్పడుతుందని అక్కడి ప్రచారసాధనాలు ప్రకటించాయి. ఇద్దరు మాజీ అధిపతులు బినామీ కంపెనీలను స్థాపించి వోక్స్ వాగెన్ నుంచి ఆ కంపెనీలకు నిధులను బదలాయించారు. తాము ఆడిందేఆటగా సాగడం కోసం కార్మిక నాయకులకు లంచాలు ఇచ్చారు. తమకు సహకరించిన వారందరికి బ్రెజిల్‌కు, ఇతర దేశాలకు విలాస యాత్రలు ఏర్పాటు చేశాయి. బ్రెజిల్‌లో వేశ్యలకు, కంపెనీ నిధుల నుంచి, క్రెడిట్ కార్డులమీద డబ్బులిచ్చారు. ఈ విషయాలన్నీ బయట పడడంతో జర్మనీ రాజకీయ, పారిశ్రామిక వర్గాలలో కల్లోలం చెలరేగింది. ఈ కల్లోల క్రమంలోనే ఇండియా ప్రాజెక్ట్ లీడర్‌గా ఒక వెలుగు వెలుగుతున్న షుస్టర్ మీద కూడా నీలినీడలు పరచుకున్నాయి. ఆయన అంగోలాలో వోక్స్ వాగెన్ కేంద్రాన్ని ఏర్పాటు చేసే క్రమంలో లక్షల డాలర్ల అక్రమ నిధులు కైంకర్యం చేయడానికి బేనామీ కంపెనీలు స్థాపించాడని బైటపడింది. ఈ వేడి పెరిగిపోవడంతో షుస్టర్ జూన్ రెండో వారంలో తన పదవికి రాజీనామా చేసి అదృశ్యమైపోయాడు.

వోక్స్ వాగెన్‌లో అవినీతి, అక్రమాలు బయటపడకపోయినా, ఆ సమాచారం షుస్టర్‌ను చుట్టుకుని ముంచెత్తకపోయినా, ఆంధ్రప్రదేశ్‌లో వోక్స్ వాగెన్ గురించి మాట్లాడుకునే అవసరం ఉండేది కాదు. కాని, రాజీనామా చేయడానికి ఒక నెల ముందు, ఈ విషయాలన్నీ బయట పడడానికి మూడు వారాల ముందు షుస్టర్ విశాఖపట్టణానికి, హైదరాబాద్‌కు వచ్చాడు. ఆరు నెలలముందు ఢిల్లీలో ఒక బేనామీ, బోగస్ కంపెనీ ఏర్పాటు చేసి, అందులో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మదుపు పెట్టేలా చేశాడు.

ఆ మదుపు ధనాన్ని ఆ మధ్యలోనే ఢిల్లీ బ్యాంకు ఖాతానుంచి తరలించుకుపోయాడు. అందువల్ల జర్మనీ వోక్స్ వాగెన్ ప్రకంపనలు హైదరాబాద్‌ను కూడా అల్లకల్లోలం చేశాయి.

కాంగ్రెస్ ప్రభుత్వంలో భారీ పరిశ్రమల మంత్రిగా ఉండిన బొత్సా సత్యనారాయణ తనకన్న ముందు తెలుగుదేశం ప్రభుత్వంలో అదే పదవిలో ఉన్న కోటగిరి విద్యాధరరావులాగానే షుస్టర్‌తో చెట్టాపట్టాలు వేసుకుని జర్మనీకి వెళ్లివచ్చాడు. తిరిగి రాగానే మే 7న మాట్లాడుతూ 350 ఎకరాలలో రూ.4500 కోట్ల పెట్టుబడితో 5000-10000 ఉద్యోగ కల్పన చేసే వోక్స్ వాగెన్ కర్మాగారం విశాఖపట్టణానికి వస్తుందన్నాడు. "అన్నీ 45 రోజుల్లో అయిపోతాయి" అన్నాడు.

గత ప్రభుత్వం రోజుల్లో 160 ఎకరాలుగా ఉన్న కర్మాగారం 350 ఎకరాలుగా మారిపోయింది. పెట్టుబడి దాదాపు మూడు రెట్లు అయింది. కేవలం కార్ల తయారీమాత్రమే కాక ట్రక్కులు, లైట్ కమర్షియల్ వెహికిల్స్ తయారీ కూడా రాబోతున్నదని వివరణ ఇస్తున్నారుగాని కార్ల తయారీ కేంద్రం గురించి కూడా ఇంతవరకు వోక్స్ వాగెన్ నుంచి అధికారిక ప్రకటన లేదు.



కాని ఈ లోగా వోక్స్ వాగెన్ కార్ఖానా రాబోతున్నదని ప్రచారం అయిన స్థలం రియల్ ఎస్టేట్ వ్యాపారుల కేంద్రం అయిపోయింది. ఎకరానికి రు.10 లక్షలు ఉన్నదల్లా రు.70 లక్షలు లక్షలకు చేరింది. గత రెండు సంవత్సరాలలో కనీసం రు.3000 కోట్ల భూ విక్రయాలు జరిగాయని ఒక అంచనా.

బహుళజాతి సంస్థలలో అత్యధిక భాగం తాము ప్రకటించిన ఉత్పత్తులు, వ్యాపారాలు చేస్తాయో లేదో గాని రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తాయి. లేదా ఆ ప్రాంతంలో రియల్ ఎస్టేట్ వ్యాపారం వెర్రితలలు వేయడానికి సహకరిస్తాయి. గతంలో చంద్రబాబు నాయుడు బహుళజాతి సంస్థలకు, దేశీయ పెట్టుబడి దారీ సంస్థలకు అవసరం లేకపోయినా వేలాది ఎకరాల భూమి కట్ట బెట్టింది అందువల్లనే. ఎల్ అండ్ టి ఇన్ఫోసిటీ, ఐఎంజి భారత, టార్గెట్ 2000, సాఫ్ట్‌వేర్ పేరిట వందలాది బేనామీ, బోగస్, అనామతు కంపెనీలు పుట్టుకు వచ్చి వేలాది ఎకరాలు ఆక్రమిం చింది ఈ రకంగానే.

షుస్టర్ పదవీచ్యుతుడు కావడం వల్ల బయటపడిన మరొక రహస్యం ఆయన ఆదేశాల మేరకు రాష్ట్ర ప్రభుత్వం రు.11.67 కోట్లు ఢిల్లీలోని వశిష్ట వాహన్ అనే కంపెనీకి చెల్లించిందనేది. ఆ వశిష్ట వాహన్ అటు వోక్స్ వాగెన్‌కు, ఇటు రాష్ట్ర ప్రభుత్వానికి మధ్య సంధానం నడిపే కంపెనీ అన్నారు. ఇటువంటి సంధాన కర్తల, దళారీల అవసరం ఏమిటనే ప్రశ్న మామూలు మనుషులకు రావచ్చుగానీ ప్రభుత్వాలకు రాదు. ఆ మధ్యవర్తిత్వ కంపెనీలో రాష్ట్ర ప్రభుత్వ వాటాగా డబ్బు ఇమ్మనగానే, అడుగుతున్నదెవరు, ఇతర వాటాదారులెవరు, వాళ్ళందరూ వాళ్ళ వాళ్ళ వాటాలు చెల్లించారా లాంటి ప్రశ్నలేమీ అడగకుండా ఆఘమేఘాలమీద రాష్ట్ర ప్రభుత్వం ఆ రు.11.67 కోట్లు ఇచ్చేసింది. షుస్టర్ పతనం జరిగి, కుంభకోణమంతా బయటపడిన తరువాత ఆ డబ్బు తిరిగి తెప్పించే తంటాలు పడుతున్నారు గానీ, డబ్బు తిరిగి వచ్చినా ఈ ప్రశ్నలు మిగిలే వుంటాయి.

ఈ మొత్తం వ్యవహారాన్ని కేంద్ర నేరపరిశోధక శాఖకు అప్పగించారు కానీ, గతంలో ఈ రాష్ట్రంలో సిబిఐ విచారించిన కేసుల చరిత్ర చూస్తే, ఇదంతా కాలయాపన, కంటితుడుపు వ్యవహారం తప్ప మరేమీ కాదని తేలిపోతుంది.

అసలు పాలక విధానాలు ఎవరికి అనుకూలంగా ఉన్నాయి అనే మౌలిక ప్రశ్న వేయకుండా వోక్స్ వాగెన్ ఉదంతాన్ని పరిశీలిస్తే వందలాది కుంభకోణాల జాబితాలో ఇదొకటిగా మారిపోతుంది. వోక్స్ వాగెన్‌కు ఇచ్చే రాయితీలన్నీ కలిపితే ఎంత అవుతాయో అందులో ఒక చిన్న భాగం కేటాయిస్తే ఎ.పి.ఎస్. ఆర్.టి.సి.కి ఉన్న బాడీ బిల్డింగ్ యూనిట్‌ను విస్తరించవచ్చు. మూసివేయనక్కరలేదు. కాని దానిని మూసి వేయడానికే రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. మరెన్నో పరిశ్రమలను మూసివేసింది. మూసివేస్తోంది. నిజంగా వోక్స్ వాగెన్‌లాంటి కారు మన మార్కెట్‌కు అవసరమా? నిజంగా వోక్స్ వాగెన్ వాగ్దానం చేస్తున్నన్ని ఉద్యోగాలు కల్పించి మన నిరుద్యోగ సమస్యను తీరుస్తుందా? లేక విదేశాలలో అమ్ముకోవడానికి విలాసవంతమైన కార్లను మన చౌక శ్రమతో, మన ప్రజాధనం నుంచి ఇచ్చిన రాయితీలతో చౌకగా తయారు చేసుకోవడానికి వోక్స్ వాగెన్‌కు మనమే అవకాశం ఇస్తున్నామా? ఆ వ్యాపార ప్రయోజనాన్ని తీర్చినందుకు, ఉద్యోగాలొస్తున్నాయని మనని నమ్మించి, మన వనరులను దోచుకోనిచ్చినందుకు మన విధాన నిర్ణేతలకు కోట్లాది రూపాయల ముడుపులు దక్కుతున్నాయా? ఇవాళ మన ప్రాధాన్యా లలో బస్సుల నిర్మాణం ఉండాలా, కార్ల నిర్మాణం ఉండాలా? ప్రజావసరాలు ఉండాలా? పిడికెడుమంది సంపన్నుల అవసరాలు ఉండాలా?

ఈ ప్రశ్నలకు జవాబులను బట్టే ఇది ఆంధ్రప్రదేశ్ అమ్మకమా, ఆంధ్రప్రదేశ్ అభివృద్ధా తెలుతుంది.

❑

# పిల్ల మక్క నుండి పెద్ద మక్కకు

- డా. ఎం. భారతి

ఆంధ్రప్రదేశ్‌లో ప్రభుత్వ విధానాల్లో పాలసీలో భాగంగా వివిధ రంగాలలో అమలు జరుగుతున్న మార్కెట్ ఆధారిత ఆర్థికసంస్కరణలు, ఈ నేపథ్యంలో వ్యవసాయరంగం ప్రాధాన్యంగా ఉండే గ్రామాలలో వస్తున్న మార్పులు, వీటికి రైతుల స్పందన, వీరి మీద మార్కెట్ ప్రభావం అధ్యయనం చేసేక్రమంలో, 'వెలుగు' సంస్థ నిర్దేశకత్వంలో ఆంధ్రప్రదేశ్‌లో 10 గ్రామాలు సర్వే చేయించడం జరిగింది. అందులో ఒక గ్రామం చిత్తూరు జిల్లాలో కుప్పం మండలంలో ఉన్న చల్దిగానిపల్లి. కుప్పం పేరు వినగానే ఇది మాజీ ముఖ్యమంత్రి చంద్రబాబు నియోజకవర్గమని, నూతన ఆర్థిక విధానాలు ప్రవేశపెట్టే క్రమంలో ఇక్కడ కార్పొరేట్ వ్యవసాయ రంగం సిద్ధమైందని, దీనివలన భారీ కమతాల ప్రోత్సాహం, అధికవిలువలు కలిగిన ఎగుమతి ప్రాధాన్య పంటలు, ఇజ్రాయిల్ వ్యవసాయ పద్ధతులు, బిందువ్యవసాయం వంటి మార్పులెన్నో వరుసలో తళుక్కున మెరుస్తాయి.

చంద్రబాబు ప్రవేశపెట్టిన నూతన ఆర్థిక సంస్కరణలను సమర్థించేవాళ్ళు కుప్పం ప్రయోగం, దానివలన సాధ్యమయ్యే వేల ఎకరాల సాగుభూమి, కొన్ని వేల టన్నుల పంటల ఎగుమతులు, దానివలన వచ్చే కోట్ల రూపాయల రాబడి అనే గణాంకాలు ముందుకు తెస్తుంటే చంద్ర బాబు వ్యతిరేకులు చూపించేవి కోట్లలో ఉండే మదుపు, కొన్నికోట్లలో ఉండే కన్సల్టెంట్ల ఖర్చులు, ఈ ప్రాజెక్టును అమలు చేసే క్రమంలో జరిగిన భారీ అవకతవకలు, క్షీణించే వ్యవసాయ కూలీల ఆర్థిక స్థితిగతులు.

గత ఎన్నికలలో చంద్రబాబు ఓడిపోయి వై ఎస్ ఆర్ ఆధ్వర్యంలో కొత్త ప్రభుత్వం అధికారంలోకి రాగానే కుప్పం ప్రయోగం కూడ రాజకీయంగా మారి, తెలుగుదేశం ప్రారంభించిన కుప్పం ప్రాజెక్టును కాంగ్రెస్ ప్రభుత్వం నిలిపివేసారని కొన్ని వదంతులు పుడితే, అదినిజం కాదు విజయనగరం, రంగారెడ్డి జిల్లాలలో నిలిపివేసారు అని, కుప్పంలో తాత్కాలికంగా నిలిపివేసినా తిరిగి ప్రారంభించడానికి ఒప్పందం కుదుర్చుకొని మూడు సంవత్సరాలకు రు. 13.76 కోట్లు మంజూరు చేసిందని మరోవార్త. అసెంబ్లీలో చర్చల సందర్భంగా చంద్రబాబు మానస పుత్రికగా పేరు తెచ్చుకున్న కుప్పం ప్రాజెక్టుమీద వేడిగా సాగిన చర్చల ఫలితంగా కార్పొరేటీకరణ క్రమంలో వచ్చిన ఇజ్రాయిల్ వ్యవసాయ పద్ధతులు కుప్పం వంటి వర్షాభావ ప్రదేశంలోని వాతావరణ పరిస్థితులకు అనుగుణంగా ఉండి అనుకున్న ఫలితాలు సాధించగలవా లేక వ్యవసాయరంగంలో కార్పొరేటీకరణ క్రమం విజయవంతం కావడానికి సామాజిక వ్యవస్థాపరమైన అడ్డంకులు ఏమన్నా ఉన్నాయా అనికాకుండ - కుప్పం ప్రాజెక్టు తప్పక కొనసాగిస్తామని వ్యవసాయ మంత్రి రఘువీరారెడ్డి హామీ ఇచ్చి అందులో జరిగిన అవకతవకలను పరీక్షించటానికి



న్యాయవిచారణ కమిటీని వేయడానికి ఒప్పుకోవడం జరిగింది. ఈ నేపథ్యంలో మేం చల్దిగానిపల్లి వెళ్ళటం జరిగింది. మా సర్వే ఉద్దేశ్యం ఈ ప్రాజెక్టు మొత్తం మీద సక్సెస్ అయిందా ఫెయిల్ అయిందా అని చూడటంకంటె వ్యవసాయరంగంలో అధికోత్పత్తులు సాధించటానికి తలపెట్టిన ఈ కొత్త విదేశీ ప్రయోగం ఏమిటి? దీన్ని ఎలా చేస్తారు? అక్కడ రైతుల మీద దీని ప్రభావం ఏమిటి? దీని ద్వారా చల్దిగానిపల్లిలో వచ్చిన మార్పులేమిటి? అని అధ్యయనం చేయటం మాత్రమే.

చల్దిగానిపల్లి కుప్పం జమీందారీలో ఒకగ్రామం. 200 గడపపైగా ఉన్న ఈ గ్రామంలో ఆర్థికపరంగా బలంగా ఉండే రెడ్డి కులస్తులు, అన్ని గ్రామాలలోలాగానే శ్రమచేసే ఎస్.సి.లు ముందుగా మనకు కనిపిస్తారు. మిగతా గ్రామాలలో సన్నకారు రైతులు తమ జీవనోపాధి నిమిత్తం భూస్వాముల దగ్గరనుండి ఒకటి లేక రెండు ఎకరాల సాగుభూమిని గుత్తకు తీసుకుని తమ నిత్యావసరాలు తీర్చే

ఆహారపంటలు పండించుకుంటారు. కాని ఈ గ్రామంలో దీనికి విరుద్ధంగా జరుగుతోంది. ధనికరైతులు, భూస్వాములే కాకుండా కొంతమంది సన్నకారు రైతులు కూడ తమ పొలాలను బి.హెచ్.సి అగ్రో (ఇండియా) అనే విదేశీకంపెనీ అనుబంధ సంస్థకి, రాష్ట్ర ప్రభుత్వం ప్రోత్సాహంతో, ఎటువంటి లిఖితపూర్వక ఒప్పందాలు లేకుండానే, గుత్తకు ఇచ్చివేసారు. ఈ కంపెనీ ఇజ్రాయిల్ దేశానికి చెందినదని, అది ఎడారి ప్రదేశం కావటం, అంటే వర్షపాతం, జనసాంద్రతలు తక్కువగా ఉండటంతో, నీటి కొరత ఉన్నాకూడా అధికరాబడినిచ్చే పంటలు పండిచ్చే శాస్త్రీయ జ్ఞానం, సాంకేతిక నైపుణ్యం, ఈ వ్యవసాయపద్ధతులలో ఉండే మెళకువలు వారికి తెలుసునని, వాటిని ఇక్కడ చేసి చూపించే నిమిత్తం ఆంధ్రప్రదేశ్‌కి చంద్రబాబు ఆహ్వానించగా వచ్చిన కంపెనీ ఇది. ఎక్కువ విలువనిచ్చే ఎగుమతి ప్రాధాన్య పంటలు ఎంచుకోవడం, లోతుగా తవ్వటం, నీటి చుక్కల వ్యవసాయం (బిందు వ్యవసాయమన్నా, డ్రిప్ ఇరిగేషన్ అన్నా ఇదే), నీటిని బహుజాగ్రత్తగా వాడే మెలకువలు, ప్రతి నీటిచుక్కకూడ మొక్క చుట్టూ ఉండే నేలకు అందేటట్లు గాకుండా మొక్కవేళ్ళకు మాత్రమే అందేటట్లు చేసే ప్లాస్టిక్ పైపుల వాడకం, పంటకు కావలసిన నీటి చుక్కలు, రసాయనిక ఎరువుల మోతాదును నియంత్రించే మీటర్లు ఈ 'ఎడారి' వ్యవసాయానికి ముఖ్యాంశాలు.

ఈ పద్ధతులనుపయోగించి బేబికార్న్, గెర్కిన్, పెద్దసైజు టొమాటో, బీన్సు, వంకాయ, పసుపు పచ్చ క్యాప్సికం (మిరప), ఊదారంగు కాబేజి లాంటి స్వల్పకాల పంటలు (60-80 రోజులలో కోతకి వచ్చే పంటలు అవడంతో ఏడాదికి 3 లేక 4 పంటలు పండించ వచ్చును) పడించే పద్ధతులు ప్రవేశపెట్టారు.

ఈ నీటి చుక్కల వ్యవసాయం జరుగుతున్న పొలాలు చూస్తే అందులో ఎన్నో మీటర్ల పొడవు ఉన్న ప్లాస్టిక్ పైపులు పొలంలో సమాంతరంగా ఉండే చాళ్ళలో వరుసగా పరచి వేయబడి ఉంటాయి. ఇంక మొక్కలను నాటడానికి ఎంతశ్రద్ధ చూపాలంటే ఈ చిల్లుల కెదురుగా మొక్క వచ్చేటట్లు రెండు జానలకొక మొక్కనాటాలి. ఈ పైపులో ఉండే చిల్లుల ద్వారా రసాయనిక ఎరువులు కలిపిన నీళ్ళు మొక్క వేళ్ళకు అందుతాయి. పొలం అంతా పరిచిఉన్న ఈ పైపులను చూడగానే శరీరమంతా వ్యాపించి ఉండే నాడీమండలం గుర్తు రాకమానదు. ఇటువంటి నీటిచుక్కల వ్యవసాయం మూలాన వర్షాభావ ప్రదేశాలలో కూడా తక్కువ నీటిని ఉపయోగించి ఎక్కువ దిగుబడి తీసుకురావటం, స్వల్పకాల పంటలు వేయడం, హైదరాబాద్ లాంటి ఇతర ప్రదేశాలకేకాక అమెరికా, యూరపు లాంటి విదేశాలకు కూడ ఎగుమతి చేసి ఎక్కువ రాబడి సంపాదించవచ్చునని ఒక అంచనా.

ఒక రిపోర్టు ప్రకారం బేబికార్న్‌కి ఒక ఎకరానికి రు. 5,000 - 8,500, గెర్కిన్‌కి రు.15,000 - 25,000 నికరఆదాయం వస్తుందని ఒక అంచనా. గెర్కిన్ పంటను పుడ్ ప్రాసెసింగ్ యూనిట్స్ కొని ప్రాసెస్ చేసి బ్రైన్ వాటరు (వాడుక భాషలో ఉప్పునీరు), వినిగర్ మిశ్రమంతో నిలువ చేయడం (ఇది మన ఊరగాయకి మరో ప్రత్యామ్నాయ మన్నమాట), వీటిని మద్రాసు పంపి అక్కడనుండి ఓడల ద్వారా అమెరికా, యూరపు దేశాలకు ఎగుమతి చేయడం జరుగుతుంది. పొలం నుండి బయలుదేరి అమెరికా చేరేక్రమం అంతాకూడా కోల్డ్‌స్టోరేజ సహాయంతోనే జరుగుతుంది.

ఇటువంటి వ్యవసాయ పద్ధతులనాచరించటం మూలాన అధిక ఉత్పత్తి, దానిలో అధికాదాయం వచ్చే అవకాశం ఉందని, దీనికి సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానం అక్కడనుండి ఇక్కడకు బదిలీ చేసే ఉద్దేశ్యంతో ప్రయోగాత్మకంగా ఇజ్రాయిల్ కంపెనీ ఈ ప్రాజక్టను చేపట్టింది. ఇది చంద్రబాబు హయాంలో, ఆయన ఆధ్వర్యంలో ఆయన పాలసీలకనుగుణంగా ఆయన నియోజకవర్గంలో విదేశీ సాంకేతిక పరిజ్ఞానాన్ని వాడుకొని ఎగుమతులు పెంచుకొని ఆర్థికంగా మెరుగుపడగలమనే భావనతో వ్యవసాయరంగంలో ప్రవేశపెట్టిన కార్పొరేటీకరణ ప్రయోగం అవడంతో ప్రస్తుతం దీనికొక రాజకీయపు రంగు ఆపాదించబడింది.

చిత్తూరు నుంచి వి.కోట దాటి కుప్పం వెళ్ళే రహదారిలో ఉండే చల్దిగానిపల్లి కనుమరుగవవచ్చునేమో కాని కార్పొరేటు వ్యవసాయాన్ని కుప్పంలో ప్రవేశపెట్టే ప్రయోగాలు చేసిన బి.హెచ్.సి. (బీటా హరిటా కంపెనీ) అనే ఈ కంపెనీ ప్రత్యేకంగా మనకు దర్శనమిస్తుంది. పల్లె పరిస్థితులకు విరుద్ధంగా ప్రస్ఫుటంగా కనిపించే కంపెనీ సైన్ బోర్డు, విశాలమైన కాంపౌండు, లోపల ఎవరున్నారో ఏం జరుగుతోందో అనే విషయాలు బయటకు తెలియకుండా ఉండటానికా అన్నట్లు చుట్టూగోడ, ప్రవేశ ద్వారం, దాని దగ్గర ఒక సెక్యూరిటీ గార్డు. అనుమతితో లోపలికి ప్రవేశించిన తరువాత ప్రయోగ పద్ధతిలో పండించే పెద్దటొమాటోలు, ఆ స్థలాన్ని శుభ్రం చేస్తూ, పండిన టొమాటోలను కోసి గంపలకెత్తే ఇద్దరు ఆడకూలీలు కనిపిస్తారు. బి.హెచ్.సి. కార్యాలయంలోపల ఇజ్రాయిల్‌కి చెందిన ఇద్దరు అధికారులు తప్ప మిగతా వారంతా తెలుగు వారే, వ్యవసాయ శాస్త్రంలో డిగ్రీలు ఉన్నవారే.

వారితో మాట్లాడినపుడు తెలిసిన విషయాలు ఇలా ఉన్నాయి: బి.హెచ్.సి (ఇంటర్‌నేషనల్) అనే కంపెనీ ఇజ్రాయిల్ దేశానికి చెందిన కంపెనీ. ఎడారిప్రాంతమైన ఇజ్రాయిల్‌లో నీటి చుక్కల వ్యవసాయం జయప్రదంగా జరపడం చూసి చంద్రబాబు స్వయంగా ఆహ్వానిస్తే 1996లో ఆంధ్రప్రదేశ్ వచ్చి బి.హెచ్.సి. అగ్రో (ఇండియా) అనే పేరుతో ఒక కంపెనీని స్థాపించారు. ఇజ్రాయిల్‌తో వాతావరణ సారూప్యం - అంటే నేల, నీరు, వర్షపాతం, గాలిలో తేమ, వెలుతురు వగైరాలు - అన్నీ శాస్త్రోక్తంగా

పరిశీలించి కుప్పం మండలంలో ఎన్నుకున్న రెండు గ్రామాలలో ఒకటి చల్దిగానిపల్లి. ఏయే పంటలు తమ నిర్దిష్ట వ్యవసాయ పద్ధతులకు ఈ గ్రామంలో సరిపోతాయో పరీక్షించి పది పంటలు ఎంచుకున్నారు. వీరికి అవసరమయ్యే సాగుభూమిని, సుమారు 200 ఎకరాల వరకు, స్థానికంగా ఉండే రైతులను సర్కారు మధ్యవర్తిత్వంతో ఒప్పించి తాము గుత్తకు తీసుకుని ప్రస్తుతం ఎకరాకు రు. 11,000 అద్దె చెల్లిస్తున్నారు. ఇలా విడివిడిగా ఉండే పొలాలన్నిటిని ఒకే ప్లాటుగా కలిపివేసి అవసరమైన చోట మాత్రమే కూలీలను వాడుకొని మిగతా పనులన్నిటిని యంత్రసహాయంతో చేసి బేబీకార్న్, గెర్కిన్, టొమాటో, బీన్సులాంటి పంటలను పండించి చూపించారు. దీన్నే లోకల్‌గా డెమొ అంటారు. మార్కెట్ అవసరాల కనుగుణంగా పండిచే పంటలు నిర్ణయించుకోవటం దీని ముఖ్య ఉద్దేశ్యం. ప్రస్తుతం స్ట్రాబెరీ పండ్ల పంటని పండించే ప్రయత్నాలు చేస్తున్నారు. ఇంకా దీనికి కావలసిన ధనసహాయం రెండు, మూడు దశలలో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సబ్సిడీ రూపంలో, కన్సల్‌టెన్సీ డబ్బు రూపంలో అందిస్తే, రు.6.3 కోట్ల విలువగల యంత్రసహాయం రెండవదశలో జపాను నుండి వచ్చింది.

వారి మాటల్లో చెప్పాలంటే ఈ 200 ఎకరాలలో చేసి చూపించటం వలన వ్యవసాయదారులకు దీనికి సంబంధించిన పరిజ్ఞానం అందిందని 162 మంది రైతులు లబ్ధిదారులయ్యారని, పంట దిగుబడి రెట్టింపు అయిందని, ఏడాదికి 3 లేదా 4 పంటలు పండిస్తారని చెప్పారు. ఇక్కడ ఈ ప్రాజెక్టు ఫలప్రదం అయిందని, అందుచేత గుజరాత్ ప్రభుత్వం ఈ పద్ధతులను తమ రాష్ట్రంలో కూడ ప్రవేశపెట్టమని వీరిని ఆహ్వానించినట్లు చెప్పారు. ప్రస్తుతం తమ కంపెనీ పాత్ర కన్‌సల్టెన్సీ సర్వీస్ మాత్రమేనని, పంటలు పండించటంలో కాని ఈ పంట మార్కెట్ చేయటంలో కాని తమకు తిన్నగా పాత్రలేదని వివరించారు. ఇంక నాల్గవ దశలో 10,000 ఎకరాలలో ఆ వ్యవసాయ పద్ధతులు విస్తరించే కార్యక్రమం ఉందని చెప్పారు.

ఇంక రైతుల విషయానికొస్తే వారికి ఎకరానికి అద్దెగా ఇచ్చే రు. 11,000 తక్కువ అని, ఈ వ్యవసాయ పద్ధతులు పాటించటానికి మదుపు చాలా ఎక్కువని, సబ్సిడీలు బ్యాంకు రుణాలు ఉన్నా కూడా తమలాంటి చిన్నకారు రైతులకు లాభసాటిగా లేదని అనుకోవడంతో, డెమొ ప్రాజెక్టు పూర్తి అయిపోగానే తమ పొలాలను వెనక్కు తీసివేసుకొని కూరగాయలు పండించే ప్రయత్నంలో ఉన్నారు. చిన్నకారురైతులు నలుగురు కలిస్తే వీరి మొత్తం పొలం 10 ఎకరాలకు తక్కువకాకుండా ఉంటే, బి.హెచ్.సి. పూచీదారుగా ఉండి వీరికి బాంకుల ద్వారా రుణ సహాయం, అదీ డబ్బు రూపంలో కాక బిందుసేద్యానికి అవసరమయ్యే పరికరాల రూపంలో రైతులకు ఇప్పించటమే కాక వారేవచ్చి పైపులు వగైరాలను అమర్చి పెడతారు. కొంతమంది రైతులు బేబీకార్న్, గెర్కిన్, టొమాటో, బీన్స్‌లాంటి అధిక విలువనిచ్చే పంటలు వేసి బెంగుళూరు, హైదరాబాద్, మద్రాస్ లాంటి బయటి పట్టణాలకు, అమెరికాలాంటి బయటి దేశాలకు ఎగుమతులు చేస్తున్నారు.

కాని వ్యవసాయ కూలీలను కలిసినపుడు వాళ్ళు చెప్పిందేమిటంటే డెమొ సమయంలో చాలా బాగా పనులు దొరికేవని, ఇప్పుడు అటువంటిదేమీ లేక ఎపుడు కూలీ దొరుకుతుందో తెలియని అనిశ్చిత పరిస్థితులు వచ్చాయని అన్నారు. అంతే కాకుండా బి.హెచ్.సి. ద్వారా పని దొరికినా కూలీ ఎక్కువ అయినా కూడా ఎక్కువ సమయం శ్రమతో కూడిన పని అవటంతో అటువంటి పని చెయ్యటానికి వెనుకంజ వేస్తామన్నారు.

మళ్ళీ ఒకసారి ఈ డెమో ప్రాజెక్ట్ వలన వచ్చిన కొన్ని మార్పులు చూద్దాం. కొన్ని పరభాషా పదాలు (ముఖ్యంగా ఇంగ్లీషు పదాలు) వాడుక పదాలుగా మారాయి. బేబీకార్న్, బి.హెచ్.సి. కంపెనీ, ఇజ్రాయిల్, డెమొ, ఎక్స్‌పోర్ట్, కోల్డ్ స్టోరేజ, డ్రిప్ ఇరిగేషన్, గెర్కిన్ (ఏ భాషో తెలియదు). ఇంక పంటల విషయానికొస్తే ఎగుమతి ప్రధాన పంటలలో ముఖ్యంగా పేర్కొన వలసినవి బేబీకార్న్, గెర్కిన్. బేబీకార్న్ అంటే పిల్లమక్క, అంటే పిందెగా ఉండి గింజలు పట్టని మొక్కజొన్న కంకి అన్నమాట. ఇందులో పోషక విలువలు ఏమన్నా ఉన్నాయా లేక ఉత్తిపీచు (ఫైబర్)మాత్రమేనా అనే జ్ఞానం మనకు అందుబాటులో లేదు. ఇది సాధారణంగా భోజనంలో ఉండే ఆధరువుకాదు. మరి దీని ఉపయోగం ఏమిటంటే ఇది భోజనంలోకి ఒక వెరైటీనిచ్చే ఆధరువు. ఒకసారి నేను విమానంలో ఢిల్లీ వెడుతుంటే ఉదయం పూట ఇచ్చే ఫలహారం పాకెట్‌లో చిన్న దోసెముక్క, ఒక రొట్టెముక్క, సాంబారు, వడ, వీటన్నిటితోపాటు ఇచ్చేపండు ముక్కలు-గులాబీరంగుతొక్కతో ఉండే యాపిల్ ముక్క, నల్లగా ఉండే ఒక ద్రాక్షపండు, లేత ఆకుపచ్చని రంగులో ఉండే బత్తాయి తొన ఒకటి, ఆరంజి రంగులో ఉండే బొప్పాయి ముక్కతో పాటు ఒక తెల్లని చిన్న బేబీకార్న్ ముక్క కూడా పెట్టారు. అది ఎలా తింటారో కూడా నాకు తెలియలేదు. తరువాత ఒకసారి సూపర్ మార్కెట్‌లో సరుకులు కొంటానికి వెడితే ఒక చిన్న ప్లాస్టిక్ కవరులో తెల్లకడ్డీల్లాంటి చిన్న ముక్కలు పెట్టి బేబీకార్న్ అని పైన రాసారు. ఇది అందరు కూరలు కొనుక్కునే రైతు బజారులో దొరికే వస్తువు కాదు. అంటే ఇది కడుపునింపి ఆకలితీర్చే సరుకు కంటె కూడా ఒక ఫ్యాన్సీ, ఎక్సాటిక్ సరుకు అని, ధనవంతులు, ఉన్నతవర్గాలవాళ్ళు కొనే విలువయిన సరుకని, తమ భోజనంలో విదేశీయులు తినే సరుకు కాబట్టి తాము కూడా దీన్ని షోకు కోసం ఒక ఆధరువుగా పెడతారని తెలిసింది.

ఇంక రెండోది గెర్కిన్‌పంట. ఇది వడలి పోయిన చిన్న దొండకాయ అంత ఉంటుంది. ఇది చాలా (సుకుమారమైన) పంట

అని, పదునైన దారం సహాయంతో ఒక్కొక్క గెర్కిన్ తెంపాలని చెప్పారు. వీటిని ఫుడ్ ప్రాసెసింగ్ యూనిట్లకు పంపిస్తే వాళ్ళు పెద్ద యంత్రాల సహాయంతో నియంత్రిత ఉష్ణోగ్రతలో ఉడకబెట్టి ముందు చెప్పినట్లుగా ఉప్పు నీళ్ళు, వెనిగర్ ఉన్నసీసాలో నిలువచేసి మద్రాసు, అక్కడి నుండి ఓడలలో విదేశాలకు కోల్డ్ స్టోరేజిలో ఉంచి ఎగుమతి చేస్తారు. ఈ గెర్కిన్ కూడా మన ఆహారపు అలవాట్లలో భాగం కాదు. ఇది కూడా ఒక ఎగ్జాటిక్ పంట కిందే వస్తుంది. కుప్పం ప్రాజెక్ట్ వలన ఎగ్జాటిక్ పంటలు కూడా అధిక మొత్తంలో పండించే క్రమం, వీటికి బయట డిమాండ్ చాలా ఎక్కువ ఉంటుందనే విషయం, వాటిని వివిధ ప్రదేశాలకు ఎగుమతి చేసి డబ్బు సంపాదించ వచ్చుననే జ్ఞానం అక్కడి రైతులకు కలిగింది. మిగతా టొమాటో, బీన్సు లాంటి వాటికి కూడా స్థానికంగా ఉండే డిమాండుని కూడా గుర్తించారు.

చల్దిగానిపల్లి గ్రామం వెళ్లగానే పిల్లమక్క, దీని సుకుమారం, వీటిఎగుమతులు, నీటిచుక్కల వ్యవసాయం గురించిన ప్రస్తావన తప్పకుండా వస్తుంది. ఇవన్నీ చూడగానే ఈ సర్వేలో భాగంగా, కరీంనగర్‌లో మేము వెళ్ళిన చిన్నారం గ్రామం, చల్దిగానిపల్లికి విరుద్ధంగా ఉండే గ్రామం, ఠక్కున జ్ఞాపకానికి వచ్చింది.

చిన్నారం గ్రామంలో అడుగు పెట్టగానే కళ్ళకు కొట్టొచ్చినట్లు కనబడేది ప్రతి ఇంటి బయట ఎండ బెట్టిన పెద్ద పెద్ద మక్కలు (మొక్కజొన్న కంకులు. వీటిని స్థానికంగా మక్కలని పిలుస్తారు. 300 కుటుంబాలకు పైగా ఉన్న ఈ గ్రామంలో భూస్వాము లున్నారు, పెద్ద, చిన్న రైతులున్నారు. ప్రతి ఇంటికి బయట ఉండే ముందు పెరడు, వెనుక పెరడు, ఇంటికప్పులమీద, ఆరుబయట ఏ చిన్నస్థలం ఖాళీగా ఉన్నాకూడా వాటి మీద పెద్ద పెద్ద మక్కలు మనకు కనిపిస్తాయి. గ్రామ గ్రామం అంతా ముదురు పసుపు పచ్చ రంగు అద్దుకున్నట్లు అనిపిస్తుంది. గ్రామంలో ప్రతి ఒక్క కుటుంబం ఈ మక్క పంట పండించడంలో భాగం పంచు కుంటారు. ఒక వ్యవసాయకూలీ, అంటే సొంత భూమిలేని కూలీ, ఇంటికి వెడితే అక్కడ కూడా పెరడులో పండించిన మక్కలు కనిపిస్తాయి. ఈ ఇంట్లో మూడు రాళ్ళు పొయ్యిగా చేసి పుల్లముక్క చితుకులతో నిప్పుచేసి పగిలిన కుండపెంకులో మక్కగింజలు పోసి వేయించి పేలాలు (వీటినే పాప్‌కార్న్ అని అమ్ముతుంటారు)చేసి తినమని పెట్టారు. ఇంకా ఈ మక్కగింజలతో ఏం చేస్తారంటే ఉడకబెట్టి తింటారని, రుబ్బి వడలు చేసుకుంటారని, మక్క పిండితో రొట్టెలు, బజ్జీలు చేసుకుంటారని చెప్పారు. గింజలు తీసేసిన తరువాత మిగిలిన బెండుని పశువులు తింటాయన్నారు. అంతేకాకుండా వ్యాపారి ఇంటికి వచ్చి మక్కలు కొనుక్కొని పోతాడని, అక్కడినుండి కోళ్ళకు మేత తయారుచేసే ఫ్యాక్టరీలకు పోతాయని చెప్పారు.

అంటే పెద్ద మక్కకి ఎన్నో రకాల ఉపయోగాలు - కొన్ని తన కుటుంబానికి తిండికి పనికివచ్చేవి, కొన్ని మార్కెట్ ద్వారా డబ్బు సంపాదించడానికి ఉన్నాయన్నారు. ఇలా చూసినప్పుడు స్థానిక ఆహారపు అలవాట్లలో పెద్దమక్క ముఖ్యమైన సరుకు అని తెలుస్తుంది. ఇది పండించే పద్ధతుల గురించి ప్రశ్నిస్తే, విత్తనం చల్లిన తరువాత అది మొలకెత్తే సమయంలో కొంచెం వర్షంపడితే మక్క బాగా పండుతుందని. కలుపుమొక్క కూడా రాదని, అదేకాకుండా వారు గ్రామం బయట వ్యవసాయపు కూలీ పనులకు వెళ్ళి వచ్చేసరికి పంట తయారుగా ఉంటుందని చెప్పారు. వర్షం సరియైన సమయానికి రాకపోతే ఇంక అంతే సంగతులు, పంటమాట మరచిపోవాలన్నారు.

కుప్పంలో పిల్లమక్కని చిన్నాపూర్‌లోని పెద్దమక్కని త్రైపారు వేసి పోల్చి చూడాలంటే మనం కొన్ని ప్రశ్నలు వేసుకోవాలి. సమాజం మెత్తాన్ని దృష్టిలో ఉంచుకొని వ్యవసాయ క్షేత్రంలో మార్పులు చేయడం ద్వారా సమాజం అభివృద్ధి చెందుతుందని దీనిలో భాగంగానే సారూప్యం ఉండడంతో వ్యక్తులు కూడా అభివృద్ధి చెందుతారన్నది సిద్ధాంతపరమైన ఒక వాదన. వ్యక్తిని దృష్టిలో ఉంచుకుని వ్యక్తులు అభివృద్ధి చెందుతూ ఉంటే అది సమాజానికి అభివృద్ధి కారకమౌతుందని మరొక వాదన. ఇటువంటి సమాజం-వ్యక్తి ఒక దానితో ఒకటి అన్యోన్య సంబంధాలు (లింకేజెస్) కలిగి ఉంటే ఒక దానిలో వచ్చే మార్పులు రెండోదానిలో కూడ మార్పులకు దారి తీస్తాయి. అప్పుడు ఆ రెండువాదనలు రాజకీయంగా పోటీపడతాయి. ఇక్కడ సమాజంలో అభివృద్ధి సాధించటానికి తీసుకువచ్చే ఏ మార్పు అయినాసరే వ్యక్తుల అభివృద్ధికి దోహదం చేయలేనపుడు 'అభివృద్ధి అంటే ఏమిటి?' అనే మౌలికమైన ప్రశ్నను సేన్ గారు ముందుకు తెచ్చారు. ఈ నేపథ్యంలో సమాజపు అభివృద్ధితో సరిపెట్టుకోకుండా వ్యక్తిని కేంద్రంగా తీసుకొని, వ్యక్తి అభివృద్ధిని అంచనా వేయడం, సమాజపు అభివృద్ధికి కావలసిన సంబంధాలు ఉన్నాయా లేదా అని పరిశీలించటం చెయ్యవలసి వస్తుంది. ఈ క్రమంలో మనం స్వయంగా పంటలు పండించే వ్యవసాయదారులను - కుప్పంలో పిల్లమక్క, చిన్నాపూర్‌లో పెద్దమక్క - పోల్చి చూద్దాం. మక్క ఉపయోగాలు, పండించటానికయ్యే మదుపు, దీనివలన ఏర్పడే సంబంధాలని దృష్టిలో ఉంచుకొని చూద్దాం.

ముందుగా మక్క పంటలు దాని ఉపయోగాలు చూద్దాం. కుప్పంలో పండించే పిల్ల మక్క సమాజంలో పై అంతస్తులో ఉండే కొద్దిపాటి కుటుంబాలు, విదేశీయులవవచ్చును మనదేశంలోని కుటుంబాలవవచ్చును, పోషక విలువలతో సంబంధం లేకుండా భోజనంలో సరదాకోసం వాడే ఒక ఆధరువు. ఇది రైతుకు మార్కెట్ ద్వారా అధిక ఆధాయం సంపాదించే సరుకు. చిన్నాపూర్‌లోని

పెద్దమక్క, ముందుచెప్పినట్లుగా, గొప్ప బీద అనే తేడాలు లేకుండా ప్రతి కుటుంబంలోను భోజనంలో ఒక అవసరమైన, పోషకవిలువలను సమకూర్చే ఆధరువుగా అమరిపోవడమే కాకుండా ఇంటి పశువుల గ్రాసంగా, కోళ్లమేత తయారు చేసే ఫ్యాక్టరీలకు ముడిసరుకుగా, వ్యవసాయదారునికి అనేకరకాలుగా ఉపయోగపడే పంట ఇది.

అంతే కాకుండా పిల్లమక్క మారకపు విలువ ఉన్న మార్కెట్ ఆధారిత పంట అని, బయట నుండి వచ్చే డిమాండు మీద ఆధారపడుతుందని, మార్కెట్ అనగానే, దేశమార్కెట్ అయినా విదేశీమార్కెట్ అయినా, ధరలలో అనూహ్యమైన హెచ్చు తగ్గులుంటాయని, దీని వలన రైతులకు అనిశ్చిత పరిస్థితులు ఎక్కువగా ఉంటాయని తెలుస్తుంది. రైతు ఏరకమైన పంటని పండించాలి, ఎన్ని ఎకరాలలో పండించాలి, ఎట్టువంటి పద్ధతులను ఉపయోగించి పండించాలి, ఎవరికి ఎంత ధరకి అమ్మాలి అనే విషయాలు బయటి నుండి వచ్చే డిమాండ్ ద్వారా నిర్ణయించబడుతాయి. దీనికి తోడు టెక్నాలజీ ట్రాన్స్‌ఫర్(సాంకేతిక పరిజ్ఞానం బదలాయింపు) అనేదికూడా ప్రాముఖ్యత వహించి రైతుకి ఇంకొకరి మీద ఆధారపడటం అనే గుణం అంకురిస్తుంది.

చిన్నాపూర్‌లోని పెద్దమక్క కుటుంబం రోజువారీ అవసరాలకు అనేకరకాలుగా ఉపయోగపడటమే కాకుండా, మారకపు విలువకూడా ఉండటంతో కుటుంబంలో ఆర్థికావసరాలను తీర్చే సరుకుగా కూడ ఉపయోగపడుతుంది.

రెండో విషయం పండించటానికి అవసరమయ్యే మదుపు. నీటి చుక్కల వ్యవసాయాన్ని అనుకరిస్తూ పిల్లమక్కని పండించటానికి రైతుకు మదుపు (ఇన్‌వెస్ట్ మెంట్ - పైపులు, మీటర్లు, నీళ్ళ ట్యాంకులు, నేల దున్నేయంత్రాలు వగైరా, మిగతాపనులు అజమాయిషీ , కలుపుఏరివేత, పంట పదును చూసి కోయడం, కోల్డు స్టోరేజ్‌ని వాడటం, సుకుమారంగా చేసేపనులు, బి.హెచ్.సి. వారి పర్యవేక్షణ, విత్తనాలు, రసాయనిక ఎరువులు, పురుగుల మందులు సమయానికి సమకూర్చుకోవడం లాంటి అవసరాలు) ఖర్చు చాలా ఎక్కువ. ఆ రకం పంట పండించటాన్ని అధికమదుపు - అధిక అనిశ్చితత- అధికలాభం అనే స్లోగన్‌గా చెప్పుకోవచ్చును. పెద్ద మక్కకు విత్తనం కొనటానికి అయ్యే ఖర్చు తప్ప మిగతాది ఉండకపోవటంతో, ఇంకా ఈ పంట ధృడమైనది అవడంతో పురుగులమందు, రసాయనిక ఎరువుల అవసరం ఉండక మదుపు నామ మాత్రంగా ఉంటుంది. చిన్నమొత్తం - అధికలాభం అనే స్లోగన్‌గా దీన్ని చెప్పుకోవచ్చును.

మూడవది లింకేజెస్. పిల్లమక్క పంటకి ఎటువంటి లింకేజెస్ వస్తాయో చూడాలంటే పండించే రైతుకి - దీన్ని ఉపయోగించే వారికి మధ్య ఉండే దూరం ఒక సూచిక. ఈ దూరం ఎక్కువగా ఉంటే లింకేజెస్ ద్వారా వచ్చే ప్రభావం బలంగా కనిపించింది. పెద్దమక్క ఉపయోగాలు పండించే రైతుకుటుంబం వాడుకోవటం, ఇంట్లో పశువులకు గ్రాసంగా ఉపయోగ పడటమే కాక ఫ్యాక్టరీలలో చికెన్‌ఫీడ్‌గా మారే క్రమంలో రైతుకి ఆర్థికావసరాలు తీర్చడమే కాక అక్కడి ఉద్యోగావసరాలు కూడా తీరుస్తుంది. ఈ పంట బయటనుండి వచ్చే డిమాండ్ మీద ఆధార పడకపోవడంతో, సప్లై ఎక్కువ అయిన కొద్దీ దాని ఉపయోగాలు కూడ పెరుగుతాయి.

ఈ లింకేజెస్ విషయానికొస్తే పిల్ల మక్కకి ఇవి తక్కువగా కనిపిస్తాయి. పంట పండించటంలో ఏ చిన్నమార్పు వచ్చినా, చివరికి రసాయనిక ఎరువులు కలిపిన నీటి చుక్కలు ఏ కారణం చేతనయినా నాలుగు చుక్కలు ఎక్కువ పీడనంతో మొక్క వేళ్ళకి తగిలితే పంట ఏ ప్రభావానికి లోనవుతుందో చెప్పలేము. అంతేకాకుండా అధికోత్పత్తి సాధించే ఏ చిన్న మార్పును ప్రవేశపెట్టినా, ఉదాహరణకి యంత్రాలలోమార్పు, పంటలమార్పు, పంటలు పండించే పద్ధతులలో మార్పు - లింకేజెస్ తక్కువగా ఉండటం మూలాన స్థానిక సమాజానికి వచ్చే ఉపయోగం పరిమితంగా ఉంటుంది. అలాకాకుండా చిన్నాపూర్‌లో పెద్దమక్క పండించే పొలాలకు సాగునీరు ఇవ్వటం, కల్తీలేని మంచి విత్తనం సప్లై చెయ్యటం, కోళ్ళఫారం కాని డైరీఫారం కాని పెంచి దాని ద్వారా మక్కకు డిమాండ్ పెంచటం వంటి మార్పులు ప్రవేశపెడితే అధికోత్పత్తులు సాధ్యమయ్యే అవకాశం ఉంది. లింకేజీలు ఉండటం మూలాన ఈ అధికోత్పత్తుల వలన వచ్చే ప్రభావం గొలుసుకట్టుగా సమాజంలో వ్యాపించి ఈ మార్పుల ప్రభావం కనిపించే అవకాశం కూడా ఉంది. గొలుసు కట్టుగా మార్పులు వచ్చే సమాజంలో ఉత్పత్తిని పెంచే ప్రతి చిన్న మార్పుకూడా రైతుల అభివృద్ధికి, తద్వారా సమాజపు అభివృద్ధికి దోహదం చెయ్యగలవు. 'చూసినేర్చుకోవడం' అనే గుణం ఉన్న వ్యవసాయరంగంలో, హెచ్చించుకుంటూపోయే ప్రభావం ఉన్న ఇటువంటి మార్పులను మిగతా ప్రదేశాలలో అనుసరించవచ్చును.

ఒక్క మాటలో చెప్పాలంటే వ్యవసాయరంగంలో ప్రవేశపెట్టిన కార్పొరేట్ పద్ధతుల ప్రభావం వలన మార్కెట్ ఆధారిత పంటలు, ఉదాహరణకు మనకు బాగా తెలిసిన పత్తిపంట, పండించే రైతుల ఆత్మహత్యలుంటాయేమో కాని కుటుంబ అవసరాలు తీర్చే మక్కజొన్న రైతుల ఆత్మహత్యలు మనం వినం. ❑

# ఏ వెలుగులకీ ప్రస్థానం?

- వి. హనుమంతరావు

**అది రెండవ ప్రపంచ యుద్ధ కాలం. ప్రపంచాన్నంతా ఆక్రమించాలని హిట్లర్ కలలుకన్నాడు. అమెరికాకు కాళ్లు వణికాయి. జర్మనీవద్ద ఆటం బాంబువుందేమో. తానే ఆదరాబాదరాగా పరిశోధన ప్రారంభించింది. అపుడు ప్రముఖ శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ తాను సేకరించిన సమాచారం ప్రకారం జర్మనీ వద్ద ఆటంబాంబు లేదని తెలుసుకొని, అమెరికా పాలకుల వద్దకు పోయి, హిట్లర్ వద్ద ఆటంబాంబు లేదు కదా, మీ పరిశోధన ఆపివేయమని చెబితే వినిపించుకోకుండా... ముందుకు సాగి ఆటంబాంబు తయారుచేసి, జపాన్ మీద ప్రయోగించారు. హిట్లర్ బాంబుతయారు చేయనేలేదు కాని అమెరికా బాంబును తయారు చేయడమేకాదు ప్రయోగించింది. అలాంటి అమెరికా పాలక వర్గంతో కరచాలనం చేయడానికి ప్రధాని అమెరికా వెళ్లాడు. అంతకు ముందే చేసుకున్న రక్షణ ఒప్పందం మీద తన ఆమోదముద్ర వేశారు.**

అపుడు ప్రపంచాన్నంతా ఏలాలని హిట్లర్ అంటే ఇపుడు అమెరికా అధ్యక్షుడు జార్జి బుష్ అదే కల కంటున్నాడు. ఆకలను సాకారం చేసుకోవడానికి అమెరికా ప్రయత్నిస్తాంటే ఖండించటంపోయి, ప్రధాని మన్‌మోహన్‌సింగ్ తన వంతు సహకారాన్ని అందిస్తానని సంతకం పెట్టారు! సంతకం పెట్టారంటే అమెరికా ప్రపంచాధిపత్య విధానానికి సమ్మతిని తెలియచేసినట్లే. ఇది మన దేశ విధానమా? పార్లమెంటు చర్చించిందా? ప్రజాస్వామిక వాదినని, పార్లమెంటరీ విధానంలో విశ్వాసమున్నవాడినని చెప్పుకొనే ప్రధాని పార్లమెంటును విశ్వాసంలోకి తీసుకోలేదు. దేశాన్ని ముంచేసిన ఆర్థిక సంస్కరణలను పి.వి.ప్రవేశపెట్టినపుడోరోజు ఇలాగే పార్లమెంటును సంప్రదించకుండానే ప్రవేశపెట్టారు. కాంగ్రెస్ పార్టీ పార్లమెంటు అంటే ఎంత గౌరవం ఇస్తుందో ఇది మనకు తెలియచేస్తుంది. నెహ్రూ మంత్రి వర్గంలో రక్షణ మంత్రిగా వున్న కృష్ణమీనన్ అమెరికాను బాస్టర్డ్ అని తిడితే, అదే పార్టీకి చెందిన మన్‌మోహన్ బుష్‌ను గొప్ప ప్రజాస్వామికవాది అని కితాబిస్తున్నారు. కాంగ్రెస్ మారిందా? అమెరికా మారిందా? ఆ రోజున కృష్ణమీనన్ అటువంటి పద ప్రయోగం చేసాడంటే అది తన దేశం, స్వతంత్రం, సార్వభౌమత్వం, స్వాభిమానాన్ని తెలియచేస్తుంది. మన్‌మోహన్ అమెరికావెళ్లక ముందు రక్షణ మంత్రి ప్రణబ్ ముఖర్జీ వెళ్లి రక్షణ ఒప్పందం చేసుకోవటం, ఇంకా అంతకు ముందు బ్రిటన్ వెళ్లి, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పాలనకు కితాబులిచ్చిరావడం చూస్తే, వ్యక్తిగతంగా నిష్కళంకుడైన మన్‌మోహన్ అంటే ఎటువంటి అభిప్రాయం మీకు కలిగి వుంటుందో నేను ఊహించగలను.

**ఏ విషయంలో సంతృప్తి?**

అమెరికా అధ్యక్షుడు బుష్‌తో జరిపిన చర్చలపట్ల ప్రధాని సంతృప్తి వ్యక్తం చేయటం మామూలుగా రెండు దేశాల అధినేతలు కలుసుకున్న తర్వాత విడుదల చేసే సంయుక్త ప్రకటనలో పేర్కొనటం షరామామూలే. ఆయనకు సంతృప్తి ఏవిషయాల్లో కలిగిందట? మేటలు వేసిన ఆటంబాంబుల గుట్టమీద కూర్చొన్న అమెరికాతో అణుశక్తి శాంతియుత ప్రయోజనాల గురించి జరిపిన చర్చలు సంతృప్తి కలిగించాయట. అంటే అణుశక్తిని మీరిప్పటిలాగే శాంతియుత ప్రయోజనాలకు పరిమితమై వుండండి, ఆ లక్ష్మణ రేఖను దాటవద్దని అమెరికా భారత్‌ను హెచ్చరించడమే. ఈ విష గుళికను పంచదార పూతపూసి మింగేస్తే, ఆముదం ముఖం పెట్టకుండా బావుంది, బావుందని ప్రధాని అనటమే విశేషం. అరబ్ ఇంధనం మనకు అవసరమే, అందులోనూ చమురు ధరలు అంతర్జాతీయంగా చుక్కలు చూస్తుంటే అణు ఇంధనం ఉత్పత్తి మన దేశానికి అవసరం కూడా. కాని ఈ సందర్భంలో కొద్దికాలం క్రితం మన అణు కేంద్రాలకు ఏదో అవసరం పడి అమెరికా సహాయాన్ని అర్థిస్తే మన దేశానికి బ్లాక్ మార్క్‌వేసి, అటువంటి సహాయం అందించబోమని ఆంక్షలు విధించిన విషయం పాఠకులకు గుర్తుండే వుంటుంది. ఇపుడు బుష్ ఆ ఆంక్షలను తొలగించారా? తొలగించినా కాలికివేస్తే మెడకు, మెడకు వేస్తే కాలికి లంకెవేసి పితలాటకం పెట్టడంలో అమెరికా అందెవేసిన చెయ్యి. ఏమైనా ఈ విషయం గురించిన వివరాలు ఇంకా మనం తెలుసుకోవాల్సి వుంది. ఎందుచేతనంటే ఇరువురు సంయుక్తంగా ఏర్పాటు చేసిన పత్రికా విలేకరుల సమావేశంలో బుష్ మాట్లాడుతూ "ఇంతటి ముఖ్యమైన విషయంలో పరిష్కారం కనుగొనేందుకు చర్చ ప్రారంభించాం" అని అనటం గమనార్హం. చర్చ ప్రారంభించాం అని బుష్ అంటే "ఈ క్లిష్ట సమస్యకు పరిష్కారంలో బుష్ వ్యక్తిగతంగా ఆసక్తి చొరవ తీసుకున్నందుకు సంతోషిస్తున్నా"నని ప్రధాని అనటం చూస్తే, ఈ పాటి దానికే ప్రధాని సంతృప్తిని వెలిబుచ్చటంతో అమెరికా మన ప్రధానికి కుచ్చుటోపీ పెట్టిందేమోనన్న అనుమానం కలుగుతోంది.

ప్రధానికి సంతృప్తి కలిగించిన రెండో విషయం కాశ్మీర్ గురించినది. పాకిస్తాన్, భారత్ దేశాలు రెండూ ఈ సమస్యను పరిష్కరించుకోవాలని చెప్పటం పాతపాటే. ఈ సమస్య పరిష్కారానికి ఉభయ దేశాలను అమెరికా "ప్రోత్సహిస్తుంద"ని బుష్ అనటంలోని ప్రమాదాన్ని గ్రహించాలి. ఈ విషయంలో మూడో దేశపు ప్రమేయం లేకుండా పరిష్కరించుకోవాలని భారత్ చాలా కాలంగా చెబుతూంటే, నేను అందులో వేలుపెడతాను అని అమెరికా అనటంలో గల కుత్సిత బుద్ధి గమనించాలి. అమెరికా పాకిస్తాన్ అనుకూల వైఖరి అందరికీ తెలిసిందే. ఇరు పక్షాలు శాంతియుతంగా సమస్యను పరిష్కరించుకొంటే అమెరికా పాలక వర్గాల చేతుల్లో వున్న ఆయుధ కర్మాగారాలకు గిరాకీ తగ్గిపోతుంది. అందుచేత కుదరకుండా చూడటం అమెరికా విధానంగా వుంటూ వచ్చింది. తాజాగా ఎఫ్-16 యుద్ధ విమానాలను పాకిస్తాన్‌కు అమ్మటం, కావాలంటే మీకూ అమ్ముతాం అంటూ భారత దేశాన్ని ముద్దిగిల్లటం చూస్తూనే వున్నాం. మన్‌మోహన్‌కు అమెరికాలో ఘనస్వాగతం వలకటం, ఎత్తైత్తు పీట వేయటంలోనే మతలబువుంది. అమెరికా భారత్‌వైపు మొగ్గుచూపించి పాకిస్తాన్ పాలకులను ఎచ్చవేయటం, పాకిస్తాన్ భారత్ పట్ల మళ్లీ కఠిన వైఖరి అవలంబించటం, అపుడు అమెరికా ప్రవేశించి ఇద్దరికి సర్దిచెప్పటం - ఇదంతా అమెరికా ఆడుతున్న నాటకం. అమెరికా "ప్రోత్సహించటం" అంటే అసలు ఉద్దేశం ఇదే. ఇది మన్‌మోహన్‌కు ఎలా సంతృప్తి కలిగించిందో ఆయనే చెప్పాలి.

భారత్, అమెరికా ఉమ్మడి భద్రత లక్ష్యం గురించి కూడా ఏకాభిప్రాయానికి రావటం ప్రధానికి సంతృప్తి కలిగించటం మరోవిశేషం. అసలు, ఈ రెండు దేశాలకు ఉమ్మడిగా వుండే భద్రతా లక్ష్యాలేమిటో ఇరువురు నేతలు వివరించలేదు. దేశ రక్షణ వేరు, భద్రత వేరు. భద్రత అంతర్గత విషయం, రక్షణ దేశానికి సంబంధించిన విషయం. మన దేశంలో అయోధ్యపై టెర్రరిస్టుల దాడి మన అంతర్గత భద్రతకు సంబంధించిన విషయం. అమెరికాపై బిన్‌లాడెన్ దాడి ఆదేశ అంతర్గత భద్రతా విషయం. ఇందులో ఉమ్మడి భద్రత అనే ప్రశ్నే ఉదయించదు. అలాంటపుడు ఏకాభిప్రాయానికి తావేలేదు. పోతే, దేశ రక్షణ విషయానికి వస్తే, ప్రపంచంలో ఏ దేశంలో తన ఇష్టంలేని ప్రభుత్వం ఏర్పడితే, లేదా తన చెప్పుచేతల్లో ఉండడానికి నిరాకరించిన ఏ దేశమైనా వుంటే అది తమ దేశ రక్షణకు ప్రమాదకరమని భావించే అమెరికాకు, మనకు ఉమ్మడి రక్షణ సమస్యలేమి వుంటాయో అర్థం కావటంలేదు. ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్ లోని చమురు నిక్షేపాలను కైంకర్యం చేసే దురుద్దేశం మనసులో పెట్టుకొని, టెర్రరిస్టుల అణచివేత పేరుతో ఆ రెండు దేశాలమీద దాడి చేసిన అమెరికా, లాటిన్ అమెరికా దేశాలు అమెరికా ఉక్కు పిడికిలి నుంచి బయటపడి స్వతంత్ర దేశాలుగా మనగలగడానికి ప్రయత్నిస్తే ఆ దేశాలను ముప్పుతిప్పలు పెడుతున్న అమెరికా, ఇరాన్ సహాయంతో ఇరాక్‌ను స్వాధీనం చేసుకొని, ఇపుడు ఇరాన్ మీదే దాడి చేస్తున్న అమెరికా, ప్రపంచా న్నంతటిని చాపచుట్టి చంకలో పెట్టుకోవడానికి ప్రయత్నిస్తున్న అమెరికా, రక్షణ ఆలోచనలకు, మన దేశ ఆలోచనలకు మధ్య ఉన్న ఉమ్మడి లక్ష్యమేమిటో ప్రధాని తెలవివ్వాలి. అసలు ప్రపంచంలో టెర్రరిస్టులను (బిన్‌లాడెన్‌తో సహా) పెంచిపోషించిన అమెరికాయే అతి ప్రమాదకరమైన టెర్రరిస్టు. ఈ టెర్రరిస్టు ప్రపంచంలో టెర్రరిజాన్ని రూపుమాపుతామని ప్రకటిస్తుంటే మన ప్రధాని ముగ్ధులైపోవటమా? ప్రపంచంలోని ఏడు వింతలతో పాటు ఈ ప్రకటనలు, ఈమెచ్చుకోళ్ళు ఎనిమిదవ వింతగా పరిగణించాలి.

సరే, వ్యాపారం, ఎగుమతులు, దిగుమతులు, ద్రవ్య సంస్క రణలు, పెట్టుబడులు లాంటివి కూడా జనరల్‌గా ఉభయులు చర్చించి వివరాలన్నీ ఉభయ దేశాల సి.ఇ.వో.లకు వదిలిపెట్టేశారు. మన దేశం నుంచి ప్రధాని తీసుకుని వెళ్లిన వారిలో రతన్‌టాటా, ముఖేష్ అంబానీ, దీపక్ పరేఖ్, నందన్‌నిలెకనీ, పి.సి.రెడ్డి, బాబా కళ్యాణి, వై.సి.దేవేశ్వర్ లాంటి కార్పోరేట్ సంస్థల యజమానులున్నారంటేనే వారేమి చర్చించారో ఊహించుకోవ డానికి శ్రమ పడాల్సిన పనిలేదు. సహజంగానే వారు చర్చించేవి విదేశీ పెట్టుబడులు, విదేశీ వ్యాపారం, నాన్-టారిఫ్ బారియర్లు లాంటివే. అమెరికా సి.ఇ.వో.లకు కావాల్సినవి మన బాంకుల్లో విదేశీ ఈక్విటీ పెట్టుబడుల పెంపుదల, ఇన్సూరెన్స్ రంగంలో ప్రవేశం, పెన్షన్ ఫండ్ పెట్టుబడులులాంటివి. ఈ విషయాలన్నిం టిగురించి మన ప్రభుత్వంలోని ప్రపంచ బ్యాంక్ అనధికార ప్రతినిధులు ఇదివరకే రంగం సిద్ధం చేస్తూ వచ్చారు. అమెరికా సి.ఇ.వో.లు ఏమీ శ్రమ పడాల్సిన పనిలేదు. వాళ్లది ఆర్థిక సమస్యాకాదు, ద్రవ్య సమస్యాకాదు, భారత దేశ పాలకులు అనుమతిస్తారా లేదా అనే భయమూలేదు. వాళ్ల భయం అల్లా రాజకీయ అవసరాల దృష్ట్యా భారతదేశ పాలకులు వామ పక్షాల ఒత్తిడికి లొంగిపోతారేమోననేదే. ఇప్పటిదాకా జరుగుతున్న తీరు చూస్తే ఆ భయానికి తావు లేదేమోననే అనిపిస్తుంది. వామ పక్ష ప్రతినిధులు ప్రభుత్వ పార్టీ నాయకులతో సమావేశాలు, అసమ్మతి ప్రకటనలు, అక్కడక్కడ చిన్న చిన్న ఉద్యమాలు తప్ప ప్రభుత్వాన్ని బొడ్నలో వేలుపెట్టి నిలదీసే పరిస్థితులు లేవని ఆ పార్టీల నాయకులే అంగీకరిస్తున్నారు. ఈ నేపథ్యంలో అమెరికాకు, ఆదేశ పెట్టుబడులకు, ఆదేశ బహుళ జాతి సంస్థలకు, ఆయుధాల బేహారులకు ఇక ముందు అడ్డంకులేమీ వుండబోవని ప్రధాని ఉపన్యాసాలు స్పష్టంగా తెలియచేస్తున్నాయి.

ప్రధాని పర్యటన, ఆ పర్యటనలో ఆయన చేసిన ప్రకటనలు ఒక ఎత్తయితే, అంతకుముందు అమెరికాతో చేసుకున్న రక్షణ ఒప్పందం లాంటి ప్రమాదకరమైన పరిణామం ఇటీవలి కాలంలో

ఎపుడూ జరగలేదు. ఏ దేశ రక్షణ ఆ దేశానికి అత్యంత రహస్యమైన విషయం. ఒక దేశ సార్వభౌమత్వాన్ని రక్షించేది రక్షణ శాఖ. అలాంటి రక్షణ శాఖ తలుపులు బార్లా తెరిచి, అమెరికా ప్రవేశానికి అవకాశం కల్పించిందీ రక్షణ ఒప్పందం. ఈ ఒప్పందంలో, రక్షణ మంత్రి, ప్రధాని చేసిన ఉపన్యాసాల్లో, అలాగే అమెరికా అధ్యక్షుడు చేసిన ప్రసంగాల్లో "వ్యూహాత్మక సంబంధాల" గురించి ప్రస్తావించటం జరిగింది. ఏదేశానికాదేశానికి అభివృద్ధికి, రక్షణకు ఒక వ్యూహం ఉంటుంది. ఉండాలి కూడా. కాని అమెరికాకు మనకు వ్యూహాత్మక సంబంధాలేమిటి? ఏవిషయంలో? రక్షణ ఒప్పందంలో ఈ ప్రస్తావన వచ్చింది కాబట్టి, ఉభయ దేశాల వ్యూహం లక్ష్యమేమిటి? ఎవరిమీద? ఎవరికోసం? చాలాచోట్ల ఈ భాగస్వామ్యం ప్రస్తావన వచ్చింది. ఉదాహరణకు రక్షణాయుధాల తయారీలో ఉభయుల భాగస్వామ్యానికి వస్తే, పత్రికల్లో వచ్చిన వార్తల ప్రకారం రిపేర్, ఓవర్‌హాల్, మెయింటెనెన్స్, సర్వీసింగ్, అమెరికా ఆయుధాల ఎగుమతులకు కేంద్రంగా పనిచేయటం ఇవన్నీ భారత దేశంలో జరుగుతాయట. మన కారుకు మోటార్‌కార్‌షెడ్ మెకానిక్ ఎలాంటివాడో, మన దేశం అమెరికాకు అలాంటి మోటారు షెడ్ అన్నమాట. ఇదీ భాగస్వామ్యం భాగోతం. ఈ రక్షణ ఒప్పందంపై చర్చల సందర్భంలో మిలిటరీ, నేవీ, ఎయిర్‌ఫోర్స్ అధికారులంతా ఉండటం ఒక ముఖ్య విశేషం.

ఈ సందర్భంలో మన రక్షణ బడ్జెట్ గురించిన కొన్ని గణాంకాలను ఉటంకించటం సమయోచితంగా వుంటుంది. దేశం కేంద్ర ప్రణాళికలో పెట్టుబడి పద్దుకింద కేటాయింపు (రాష్ట్రాలకు చేసే సహాయం మినహాయించి) రు.26217 కోట్లయితే, రక్షణ శాఖలో పెట్టుబడి పద్దు, అంటే ఆయుధాల కొనుగోలుకు కేటాయింపు 04-05లో రు.33483 కోట్లు. మన ప్రణాళిక కేటాయింపులు ఎలా తలకిందులుగా వున్నాయో, ఈ గణాంకాలు తెలియచేస్తాయి. మొత్తం రక్షణ శాఖ బడ్జెట్ 04-05లో రు.89136 కోట్లు అయినా, అనేక ఇతర సెమీ-మిలిటరీ విభాగాలకు, స్పేస్, అణు విద్యుచ్ఛక్తి విభాగం మిలిటరీ కార్యక్రమాలకు తోడ్పడుతున్నాయి కాబట్టి వాటి బడ్జెట్ - ఇవన్నీ కలుపుకుంటే రక్షణకోసం ఖర్చు చేస్తున్నది లక్షకోట్ల రూపాయలు!

ఇపుడు ప్రణబ్ సంతకం చేసిన రక్షణ ఒప్పందం కథా కమామీషు ఏమిటో తెలుసుకుందాం. ఆమధ్య ఎనిమిదడుగులపైగా ఎత్తువున్న ఒక యువకుడు మన ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డిని కలిసినపుడు తీసిన ఫోటో పత్రికల్లో చూచి పాఠకులు ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. అలాగే బ్రిటన్ పౌరులు లిల్లీపుట్ అండ్ గోలియత్ అనే కథను పుస్తకాల్లో చదువుకొన్నారు. పదిరోజుల క్రితం నిజంగా పొట్టివాడైన మన రక్షణ మంత్రి ప్రణబ్‌ముఖర్జీ అమెరికా డిఫెన్స్ సెక్రటరీ ఆఫ్‌స్టేట్ రమ్స్‌ఫెల్డ్‌ను కలిసినపుడు తీసిన ఫోటో పత్రికల్లో చూచినపుడు మాత్రం అటువంటి వినోదం కలగలేదు సరికదా, అలా కలిసేందుకు ఇద్దరూ సంతకాలు చేసిన రక్షణ ఒప్పందంలో వివరాలు చూచి మన రక్షణశాఖ తలుపులు బార్లా తీసి అమెరికాను ఆహ్వానించటం చూచి ఔరా, మన పాలకులు ఎంతకైనా తగుదునురా అని అనిపించింది. 'తాకట్టులో భారతదేశం' అని ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు తరిమెల నాగిరెడ్డి రాసిన పుస్తకం, 'అమ్మకానికి ఆంధ్రప్రదేశ్' అని సీనియర్ జర్నలిస్ట్ ఎన్. వేణుగోపాల్ రాసిన పుస్తకం చదివినపుడు గుండె లబలబా కొట్టుకోగా, ఇప్పుడు ఈ ఒప్పందం మన దేశ సార్వభౌమత్వాన్నే అమెరికా పాదాలవద్ద వుంచిన వైనం చూచి మనం స్వాతంత్ర్యం సాధించుకొన్నది ఇలా కృష్ణార్పణం చేయడానికేనా అని అనిపించింది.

అమెరికా అధ్యక్షుడు బుష్‌తో చర్చలకు వెళ్లిన మన ప్రధాని "ఇండియా అమ్ముడుపోదు" అని గంభీరమైన ప్రకటన చేశారు. మన్‌మోహన్జీ, అమ్మకానికి ఏమైనా మిగిలి వుందా అని ప్రశ్నించాల్సి వస్తుంది. పైన గాలిలో, భూమ్మీద, భూగర్భంలో అన్నిటిని ఇప్పటికే విదేశాలకో, విదేశీ పెట్టుబడులకో కట్టబెట్టారు. మన ద్రవ్య, ఆర్థిక విధానాల్ని ప్రపంచ బ్యాంకు కబ్జా చేసింది. ప్రపంచ బ్యాంకు క్లియర్ ఇవ్వకుండా పార్లమెంటు సభ్యులకే అందటం లేదు. తాజాగా ప్రణబ్ రక్షణ శాఖ చిట్టాలను అమెరికా సైనికాధికారుల ముందు తెరిచిపెట్టారు. మన సహజ వనరులమీద అమెరికా పేటెంట్ హక్కులు భుక్తం చేసుకొంటే నోరువెళ్లబెట్టి చూస్తున్నాం. మన వ్యవసాయాన్ని విదేశాల నుంచి దిగుమతి చేసే విత్తనాలమీద ఆధారపడే విధంగా ప్రభుత్వమే ప్రోత్సహిస్తోంది. ఉప్పు, చింతపండు అమ్ముకొనే షావుకారు దుకాణాల నుంచి పాన్‌షాపుల వరకూ అందరినెత్తిన శఠగోపం పెట్టే వాల్ మార్ట్ బహుళజాతి రిటెయిల్ సంస్థకు ద్వారాలు తెరుస్తూంది. బాంకుల్లో 74 శాతం వరకు విదేశీ ప్రయివేటు పెట్టుబడులకు అవకాశం కల్పించారు. ఇన్సూరెన్స్ రంగం, ద్రవ్యరంగంలో కూడా అమెరికా కాలుపెట్టింది.

అమెరికా, తదితర అభివృద్ధి చెందిన దేశాల అధిపతులకు అడుగులకు మడుగులొత్తేది ప్రపంచ బాంకు. ఆ బాంకుకు గులాంగిరి చేసే విధంగా భారత ప్రభుత్వం తన విధానాలను అమలు చేస్తూంది. అలా అమలు కావటానికి తనకు అనుకూలంగా వుండేవారిని దేశంలో కీలక స్థానాల్లో కూర్చోబెట్టింది బాంకు. మన్‌మోహన్ సింగ్, అహ్లూ వాలియా, చిదంబరం, రంగరాజన్ - వీరంతా బాంకు ఉప్పుతిన్నవారే. అలాంటపుడు పరిణామాలు ఇలాకాక మరెలా వుంటాయి? గత కొద్ది వారాలుగా విదేశాంగ మంత్రి నట్వర్‌సింగ్, తాజాగా రక్షణ మంత్రి ప్రణబ్ అమెరికా సందర్శనలు ఎక్కువయ్యాయి. ఈ నేపథ్యంలో ప్రధాని చర్చల కోసం అమెరికా వెళ్లారు.

భారతదేశాన్ని తన వలలో వేసుకోవటం అమెరికా తాజా ఎజండా మీదకు రావటంలో ఆశ్చర్యం లేదు. తన అనుంగు

మిత్రుడు జపాన్ ఆసియాలో కొడిగడుతున్న దీపంగా తయారైంది. చైనా మొత్తం ఆసియానే కబళించే స్థితికి చేరుకుంటూంది. ఫిలిప్పైన్స్, దక్షిణ కొరియాలు కొన్ని ఆసియా దేశాలను ప్రభావితం చేసే పరిస్థితులు క్షీణిస్తున్నాయి. రష్యా, చైనా, ఇండియాలు దగ్గరయ్యే సూచనలు కనుపిస్తున్నాయి. ఈ శతాబ్దం మొదట్లో 21వ శతాబ్దం ఆసియాదే అనే ఫోర్‌కాస్ట్‌లు వెలువడ్డాయి. కొన్ని ఆసియా దేశాలు (భారత దేశంతో కలిపి) వివిధ రంగాల్లో, ముఖ్యంగా ఆర్థిక ప్రాముఖ్యత గల రంగాల్లో దగ్గర కావటానికి సమావేశాలు జరుగుతున్నాయి. ఈ పరిణామాలన్నీ ఒక ఎత్తయితే, అమెరికానే ఆర్థిక రంగంలో సవాల్ చేసే విధంగా చైనా ప్రపంచ దేశాల దృష్టినే ఆకర్షిస్తోంది. సోవియట్ యూనియన్ ప్రపంచ పటం నుంచి అంతర్థానమైన తర్వాత ప్రపంచాన్నే తన పాదాక్రాంతం చేసుకోవాలనే తన వ్యూహానికి, ఈ పరిణామాలన్నీ అమెరికాకు ఒంటిమీద తేళ్ళు, జెర్రెలు పాకుతున్నట్లుంది. ఇవి అలానే కొనసాగితే ఆసియా మీద పెత్తనం చలాయించాలనే ఆశకు నీళ్లొదులుకోవాల్సిందే. అదీకాక అమెరికాకు యుద్ధాలంటే చాలా ఇష్టం. ప్రపంచంలో ఎక్కడో ఒక చోట యుద్ధం జరుగుతూండాలి. అలా జరుగుతూంటేనే అమెరికాలో యుద్ధ సామగ్రిని తయారు చేసేకంపెనీలకు గిరాకీ ఏర్పడుతుంది. ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్ ఇందుకు ఉదాహరణలు. ఇరాన్ మీద కూడా యుద్ధ నీడలు కమ్ముకొంటున్నాయి. పాకిస్తాన్‌కు యుద్ధసామగ్రి, విమానాలు అమ్మి ఇండియాను, అలాగే తిరుగుటపాలో ఇండియాకు అమ్మి పాకిస్తాన్‌ను రెచ్చగొట్టి అమెరికాలోని యుద్ధ సామగ్రి తయారు చేసే బేహారులకు అక్కడి ప్రభుత్వం వత్తాసు పలుకుతుంది. *"1998లో మన రక్షణ బడ్జెట్ 41 వేల కోట్ల రూపాయలుండగా 2005లో 83 వేల కోట్లకు పెరిగింది. అందులో రు.34,375 కోట్లు కేవలం ఆయుధాల కొనుగోలుకే కేటాయించటం జరిగింది. అంటే రక్షణ రంగ బడ్జెట్ కేటాయింపులో 41 శాతం అన్నమాట. గత ఆరు సంవత్సరాల్లో భారత దేశం చైనా తర్వాత రెండవ పెద్ద ఆయుధాల కొనుగోలు దేశంగా ఏర్పడింది.... అమెరికాలో ఎన్నికల సమయంలో జార్జిబుష్‌కు అమెరికా బహుళ జాతి సంస్థలు మద్దతునిచ్చాయి..... అమెరికా బహుళ జాతి సంస్థలకు పాకిస్తాన్‌కు యుద్ధ విమానాలను అమ్మించటం ద్వారా అమెరికా అధ్యక్షుడు సహాయం చేయగలుగుతారు. భారత్‌కు యుద్ధ విమానాలను అమ్మేందుకు అమెరికాతోపాటు బ్రిటన్, ఫ్రాన్స్, స్వీడన్ దేశాల బహుళ జాతి సంస్థలు కూడా సిద్ధంగా వున్నాయి. భారత్, పాకిస్తాన్‌ల మధ్య సంబంధాలు మునుపెన్నడూ లేనంత మెరుగ్గా ఉన్నాయి. శాంతిని కోరుకునేవారు పెరిగారు. ప్రజల మధ్య రాకపోకలు పెరిగాయి. రెండు దేశాలు శాంతిని కోరుకునేటప్పుడు పెద్ద ఎత్తున యుద్ధ సామాగ్రిని సమీకరించుకోవడమెందుకు?"* (డాక్టర్ ఎ.శ్రీనివాసులు, కాకతీయ విశ్వవిద్యాలయం). దీన్ని బట్టి భారత్, పాకిస్తాన్ల మధ్య యుద్ధ వాతావరణం చల్లబడిపోకుండా వుండటమే అమెరికా లక్ష్యం. అప్పుడే ఉభయదేశాల్లో చనిపోయే వారితో శవాల మీద అమెరికా డబ్బులేరుకోవచ్చు.

అటువంటి కుట్రలు పన్నుతున్న అమెరికాపాలకులతో చర్చించడానికి మన్‌మోహన్‌సింగ్ వెళుతున్నారంటే భారతీయులమైన మనం ఏమనుకోవాలి? తన కుట్రలో మన దేశాన్ని ఎలాగోలాగు ఇరికించటం ధ్యేయంగా పెట్టుకొన్న దేశంతో మన దేశానికి కామన్ విషయాలేముంటాయి చర్చించడానికి? అమెరికా మెనూలో మనకు రుచించేదేముంటుంది? ఈ ప్రయత్నంలో భారత్‌ను అనునయించటం, బేరాలాడడం, ఇచ్చి పుచ్చుకోవటం, బెదిరించటం లాంటివన్నీ అమెరికా ఎంచుకొన్న ఆయుధాలు. స్వయం పోషకం, స్వయం సమృద్ధి దిశగా అడుగులేస్తున్న మన దేశాన్ని సంస్కరణల పేరుతో గాడి తప్పించింది. పంట పండించుకోవడానికి కూడా మోన్‌సాంటో లాంటి బహుళజాతి సంస్థల మీద ఆధారపడేలా చేయటంలో కృతకృత్యురాలైంది.

ఈ నేపథ్యంలో రక్షణ రంగంలో ఒప్పందం, (దానికి ఫ్రేమ్‌వర్క్ అనే ఆకుకు అందని పోకకు పొందని పేరుపెట్టారు) ఆ ఒప్పందం నేపథ్యంలో ప్రధాని అమెరికా పయనం,-బుష్‌తో సంప్రదింపులు జరుగనున్నాయి. ఈ వ్యాసం మీరు చదివేనాటికి ఉభయ దేశాల ప్రధానుల ఉమ్మడి ప్రకటన వచ్చేసేవుంటుంది. ఆ ప్రకటనలో ఏముంటుందో అని ఎదురు చూడాల్సిన పనిలేదు. భారతదేశానికి ఐక్యరాజ్య సమితి సెక్యూరిటీ కౌన్సిల్‌లో సభ్యత్వం గురించి అమెరికా తన సమ్మతిని తెలుపబోదు. ఆర్థిక రంగంలో మనల్ని అమెరికామీద మరింత ఆధారపడేలా చేసే విషయం వుంటుంది. మన దేశం నుంచి మరిన్ని రాయితీలను అమెరికా రాబట్టుకుంటుంది. దానికి బదులుగా అమెరికా విసిరే కాసిన్ని ఎంగిలి మెతుకులు మనకు లభిస్తాయి. మన ప్రధానికి స్వాగతం పలుకడానికి అమెరికా పెద్ద ఎత్తున ప్రయత్నాలు చేస్తూంది. ఎన్నడూ లేనివిధంగా ఏర్పాట్లు చేస్తుంది. ఇదివరలో ఎన్.డి.ఎ. ప్రభుత్వ హయాంలో ఫెర్నాండెజ్ వెళ్లినపుడు చేసిన 'మర్యాద'లు మన ప్రధానికి కూడా జరక్కుండా వుంటే అదే పదివేలు. ఇక్కడ మన రాష్ట్రంలో మన ముఖ్యమంత్రికి రక్షణ యంత్రాంగం అపుడపుడు మంత్రులనే ఇబ్బంది పెట్టే సంఘటనలు మన ప్రధానికి జరక్కుండా వుంటాయనే ఆశించవచ్చు. మన ప్రధాని చేతిలో కోర్కెల పత్రం (విష్ లిస్ట్) ఏమి లేదంటున్నారు. కాని అమెరికాకు వుందని పై విశ్లేషణ తెలియచేస్తుంది. ఎలాగోలాగు మన ప్రధాని మెడలువంచి భారతదేశంలో అమెరికా తన రక్షణ స్థావరాన్ని లాంఛనంగానైనా ఏర్పాటు చేయడానికి ఒత్తిడి చేసి సాధించుకొంటుంది. అమెరికా రైలు బండిలో భారతదేశం ఒక కంపార్టుమెంటు అవుతుంది. బుష్ వెనుక మన్‌మోహన్ సింగ్ లెఫ్ట్ రైట్, లెఫ్ట్ రైట్! ❑

# సాగునీటి ప్రాజెక్ట్‌ల ప్రయోజనమెవరికి?

- ఇప్పు వీరారెడ్డి
ఆంధ్రప్రదేశ్ రైతాంగ సమాఖ్య సహాయ కార్యదర్శి

'పల్లెబాట' 'రైతుచైతన్యయాత్ర' 'జలయజ్ఞం' తదితర ప్రచారాలతో తమ ప్రభుత్వంలో ఇక నుంచి రైతులు ఆత్మహత్యలు చేసుకునే అవకాశమే ఉండదని ప్రకటిస్తున్న కాంగ్రెస్ ప్రభుత్వ విధానంలో 'అక్క ఆరాటమేకాని బావ బతకడ'న్నట్లుంది రైతుల పరిస్థితి. ఉచిత విద్యుత్ సరఫరాతో పాటు, విద్యుత్ బకాయిల మాఫీ, విత్తనాలపై సబ్సిడీ, రుణాలప్పై వడ్డీ తగ్గింపు రాయితీ, వడ్డీమాఫీ, ప్రైవేటు రుణాలపై ఆరు నెలల పాటు 'మారిటోరియం' తదితర మరెన్నో ప్యాకేజీలను ప్రభుత్వం ప్రకటించినా వాటిని ఆత్మహత్యకు కారణం అవుతున్న అప్పుల సమస్యకు పరిష్కార మార్గంగా రైతు భావించడం లేదు.

రైతునెత్తిన గుదిబండలా పెరిగిపోయిన అప్పుల బరువు ఒకటుండగా, ఒక పంట కాలానికి గాను ప్రైవేటు, ప్రభుత్వ రుణ వసూళ్లను వాయిదా వేసినంత మాత్రాన రైతుకు శాశ్వత రుణవిముక్తి అయినట్లుకాదు. ప్రతికూల పరిస్థితిలో ఎన్నో ఏండ్లుగా చేస్తున్న సేద్యంలో సంభవించిన లక్షల నష్టాలతో పెరిగిపోయిన అప్పుల చెల్లింపు సమస్యను, కేవలం ప్రైవేటు రుణాలనో, ప్రభుత్వ రుణాల వసూళ్లనో ఆరునెలల కాలం పాటు వాయిదా వేయడం ద్వారా పరిష్కరించవచ్చని ప్రభుత్వం భావించినట్లయితే అంతకన్నా అసమంజసమైన విషయం మరొకటిలేదు.

'గత ప్రభుత్వం వ్యవసాయాన్ని దండుగమారి కార్యక్రమంగా ప్రకటించి నిర్లక్ష్యం చేసిన ఫలితమే నేటి ఈ రైతుల ఆత్మహత్యల దుస్థితి'ని ఆరోపిస్తున్న కాంగ్రెసు ప్రభుత్వం, మౌలికసమస్యల పరిష్కారంలో గత ప్రభుత్వం కంటే ఏవిధంగాను భిన్నమైన విధానాన్ని అవలంబించడం లేదు. వ్యవసాయంలో 'సర్వరోగ నివారిణి'గా నీళ్లగ్యారంటీ, నిండే గ్యారంటీ లేని ప్రాజెక్ట్‌ల నిర్మాణాన్ని 'జలయజ్ఞం'గా ఊదరగొడుతున్న ప్రచారం తప్ప, రైతు కొంపను కూల్చుతున్న నకిలీ విత్తనాల ప్రవేశాన్ని నివారించలేక పోతోంది. ఎప్పటివలెనే ఈ సారి కూడా స్థానిక హైబ్రిడ్ రకాల్లోనేకాక, బిటి రకంలో కూడా లక్షలాది నకిలీ విత్తన ప్యాకెట్లు మార్కెట్లను ముంచెత్తుతున్నాయి. రైతు పండించే పంటలకు గిట్టుబాటు ధరలు కల్పించడం తమ బాధ్యతగా ప్రభుత్వం గుర్తించడం లేదు. పత్తి, మిర్చి రైతులకు గిట్టుబాటు ధరలు లభించకపోవడంతో రైతులు వేలాది రూపాయల పెట్టుబడులను నష్టపోయారు. గతకొన్నేళ్లుగా పసుపు, పత్తి, మిర్చి లాంటి వాణిజ్యపంటలు, వేరుశనగ-ఆముదం-నువ్వులు లాంటి నూనె గింజలతో సహా మొక్కజొన్నలకు సైతం మద్దతు ధరలే లభించడం లేదు. మరొకపక్క గిట్టుబాటు కాని వాణిజ్య పైర్ల సాగును మానుకోవాలని, అలాంటి పంటలకు ప్రభుత్వమద్దతు ఉండదని హెచ్చరించిన ప్రభుత్వం, సుబాబుల్-యూకలిప్టస్ లాంటి వృక్షజాతులను పెంచాలని రైతులకు ఉచిత సలహాలిస్తోంది! 'ఏ పైరును ఏ ప్రాంతంలో ఎంత విస్తీర్ణంలో పండించాలి'అనే విషయంలో ప్రభుత్వం వద్ద సమగ్ర ప్రణాళికలేవీ లేవు. ఎలా చూసినా రైతుకు భవిష్యత్ వ్యవసాయంపై విశ్వాసం కలిగించే సమగ్రవిధానాలు రూపొందించడంలో ప్రభుత్వం పూర్తిగా విఫలమైంది. గిట్టుబాటుకు ఎంతమాత్రం అనుకూలంగా లేని పరిస్థితుల్లో సాగు నిర్వహిస్తున్న రైతుకు, ఎప్పటికప్పుడు కొత్తగా సంభవించే నష్టాలతో కలిసి మరింతగా పెరిగిపోతున్న రుణభారంలో కొద్ది మొత్తాన్నైనా రేపటికాలంలో వచ్చే ఫలసాయం ద్వారా రొక్కంగా చెల్లించగలమనే భరోసా కలగడం లేదు. మునుముందు కూడా ఇదే రకమైన అననుకూల పరిస్థితులు కొనసాగితే మరిన్ని నష్టాలు పాతరుణాలకు తోడవ్వడమే తప్ప, అప్పుల భారాన్ని శాశ్వతంగా దించుకునే మార్గమే లేదేమోనన్న భయాందోళనల్లో రైతులు చిక్కుకున్నారు. 'తమ ప్రభుత్వంలో ఇకనుంచి ఆత్మహత్యలు చేసుకునే అవకాశమే ఉండదంటూ'ముఖ్యమంత్రిగా ప్రజల సమక్షంలో ప్రమాణం చేస్తూ డాక్టర్ రాజశేఖర రెడ్డి చేసిన తొలి ప్రకటన నాటి నుండి ఈ రోజు వరకు రాష్ట్రంలో ఆగని రైతుల ఆత్మహత్యల పరంపరకిదే కారణం.

వ్యవసాయంలో కల్తీ విత్తనాలు, కరెంటుకోతలు, గిట్టుబాటులేని ధరలు లాంటి మౌలిక సమస్యల పరిష్కారానికి సమర్థవంతమైన విధానాన్ని రూపొందించి అమలు చేయకుండా, వడ్డీ తగ్గింపు రాయితీలని, వడ్డీ మాఫీ అనీ, సబ్సిడీపై విత్తనాలని ఇలా ప్రభుత్వాలన్నీ తాత్కాలిక 'తాయిలాల'ను ప్రకటిస్తున్నాయి. వడ్డీ తగ్గింపు రాయితీ వల్లనో, మొత్తం వడ్డీ మాఫీవల్లనో, విత్తనాలపై 50 శాతం సబ్సిడీ వల్లనో రైతుకు జరిగే ప్రయోజనం కొన్ని వందలకోట్లైతే కావచ్చుకాని, ఒక్కోసంవత్సరం కనీసం, మద్దతు ధరలు దొరక్క, కల్తీవిత్తనాలు, మోతాదుకు మించిన పురుగు మందుల వాడకం, కరెంటుకోతలు, కరువులు-వరదలు-వడగళ్ళు వంటి కారణాల వల్ల ఏటా కొన్నివేల కోట్ల రూపాయల పెట్టుబడులను రైతులు నష్టపోతున్నారు. ఒకపైరులోనో, ఒక

సీజన్‌లోనో జరిగిన నష్టాన్ని మరోపైరుతోనో, మరో సీజన్‌లోనో పూడ్చుకునే పరిస్థితిలేదు. పంటేదైనా, సీజనేదైనా సాగులో నష్టాలు అనివార్యమైతున్నాయి. ఏటేటా నష్టాలే వస్తున్నా, సాగుగిట్టుబాటుపై ఆశచావని రైతు నష్టాల సాగును చేస్తూనే ఉన్నాడు. ఈ పరిస్థితుల్లో సహకార-వాణిజ్య బ్యాంకుల్లో రుణం వాయిదాలు చెల్లించలేక అప్పుపెరిగిపోతోంది. గిట్టుబాటుకాని వ్యవసాయానికి, తద్వారా రుణం చెల్లించలేని పరిస్థితులకు కారణం అవుతున్న ప్రభుత్వాలే రైతును 'మొండి బకాయిదారు' 'బకాయిల ఎగవేతదారు'గా నిందిస్తున్నాయి!

12 లక్షల మంది కొత్తరైతులకు బ్యాంకు రుణాలు అందించడం ద్వారా రాష్ట్రంలో బ్యాంకురుణాలు పొందని రైతులెవ్వరూ మిగిలిలేని లక్ష్యాన్ని సాధించడం తమ ప్రభుత్వానికే సాధ్యమవుతుందని ముఖ్యమంత్రి ప్రకటించడం అభినందనీయమే. కానీ ఆ రుణం తిరిగి వసూలు చేసుకునే విషయంలో వ్యవసాయంలో వచ్చే ఫలసాయం ద్వారానే చెల్లింపు చేసుకోగలిగే అవకాశాలే రైతుకు లేనప్పుడు ఎంత పెద్ద మొత్తం రుణాలిస్తేనేం? ఎన్నిసార్లు రుణాలిస్తేఏం? రుణం చెల్లించడానికి రైతుకు అప్పుచేయడమే మార్గంగా ఉంటుంది.

నిజానికి ఏ రైతుకైనా బ్యాంకు నుండి మొదటి దఫా తీసుకున్న రుణం తప్ప, ఆ తర్వాత తీసుకుంటున్న రుణమేదీ వ్యవసాయంలో పెట్టుబడిగా మారడమే లేదు. బ్యాంకులు వేటిల్లోనూ ఖాతాదారులుగా ఉండని రైతుల్లో ఎక్కువమంది, తాము మొదటిసారి తీసుకున్న బ్యాంకు రుణాల్ని కూడా వ్యవసాయపెట్టుబడులుగా మార్చుకోలేని పరిస్థితిని ఎదుర్కొంటున్నారు. ఒకవేళ గతంలో బ్యాంకుల ద్వారానో, ప్రైవేటు వ్యక్తుల నుండో తీసుకున్న రుణాలను వ్యవసాయంలో పెట్టు బడులు పెట్టినా, సాగునష్టాల కారణంగా వీటిలో కొద్దిమొత్తాన్ని కూడా రాబట్టలేకపోతున్నారు. రోజు రోజుకు పెరుగుతున్న అవసరాలు ఒకవైపు, అప్పుచెల్లింపు విషయంలో బ్యాంకులు-ప్రైవేటు వ్యక్తుల ఒత్తిడులు మరొకవైపు కొనసాగుతున్న కారణంగా రైతులు తీసుకుంటున్న బ్యాంకు రుణాలు, ప్రైవేటు రుణాలు ఒక దానికొకటి చెల్లింపులుగానో, లేదా నిత్యావసరాల కోసమో ఖర్చుయిపోతున్నాయి. ఈ విషయంలో ఎక్కువసార్లు బ్యాంకు రుణాల చెల్లింపులకు ప్రత్యామ్నాయ మార్గంగా రైతులు ప్రైవేటు రుణాలను ఎంచుకుంటున్నారు. అప్పు రీ-షెడ్యూల్‌కు అవకాశం లేనప్పుడు బ్యాంకుల నిర్బంధ వసూళ్లను తట్టుకోవడానికి ప్రైవేటు రుణాలు తప్పనిసరి అవుతున్నాయి. దీన్ని అవకాశంగా తీసుకుంటున్న ప్రైవేటు వ్యక్తులు, కేవలం 10-15రోజుల వ్యవధికోసం (బ్యాంకుల్లో పాత అప్పు చెల్లించి తిరిగి కొత్త రుణం పొందడానికి మధ్య జరిగే కాలం) 5 నుండి 10 శాతం వరకు వడ్డీని వసూలు చేస్తున్నారు. వ్యవసాయేతర అవసరాల తోపాటు, ఇలాంటి వడ్డీ చెల్లింపులకోసం బ్యాంకుల నుండి రెండు మూడు దఫాలకొకసారి పాతరుణం పోను, మరికొంత కొత్తరుణాన్ని తీసుకుంటున్న పరిస్థితిలో బ్యాంకు ఖాతాలో రైతుపేరు మీద ఎప్పటికప్పుడు అప్పు పెరిగిపోతూనేఉంది. ఎప్పటికప్పుడు వడ్డీ + సర్వీసు ఛార్జీలను అసలుకు కలిపి ఒకే అడ్జెస్ట్‌మెంట్లు చేస్తూ దాన్నే రైతుకు తిరిగి తిరిగి రుణం చెల్లింపుగా చూపెడుతున్న ప్రభుత్వ విధానంలో, తీసుకుంటున్నప్పుడు ఆవగింజంత అప్పు చెల్లించే నాటికి గుమ్మడికాయసైజుకి పెరుగుతోంది.

తర తరాలుగా ఇంటిల్లిపాదీ పొద్దస్తమానం వ్యవసాయాన్నే చేస్తున్నా రైతుచేతిలో దమ్మిడీ స్వంతపెట్టుబడి కూడా పోగుపడడం లేదు. ఇటు బ్యాంకుల్లోనూ అటు ప్రైవేటు వ్యక్తుల వద్దా తాకట్టుపెట్టిన రైతు బతుక్కి రుణవిముక్తే లేకుండా పోతుంది. ఎప్పటికప్పుడు వ్యవసాయంలో నష్టాల కారణంగా ఏర్పడే లోటే తప్ప మిగులే లేని దుస్థితిలో సాగు నిర్వహణ కోసమే కాదు, రోజువారీ అవసరాల బతుకు బండి కూడా అప్పులు లేనిదే కదలడం లేదు. తిండిగింజలకు అప్పు, బట్ట-బాతలకు అప్పు, పండుగ-పబ్బాలకు అప్పు, ప్రయాణాలకు అప్పు, చదువు-సందెలకు అప్పు, ఆసుపత్రికి అప్పు, అల్లుడొస్తే అప్పు, ఆడపిల్లపెళ్లికోసం అప్పు, పురుడుకోసం అప్పు, చివరికి ఇన్నిరకాల అప్పుల మొత్తానికయ్యే నెలనెలా చెల్లించవలసిన వడ్డీ కోసం అప్పుచేయకతప్పటం లేదు. దీనితో రైతులు సాగు నిర్వహణ కోసం బ్యాంకుల నుండి తీసుకుంటున్న దీర్ఘకాలిక-స్వల్పకాలిక పంటరుణాలు వ్యవసాయంలో ఆధునీకరణకో, అభివృద్ధి కోసమో ఉపయోగపడకుండానే అప్పులుగా పెరిగిపోతున్నాయి. నిజానికి అనుకోకుండా సంభవించే ప్రకృతి విపత్తులు మినహా, ప్రభుత్వ విధానాల కారణంగా సంభవించే నష్టాలే లేనట్లయితే వ్యవసాయంలో రైతు అధైర్యానికి, ఆందోళనకు ఇంతగా అవకాశమే లేదు. ప్రభుత్వ సహకార- వాణిజ్య బ్యాంకుల్లో పెరిగిపోయిన ఇన్నిన్ని వేల కోట్ల అబద్ధపు రుణాల (వడ్డీతో పెరిగిన అప్పులే) అవసరమే రాకపోయేది! ఇంతపెద్ద మొత్తంలో పెరిగిపోయిన అప్పులు ఎన్నటికి వసూలు కావని తెలిసినా వాటిని చెల్లించే స్తోమత రైతుకు లేదని అర్థం అవుతున్నా, తరచుగా చేస్తున్న రుణ వసూళ్ల వత్తిడి కార్య క్రమం(బిందెలు ఎత్తుకెళ్లడం, తలె-తపాల, తలుపులు ఊడ దీయడం) రైతును అవమానాలకు గురిచేస్తూ ఆత్మహత్యలకు కారణం అవుతోంది. అప్పు జమ చేసుకోవడానికి తన పొలాన్ని బహిరంగవేలం వేయబోతున్నారన్న సహకార బ్యాంకు బహిరంగ వేలం ప్రకటనతో తీవ్రమనస్థాపానికి గురై, అవమానంతో కుంగి పోయిన మెదక్ జిల్లా రామాయం పేట మండలం నందిగామ గ్రామ రైతు రవిందర్ రావు ఆత్మహత్య సంఘటన ఇందుకు తాజా (12-4-2005) ఉదాహరణ.

వ్యవసాయంలో కల్తీ విత్తనాలు, కరెంటు కోతలు, సాగునీటి కొరత, గిట్టుబాటు లేని ధరలు లాంటి మౌలిక సమస్యల పరిష్కారానికి సమర్థవంతమైన విధానాన్ని రూపొందించి అమలు చేయకుండా, తక్కువ వడ్డీకి రుణాలు, విత్తనాలకు సబ్సిడీలు, వడ్డీ మాఫీలు మాత్రమే సంపూర్ణపరిష్కారం ఎన్నటికీ కాజాలవు. మరో అర్థశతాబ్దం పాటుగా ఇలాంటి పథకాలెన్ని కొనసాగించినా రైతు బతుకుల్లో మార్పేమీ రాదు. సంక్షోభం సమసిపోదు.

నిజానికి రైతులు ఎన్నడూ ఉచిత విద్యుత్ కోసమో, తక్కువ వడ్డీకి రుణం కోసమో, సబ్సిడీ విత్తనాలకోసమో ప్రత్యేక ఆందోళన లేమీ చెయ్యలేదు. సాగునీటి కోసం ఉద్యమించారు. కల్తీలేని విత్తనాలకోసం, నాణ్యమైన నిరంతర విద్యుత్ కోసం, గిట్టుబాటు ధరలకోసం ఆందోళనలు చేసారు. రైతుల చావుకు కారణం అవుతున్న ఈ రకమైన సమస్యల పరిష్కారానికి కనీసంగా కూడా శ్రద్ధ చూపని ప్రభుత్వాలు అడగందే 'సబ్సిడీ'లు, 'మాఫీ'లు, 'ఉచితా'లు ప్రకటిస్తున్నాయంటే వ్యవసాయాన్ని గిట్టుబాటుగా మార్చడంలో తమ వైఫల్యాలను కప్పిపుచ్చుకోవడానికే. మౌలిక సమస్యలు పరిష్కరించకుండా వ్యవసాయంపై ఆత్మస్థైర్యాన్ని, నమ్మకాన్ని దెబ్బతీసి, తమచేతిలోని విలువైన భూముల్ని కార్పొరేట్ రంగం చేతికి తమంత తాముగా అప్పగించేందుకు రైతును మానసికంగా సిద్ధం చేయడమే ప్రభుత్వాల లక్ష్యంగా కనబడుతోంది. ఇప్పటికే ఈ పరిస్థితి నిత్యం కరువుతో కటకటలాడుతూ ఎడారిగా మారిపోతున్న తెలంగాణ, రాయలసీమ, ఉత్తరాంధ్ర జిల్లాల్లోని వందలాది గ్రామాల్లో కనిపిస్తోంది. నిన్న మొన్నటిదాకా వ్యవసాయాన్ని ఎంతో అవసరంగా భావించి అపారమైన విశ్వాసంతో కొనసాగించిన రైతుకు నేడు అదే సాగు ఎందుకూ పనికిరాని కార్యక్రమంగా మారిపోయింది. జూదంగా మారిన వ్యవసాయంలో ఎప్పటికప్పుడు అదృష్టాన్ని పరీక్షించుకుంటూ ఓడిపోయి అలిసిపోతున్న రైతులు, భూముల్ని అడ్డికి పావుసేరుగా తెగనమ్మడానికి సిద్ధపడుతున్నారు. ఇదే అవకాశంగా ఎంచి నగరాల్లోని సంపన్న వర్గాలు (రాజకీయ నాయకులు, వ్యాపారవేత్తలు, ఉన్నతస్థానంలో ఉన్న ప్రభుత్వాధి కారులు) అక్రమ సంపాదన ద్వారా కూడిన నల్లడబ్బును తెల్లడబ్బుగా మార్చుకునేందుకు పండ్లు, పూలు, గొర్రెలు, కోళ్లు, మేకలు, బర్రెల ఫామ్స్ పేర ఆ భూముల్ని అతిచౌకగా కాజేస్తున్నారు.

సంపద ఉన్నవాడికే సౌకర్యాలన్నట్లు ఈ పరిణామం నీటి పారుదల పరిస్థితిలో ప్రభావాన్ని చూపెడుతోంది. 1-5 ఎకరాలలోపు చిన్న-సన్నకారు కమతాల్లో భూగర్భ జలాల లభ్యతను తెలిపే వాటర్ పాయింట్స్‌కు సహజంగానే అవకాశాలు తక్కువ ఉండటంతో పాటు, ఒకటి రెండు పాయింట్స్‌లో అప్పులు తెచ్చి బోర్లు వేసినా ఎక్కువ సందర్భాల్లో అనుకూల ఫలితాలు రాకపోవడం, తదితర కారణాలతో ఆయా భూములకు నీటి పారుదల సౌకర్యాన్ని కల్పించుకోలేకపోయిన పరిస్థితి ఆ భూములు ఒక పెద్ద మొత్తం కమతంగా (50 ఎకరాలు పైన) మారి, సంపన్న వర్గాలకు బదలాయించబడగానే ఒక్కసారిగా మారిపోతుంది. పెట్టుబడి ఎంతైనా పెట్టగలిగే సామర్థ్యం, విశాలమైన విస్తీర్ణం కలిగిన భూకమతంలో పదిలో మూడైనా బోర్లు ఫలించడంతో పేదరైతాంగం చేతిలో వున్నప్పుడు బీళ్లుపడి నోళ్ళుతెరిచిన భూములు ఒక్కసారిగా పచ్చని పంటపొలాలుగా, పండ్లతోటలుగా మారిపోతున్నాయి! ఆభూములకు నిన్నటి యజమానులుగా వున్న చిన్న-సన్నకారు రైతుల చేతిలో తగినంత పెట్టుబడిలేకపోవడమే వారి పాపమా? భూగర్భ జలాల లభ్యతలో తగినన్ని వాటర్‌పాయింట్స్‌కు అవకాశం లేక కమతం విస్తీర్ణం అత్యంత చిన్నదిగా ఉండడమే వారికి శాపమా?

నిజానికి సన్న-చిన్నకారు రైతులకు సాగునీటి సౌకర్యం కల్పించడం ప్రభుత్వాలకు సుతరాము ఇష్టం లేనట్లు కనబడుతోంది. కాంగ్రెస్ ప్రభుత్వం రాష్ట్రంలో వ్యవసాయ భూములకు సాగునీటి సౌకర్యం సంపూర్ణంగా కల్పించే ఉద్దేశ్యంతో 'జలయజ్ఞం' పేర 24 ప్రాజెక్టులను 46వేల కోట్ల రూపాయల ఖర్చుతో 5 ఏళ్లలో పూర్తి చేస్తామని ప్రకటిస్తున్నా, వాటిని అన్నింటినో, కొన్నింటినో, పాక్షికంగానో పూర్తిగానో, పూర్తిచేసినా, ఆ తర్వాత ఆ ప్రాజెక్టుల ద్వారా నీరందే సమయానికి రోజు రోజుకు సాగు గిట్టుబాటుకు తీవ్ర ఆటంకంగా మారుతున్న ప్రస్తుత పరిస్థితుల కారణంగా ఎందరు రైతుల చేతుల్లో భూములుంటాయి? ఇప్పటికే గ్రామాల్లో చిన్న, సన్నకారు పేదరైతుల నుండి భూ విక్రయాలు ప్రారంభమైనాయి. తారు రోడ్డు సౌకర్యం కలిగిన మూరుమూల పల్లెప్రాంతాల్లో ఈ ప్రక్రియ వేగంగా కొనసాగుతోంది. తరాలుగా తమ చేతిలో ఉన్నంతకాలం చుక్క సాగునీటికి నోచుకోని భూములు పరాధీనం అయిన తర్వాత, తమ కళ్లముందే సంపూర్ణంగా సాగునీటిలో తడిసి పచ్చగా అలరారుతుంటే, ఆ రైతుపడే మూగ రోదనకు ఈ ప్రభుత్వం వద్ద సమాధానం ఉందా? వ్యవసాయం గిట్టుబాటు కాక, రోజువారీ అవసరాలు తీరక, ఏటేటా అప్పుల ఊబిలో పీకల లోతు దాకా కూరుకపోయి, గత్యంతరం లేని పరిస్థితుల్లో తమకున్న సెంటో, గుంటో భూమిని విక్రయించక తప్పని పరిస్థితి రైతు స్వయం కృతాపరాధమా? సాగుకు అనుకూల విధానాలను రూపొందించి అమలు పరచని ఈ ప్రభుత్వాలది కాదా ఈ బాధ్యత? రాష్ట్ర ప్రభుత్వం ఒక యజ్ఞంలాగ పూర్తిచేయాలనుకుంటున్న 24 నీటిపారుదల ప్రాజెక్టులు రాబోయే ఐదేళ్లకో లేదా మరో పదేళ్లకో పూర్తవుతాయనుకున్నా, ఈ రోజు నుండి అప్పటిదాకా చిన్న-సన్నకారు రైతాంగం అప్పుల కారణంగానో, అవసరాలు తీరకనో, భూములు అమ్ముకోకుండా

*(మిగతా 31 వ పేజీలో)*

# సమృద్ధిగా సహజవాయు నిక్షేపాలు

## ఈనగాచి నక్కలపాలు చేస్తున్న కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు

- ఇతిహాస్



జూన్ 17, 2005న గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్ర మోడి ఒక సంచలన ప్రకటన చేశారు. గుజరాత్ ప్రభుత్వరంగ సంస్థ అయిన గుజరాత్ స్టేట్ పెట్రోలియం కార్పొరేషన్ ఆంధ్రప్రదేశ్‌లోని కె.జి. బేసిన్ లో దాదాపు రెండు లక్షల కోట్ల రూపాయల విలువచేసే 20 ట్రిలియన్ క్యూబిక్ ఫీట్ల సహజవాయు నిక్షేపాలు కనుగొన్నదని ఆ ప్రకటన సారాంశం.

దేశ చరిత్రలోనే అతి పెద్ద సహజవాయు నిక్షేపం అయిన ఇది ఇప్పటి వరకూ దేశంలో కనుక్కున్న నిక్షేపాలన్నింటితో సమానం. ఇంతకు ముందు 2002 అక్టోబర్‌లో రిలయన్స్ ఇండస్ట్రీస్ కూడా ఇటువంటి భారీ సహజవాయువు నిక్షేపాన్ని కనుగొంది. 7 ట్రిలియన్ క్యూబిక్ ఫీట్‌గా అంచనా వేయబడిన ఈ నిక్షేపం అప్పట్లో పెద్ద సంచలనం రేపింది.

పెట్రో దిగుమతులపై కేంద్ర ప్రభుత్వం ఏటా వేల కోట్ల రూపాయలు నష్టపోయి, పెట్రో ఉత్పత్తుల ధరలు నానాటికీ సామాన్యుని నడ్డి విరుస్తున్న దశలో వెలువడుతున్న ఈ వార్తలు ప్రజలలో, వ్యాపార వర్గాలలో, మేధావులలో చాలా చర్చకు దారితీస్తున్నాయి. అయితే ఈ కొత్త నిక్షేపాలు కనుగొనటం వల్ల మనకు ఒరిగేదేమిటి? అసలు యాభై ఏళ్ళుగా చమురు సహజవాయు వెలికితీతలో ఉన్న ఓఎన్‌జీసీ కాక రిలయన్స్, జిఎస్‌పిసి లు ఇంత పెద్ద నిక్షేపాలు ఎలా కనుగొన్నాయి? సరళీకృత ఆర్థిక విధానాల పేరుతో పెట్రోలియం వెలికితీత రంగాన్ని విదేశీ కంపెనీలకు అప్పగించిన మన కేంద్ర ప్రభుత్వం, పెట్రోలియం వెలికితీతలో కావలసిన వనరులన్నీ రాష్ట్రంలోనే ఉన్నా కళ్ళు మూసుకొని హైటెక్ విజన్ డాక్యుమెంట్లు రాసుకుంటూ పొద్దుపుచ్చిన రాష్ట్ర ప్రభుత్వం అలసత్వాల గురించి రెండు ప్రత్యేక కథనాలు చదవండి.



# దేశంలో దొంగలు పడ్డారు

ఇంట్లో లంకెబిందెలున్నాయని తెలిస్తే ఎవరైనా ఏం చేస్తారు? గుట్టు చప్పుడు కాకుండా తవ్వుకుని సొమ్ము చేసుకుంటారు అని మీరు అనుకుంటే తప్పులో కాలేసినట్టే! ఎందుకంటే ఘనత వహించిన మన భారత ప్రభుత్వం అలా చేయలేదు కాబట్టి. తవ్వుకోవడానికి మా దగ్గర డబ్బులు లేవు కాబట్టి అప్పు ఇవ్వమని అది 1990లో వరల్డ్‌బ్యాంక్ దగ్గరికీ ఐ.ఎం.ఎఫ్. దగ్గరికీ చిప్ప పట్టుకుని వెళ్ళింది. బడా బాబులు యథాప్రకారం సొమ్ములిస్తాం కానీ ఆ లంకెబిందెల్లో మా వాళ్ళకీ వాటాలు పంచాలని 'షరతులు' పెట్టారు. అలాగేనని తలూపిన మన ప్రభుత్వం లంకెబిందెల అడ్రసులు అన్నీ అమ్మకానికి పెట్టింది. ప్రైవేటు భారతీయ కంపెనీలు, విదేశీ బహుళజాతి సంస్థలూ ఇప్పుడా అడ్రసులు పట్టుకునే భారీ సహజ వాయు నిక్షేపాలు కనుక్కుంటున్నాయి.

ఇంతకీ ఆ రోజు మనం తెచ్చుకున్న అప్పు ఎంతో తెలుసా? రు.200కోట్లు, మరి అప్పజెప్పిన లంకెబిందెల విలువో? ఊపిరి బిగపట్టండి. హీనపక్షం రు.10 లక్షల కోట్లు!

**తొలినాటి నిబద్ధత:**

స్వాతంత్ర్యం వచ్చేనాటికి దేశంలో చమురు రంగం ప్రైవేటు రంగంలో ఉండేది. అస్సామ్ ఆయిల్ కంపెనీ, అట్టోక్ ఆయిల్ కంపెనీ అనే రెండు కంపెనీలే చమురు అన్వేషణ, వెలికితీత చేసేవి.

స్వాతంత్ర్యానంతరం అప్పటి సహజవనరుల శాఖామాత్యులు కె.డి. మాలవీయ నేతృత్వంలో ఒక బృందం చమురు అన్వేషణ గురించి అధ్యయనం చేయడానికి ప్రపంచదేశాలన్నీ చుట్టివచ్చింది.

1956 ఆగస్టులో ఓఎన్‌జీసీని ఏర్పాటు చేసింది భారత ప్రభుత్వం. సోవియట్ యూనియన్ నుండి వచ్చిన నిపుణులు ఇక్కడ కొద్ది కాలం ఉండి కావలసిన శిక్షణ, పరికరాలు ఇచ్చారు. చమురు, సహజవాయువుల అన్వేషణ కొరకు 1960 లో ఆయిల్ ఇండియా లిమిటెడ్‌ను కూడా నెలకొల్పింది ప్రభుత్వం.

**డేగల చూపులకు చిక్కాం:**

దాదాపు ముప్ఫై ఏళ్ళు చమురు, సహజవాయువుల అన్వేషణ కొనసాగించిన ఓఎన్‌జీసీ, ఓఐఎల్ అనేక చోట్ల ఈ నిక్షేపాలు కనుగొన్నాయి. బాంబే హై, గుజరాత్ కచ్, కాంబే బేసిన్, కావేరి బేసిన్, కృష్ణా గోదావరి బేసిన్ ఇలా భారతదేశం నలు చెరగులా అపారమైన చమురు సహజవాయు నిక్షేపాలు కనుగొనబడ్డాయి.

అదో అప్పుడు పడ్డాయి బహుళజాతి కంపెనీల డేగకళ్ళు భారత్ పైన. ఇంకేముంది ఐ.ఎమ్.ఎఫ్, ప్రపంచ బ్యాంక్ మన ప్రభుత్వం మెడలు వంచి చమురు, సహజవాయు రంగంలోకి ప్రైవేటు కంపెనీలను, విదేశీ కంపెనీలను అనుమతింపజేశారు. 1991 నుండి దశల వారీగా చమురు, సహజ వాయువు దొరికే బ్లాకులు ప్రైవేటు కంపెనీలకు పిలిచి మరీ అప్పజెప్పడం మొదలెట్టింది భారత ప్రభుత్వం.

అంతే కాదు ప్రైవేటు రంగ ప్రోత్సాహం ఎక్కడిదాక పోయిందంటే ఎన్రాన్-రిలయన్స్ భాగస్వామ్య ప్రైవేటు కంపెనీకి బాంబే సమీపంలోని ముక్తా - పన్నా చమురు బావులను అప్పగించారు. ఆ కంపెనీ దగ్గర చమురు ఓఎన్‌జీసీ కొనే ధరకు రెట్టింపు కన్నా ఎక్కువ పెట్టి కొన్నది మన ప్రభుత్వం. మన కె.జి. బేసిన్‌లో ఎంతో విలువైన చమురు నిల్వలున్నాయని తెలిసిన రవ్వ క్షేత్రాన్ని కెయిర్న్ అనే బ్రిటిష్ కంపెనీకి తెగనమ్మారు.



## భారత్ పెట్రోలియం రంగం

| | | 1998-99 | 2003-04 |
|---|---|---|---|
| రిజర్వులు | ముడిచమురు | 716 మిలియన్ టన్నులు | 733 మిలియన్ టన్నులు |
| | సహజవాయువు | 675 బిలియన్ క్యూబిక్ ఫీట్ | 854 బిలియన్ క్యూబిక్ ఫీట్ |
| వినియోగం | ముడిచమురు | 68.54 మిలియన్ టన్నులు | 121.84 మిలియన్ టన్నులు |
| | ఇతర పెట్రో ఉత్పత్తులు | 90.56 మిలియన్ టన్నులు | 107.77 ,, |
| దేశీయ ఉత్పత్తి | ముడి చమురు | 32.72 మిలియన్ టన్నులు | 33.38 ,, |
| | ఇతర పెట్రో ఉత్పత్తులు | 64.54 మిలియన్ టన్నులు | 113.46 ,, |
| | సహజవాయువు | 27.42 బిలియన్ క్యూబిక్ ఫీట్ | 31.96 బిలియన్ క్యూబిక్ ఫీట్ |
| దిగుమతులు | ముడిచమురు | 39.81 మిలియన్ టన్నులు | 90.43 మిలియన్ టన్నులు |
| | ఇతర పెట్రో ఉత్పత్తులు | 23.77 మిలియన్ టన్నులు | 7.90 మిలియన్ టన్నులు |



మొదట్లో కేటాయించిన బ్లాకులలో పెద్దగా నిక్షేపాలు దొరకకపోవడంతో విదేశీ ప్రైవేట్ కంపెనీలు నీరసపడ్డాయి. దీంతో కేంద్ర ప్రభుత్వం చట్టాలలో అనేక మార్పులు చేసి కొత్త ఎక్స్‌ప్లొరేషన్ లైసెన్సింగ్ పాలసీని 1997లో ప్రకటించింది. 1998లో ఆయిల్ ఫీల్డ్ రెగ్యులేషన్ బిల్లు ప్రవేశ పెట్టబడింది. ప్రైవేటు రంగానికి అనేక రాయితీలు ఇవ్వబడ్డాయి. ఆకర్షణీయమైన కొత్త బ్లాకులు కూడా ప్రైవేటు కంపెనీలకు ఇవ్వబడ్డాయి.

వీటన్నిటి ఫలితమే ఇవ్వాళ సహజవాయు రంగంలో విదేశీ భాగస్వామ్యంతో నడుస్తున్న రిలయన్స్ ఇండస్ట్రీస్, గుజరాత్ పెట్రోలియమ్ కార్పోరేషన్ సాధించిన లక్షల కోట్ల విలువైన నిక్షేపాలు.

**కథ ఇంకా ఉంది:**

మన దేశంలో మొత్తం 26 సెడిమెంటరీ బ్లాకులలో చమురు, సహజ వాయువు నిక్షేపాలు ఉన్నాయని అంచనా. ఇందులో కేవలం 6 బ్లాకులలోనే ఇప్పటి వరకూ అన్వేషణ చేసాం మనం. ఇతర దేశాలలో చమురు బావుల సాంద్రత ప్రతి 10,000 చ.కి.మీలకు 100 ఉంటే మన దేశంలో ఇది 20 మాత్రమే.

ఎంతో విలువైన ఈ సహజసంపద దేశాభివృద్ధిలో కీలక పాత్ర వహిస్తుందనేది విస్పష్టం. అయితే ఈ సంపదనంతా ప్రైవేటు సంస్థలకు ధారపోసిన ప్రభుత్వం అయిదు శాతం, పది శాతం రాయల్టీతో సరిపుచ్చుకుంటోంది. విలువైన దేశ సంపద సరిహద్దులు దాటుతోంది. కొన్ని వేలకోట్ల పెట్టుబడి పెడితే లక్షలకోట్లు స్వంతమవుతాయని తెలిసీ మన ప్రభుత్వం ప్రైవేటు కంపెనీలకే ఈ సంపదను అప్పజెప్పడం మన దౌర్భాగ్యం.

## దేశంలో చమురు చిరునామాలు

| బేసిన్ | రాష్ట్రం | చమురు/ సహజవాయువు క్షేత్రాల సంఖ్య |
|---|---|---|
| కాంబే | గుజరాత్ | 87 |
| ముంబై ఆఫ్‌షోర్ | - | 67 |
| కృష్ణా, గోదావరి | ఆంధ్రప్రదేశ్ | 48 |
| అప్పర్ అస్సామ్ | అస్సామ్ | 37 |
| కావేరి | తమిళనాడు | 25 |
| ఏఏఎఫ్‌బి | ఈశాన్యరాష్ట్రాలు | 15 |
| జైసల్మేర్ | రాజస్తాన్ | 10 |
| ఇతరాలు | - | 8 |

# మన విజన్ అంతా గ్యాసే!

కళ్ల ముందే లక్షల కోట్ల విలువైన సంపదని ప్రైవేటు కంపెనీలు, ఇతర రాష్ట్రాలూ తరలించుకుపోతుంటే గుడ్లప్పగించి చూడటం మినహా ఏమీ చేయలేని చేతగాని రాష్ట్ర ప్రభుత్వం మనది.

చమురు, సహజవాయువుల అన్వేషణ కొరకు భారతదేశంలో ఏ రాష్ట్రానికీ లేనన్ని అర్హతలు మనకున్నాయి. కానీ యాభై యేళ్ళుగా మన రాష్ట్ర ప్రభుత్వం ఉష్ట్ర పక్షిలా వ్యవహరిస్తోంది. ఎంతో విజన్ ఉన్న నాయకులు కూడా పంచరంగుల ప్రెజెంటేషన్లు, బ్రోచర్లతోనే కాలం గడిపారు. రాష్ట్రాన్ని నిజంగా బంగారంగా మార్చేసే సహజవాయువు మన దాపునే ఉన్నా దాన్ని అందిపుచ్చుకునే ప్రయత్నం చేయలేదు.

రాష్ట్రం ఏర్పాటైన కొద్ది కాలానికే ఓఎన్‌జీసీ కృష్ణా గోదావరి బేసిన్‌లో చమురు అన్వేషణ మొదలుపెట్టింది.

## సరిలేరు మనకెవ్వరూ!

- కృష్ణా - గోదావరి (కె-జి) బేసిన్ దాదాపు 80,000 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంలో అపారమైన చమురు, సహజవాయువు నిక్షేపాలున్నాయి.
- 1959 లోనే ఓఎన్‌జీసీ ఇక్కడ చమురు అన్వేషణ మొదలుపెట్టింది.
- చమురు బావుల తవ్వకానికి రిగ్గులు కావాలి. భూమి మీద, సముద్రం లోపల తవ్వడానికి ఉపయోగపడే రిగ్గులను మన రాష్ట్రంలోని బిహెచ్ఇఎల్ తయారు చేస్తుంది.
- చమురు వెలికితీతలో అత్యంత ముఖ్యమైన బెరైటిస్ నిల్వలు ప్రపంచంలో దొరికే కొద్ది ప్రదేశాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి.
- సముద్రంలో బావులు తవ్వ వలసినప్పుడు అవసరమయ్యే ప్లాట్‌ఫాంలను విశాఖపట్నం షిప్‌యార్డ్ తయారు చేస్తుంది.

ఇన్ని ప్రత్యేకతలున్న ఆంధ్రప్రదేశ్ మాత్రం చమురు అన్వేషణ వెలికితీత రంగాన్ని పూర్తిగా విస్మరించింది. 1979లో కె.జి. బేసిన్‌లోని నర్సాపూర్-1 అనే బావిలో ఓఎన్‌జీసీ సహజ వాయువును మొదటిసారిగా కనుగొంది. దాదాపు ఎనిమిదేళ్ళ తరువాత 1987లో గాని రాష్ట్ర ప్రభుత్వానికి సహజవాయువు వినియోగానికి ఒక కమిటీ వేయాలని తట్టలేదు. మాజీ ఓఎన్‌జీసీ చైర్మన్ డా.ఎన్. భానుప్రసాద్ నేతృత్వంలో ఏర్పాటైన ఆ కమిటీ రాష్ట్రంలో లభ్యమవు తున్న సహజవాయువును ఉపయోగించుకొని పారిశ్రామిక ప్రగతి సాధించేందుకు దోహదపడే అనేక సూచనలు చేసింది. ఈ చౌక ఇంధనాన్ని ఉపయోగించుకుని కరెంట్ ఉత్పత్తి, ఎరువుల ఉత్పత్తి కర్మాగారాలు నెలకొల్పాలనేది అందులో ముఖ్యమైన సూచన. అయితే మన రాష్ట్ర ప్రభుత్వం తానే స్వంతంగా విద్యుత్ ఉత్పత్తి చేయాల్సింది పోయి అనేక ప్రైవేటు గ్యాస్ ఆధారిత విద్యుత్ ప్లాంట్లకు అనుమతి ఇచ్చింది. ఇవి ఉత్పత్తి చేసిన విద్యుత్‌ను అధిక ధరలకు కొనుగోలు చేసే ఒప్పందాలు కుదుర్చుకుంది. చౌక ఇంధనం వల్ల రాష్ట్రానికి జరగాల్సిన మేలు జరగకపోగా ప్రైవేటు విద్యుత్ ఉత్పత్తిదారులు మాత్రం కోట్లు వెనకేసుకున్నారు.

చంద్రబాబునాయుడు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఎంతో అట్టహాసంగా విడుదల చేసిన విజన్ - 2020 పత్రంలో సహజ వాయువు రంగాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేశారు. రాష్ట్రాభివృద్ధిలో ఎంతో

## పెట్రోనెట్ ఎల్.ఎన్.జీ. భవితవ్యం?




సహజవాయువును ద్రవీకరిస్తే ఎల్.ఎన్.జీ. (లిక్విఫైడ్ నాచురల్ గ్యాస్) తయారవుతుంది. సహజవాయువును రవాణా చేయటం కష్టం కాబట్టి అనేక ఏళ్ళుగా దాన్ని ఎల్.ఎన్.జీ గా మార్చి రవాణా చేయడం, ఉపయోగించడం జరుగుతోంది.

దేశంలో సహజవాయువు ఉత్పత్తి - సరఫరా మధ్య ఉన్న భారీ అంతరం పూడ్చటం కొరకు విదేశాలనుండి సహజవాయువును ఎల్.ఎన్.జీ. రూపంలో గల భారీ డిమాండ్‌ను దృష్టిలో ఉంచుకుని ఒమన్ నుంచి ఎల్.ఎన్.జీ దిగుమతి చేసి దేశీయ మార్కెట్‌లో అమ్మేందుకు పెట్రోనెట్ ఎల్.ఎన్.జీ అనే కంపెనీని భారత చమురు రంగ కంపెనీలైన బిపిసిఎల్, ఓఎన్‌జీసీ, గెయిల్, ఐ.ఓ.సి. కలిసి స్థాపించాయి. ఇందులో గాస్ డి ఫ్రాన్స్ అనే ఫ్రెంచి కంపెనీకి కూడా 10% వాటా ఉంది. గుజరాత్‌లోని దహేజ్‌లో ఎల్ఎన్‌జి టర్మినల్‌ను నెలకొల్పింది పెట్రోనెట్. దీనికి ఎల్.ఎన్.జీ ని ఒమన్‌కు చెందిన రాస్‌గ్యాస్ నుండి దిగుమతి చేసుకుంటుంది పెట్రోనెట్. కేరళలోని కొచ్చిలో రెండో ఎల్.ఎన్.జీ టెర్మినల్ కూడా ప్రస్తుతం నిర్మిస్తోంది పెట్రోనెట్.

ఇంత వరకూ బాగానే ఉంది కానీ ఇప్పుడు కె.జి.బేసిన్‌లో ఇబ్బడి ముబ్బడిగా గ్యాస్ దొరుకుతుండడంతో అధిక ధరలు పెట్టి పెట్రోనెట్ ఎల్.ఎన్.జీ ని ఎవరు కొంటారనేది ప్రశ్న. ఒక వేళ రేపటి రోజు పెట్రోనెట్ దేశీయ మార్కెట్‌లో ఎల్.ఎన్.జీ ని అమ్మలేని పరిస్థితి వస్తే దాని యాజమాన్య సంస్థలైన బిపిసిఎల్, ఓఎన్‌జీసీ, ఐ.ఓ.సీ, గెయిల్ లకు భారీ నష్టాలు రావడం ఖాయం. ఎందుకంటే రాస్‌గాస్‌తో కుదుర్చుకున్న ఒప్పదం ప్రకారం గ్యాస్ దిగుమతి చేసుకున్నా, చేసుకోక పోయినా ఒప్పందంలోని గ్యాస్ విలువను పెట్రోనెట్ కట్టాల్సిందే.

అయినా దేశంలోఇంత భారీ సహజవాయువు నిక్షేపాలున్నాయని తెలిసి ఆత్మహత్యా సదృశమైన ఎల్.ఎన్.జీ దిగుమతి ఒప్పందాలు కుదుర్చుకున్న పెట్రోనెట్ ఎల్.ఎన్.జీ ఎవరి జేబులు నింపిందో?

కీలకమైన పాత్ర వహించగల చమురు, సహజవాయువుల రంగాల గురించి 'ఖనిజాలు, ఇతర సహజవనరుల' గాట కట్టేసి వీటి వెలికితీతకు, వినియోగానికి అవసరమైన అన్ని చర్యలూ చేపట్టాలని ఒక ముక్తసరి సూచన చేశారు.

## రిలయన్స్ తరువాత కథ:

అక్టోబర్ 2002లో రిలయన్స్ భారీ మొత్తంలో సహజవాయువును కనుగొనగానే చంద్రబాబునాయుడు ప్రభుత్వం నిద్రనుండి మేల్కొని 'కమిటీ ఆన్ యుటిలైజేషన్ ఆఫ్ నాచురల్ గ్యాస్' వేసింది. టి.ఎల్. శంకర్ నేతృత్వంలోని ఈ కమిటీ అనేక ప్రభుత్వ, ప్రైవేటు సంస్థలను కలిసి పరిశోధించి ఓ నివేదిక సమర్పించింది. అందులో ఈ కింది సూచనలు చేసింది.

- రాష్ట్ర సహజవాయువు అభివృద్ధి మండలి ఏర్పాటు చేయాలి.
- కేంద్ర ప్రభుత్వంతో ఒక జాతీయ సహజవాయువు పాలసీ, జాతీయ పైప్‌లైన్ పాలసీ, జాతీయ గ్యాస్ ధరల పాలసీ ప్రకటింపజేయాలి.
- హైడ్రో కార్బన్ హైవే ఏర్పాటు కొరకు ఒక టాస్క్‌ఫోర్స్ ఏర్పాటు చేయాలి.
- ఇళ్ళలో సహజవాయువు ఉపయోగానికి చర్యలు తీసుకోవాలి.
- సహజవాయువు అభివృద్ధి నిధిని ఏర్పాటు చేయాలి.
- ఒక భారీ కెమికల్ కాంప్లెక్స్‌ను ఏర్పాటు చేయాలి.



పై వాటిలో ఒక్క సూచన కూడా నేటివరకూ మన రాష్ట్ర ప్రభుత్వం పాటించలేదు.

ఏతావాతా తేలేదేమంటే ఇప్పుడు ప్రకటించబడ్డ ఈ మూడులక్షల కోట్ల రూపాయల విలువైన సహజవాయువు నిల్వలూ సముద్ర గర్భంలో దొరికినందు వల్ల మనకు రాయల్టీ ఆదాయం కూడా పైసా రాదు. ఒక వేళ ఈ సహజవాయువు రాష్ట్రంలో ఏ పరిశ్రమ అయినా కొంటే దాని మీద సేల్స్‌టాక్స్ ద్వారా వచ్చే చిల్లర కాసులే మనకు మిగిలేది.

చౌకగా లభ్యమయ్యే గ్యాస్ ఆధారిత పరిశ్రమలు ఎక్కువగా నెలకొల్పలేక పోవడం వల్ల రాష్ట్రంలో ఉత్పత్తి అయ్యే సహజవాయువు వేరే రాష్ట్రాలకు పైప్‌లైన్ల గుండా తరలి వెళ్ళే ప్రమాదం ఉంది.

## భవిష్యత్ ఇం'ధనం'

20వ శతాబ్దం చమురుదయితే 21వ శతాబ్దం సహజవాయువు దేనని అంటున్నారు నిపుణులు. అతి తక్కువ వాతావరణ కాలుష్యం కలుగజేసే 'క్లీన్ ఫ్యుయల్' గా ప్రపంచ వ్యాప్తంగా గుర్తింపు పొందింది సహజవాయువు. ఇంధన వినియోగంలో ప్రపంచంలోనే ఏడవ స్థానంలో ఉన్న భారత్‌లో సహజవాయువు ఇంధనం వాటా 8 శాతమే.

ఇప్పుడు కొత్తగా కె.జి. బేసిన్‌లో బయల్పడ్డ నిక్షేపాలు మరోసారి సహజవాయువు వినియోగంపై చర్చను లేవదీశాయి. మన రాష్ట్రంలోనే ఈ నిక్షేపాలు అధికంగా ఉండడం మనకు అనుకూలాంశం. ప్రస్తుతం సహజవాయువు ధరలను కేంద్ర ప్రభుత్వం నిర్ణయిస్తుంది. ప్రభుత్వరంగ ఇంధన సంస్థల నుండి 1.3 డాలర్లకు ఒక మిలియన్ మెట్రిక్ బ్రిటిష్ థర్మల్ యూనిట్ కొంటున్న ప్రభుత్వం అదే ప్రైవేటు భాగస్వామ్య కంపెనీల వద్ద నుండి 3.2 డాలర్లకు ఒక మిలియన్ మెట్రిక్ బ్రిటిష్ థర్మల్ యూనిట్ కొంటున్నది. విద్యుత్ ఉత్పత్తి, ఎరువుల కర్మాగారాలు ఈ సహజవాయువును ఎక్కువగా వినియోగించుకుంటున్నాయి.

అయితే కొత్త నిక్షేపాలు వినియోగంలోకి వచ్చేసరికన్నా కేంద్ర ప్రభుత్వం సహజవాయువు రెగ్యులేటరీ కమిషన్ ఒక దాన్ని వేసి ధరలు నియంత్రించాలని చాలా మంది నిపుణులు కోరుతున్నారు. అది ఎలాగూ జరిగే పరిణామమే కాబట్టి రాష్ట్ర ప్రభుత్వం తెలివిడి ప్రదర్శించి కింది చర్యలు చేపడితే రాష్ట్రాభివృద్ధికి దోహదపడవచ్చు.

- ప్రభుత్వ రంగంలో గ్యాస్ ఆధారిత విద్యుత్ ఉత్పత్తి క్షేత్రాలు నెలకొల్పడం: ఎందుకంటే ఇప్పటి వరకూ ప్రైవేటు రంగంలో గ్యాస్ ఆధారిత విద్యుత్ ఉత్పత్తి సంస్థలన్నీ ఏదో విధంగా ఖజానాకు కన్నం పెట్టేలా తయారయ్యాయి కాబట్టి చౌకగా వచ్చే గ్యాస్‌తో ప్రభుత్వమే విద్యుత్ తయారుచేసి సబ్సిడీల భారం గణనీయంగా తగ్గించుకోవచ్చు.
- సహజవాయువును వాహనాల్లో ఇంధనంగా ఉపయోగించ వచ్చు. ఢిల్లీలో అనేక ఏళ్ళుగా సహజవాయువుతో బస్సులు నడుస్తున్నాయి. వీటి వల్ల కాలుష్యం తగ్గుతుంది, నిర్వహణ వ్యయం కూడా తగ్గుతుంది. నష్టాల ఊబిలో చిక్కుకున్న ఏపిఎస్ ఆర్‌టిసిను గట్టెక్కించవచ్చు. రాష్ట్ర ప్రభుత్వం ఇంత వరకూ ఈ దిశగా ఏ ప్రయత్నమూ చేయడం లేదు.
- రాష్ట్రంలో వంటగ్యాస్ బదులు సహజవాయువును పైప్‌లైన్ ద్వారా సరఫరా చేయవచ్చు. గణనీయంగా ఖర్చును, సబ్సిడీ భారాన్ని తగ్గించవచ్చు.

చిత్తశుద్ధి ఉంటే ఇప్పటికైనా మేల్కొని ఈ సహజవాయువు విప్లవాన్ని అందిపుచ్చుకుని అభివృద్ధి పథంలో నడవవచ్చు కానీ ప్రభుత్వానికి తీరిక ఉన్నదా? ❑

# భాగ్యనగరాన్ని వెనిస్‌గా మార్చిన 'అభివృద్ధి'

- కొణతం దిలీప్

అలనాటి సాహితీకారుడు దాశరథి కృష్ణమాచార్య కు హైదరాబాద్ నగరాన్ని వెనిస్ నగరంలా అభివృద్ధి పరచాలని చాలా కోరిక ఉండేది. మూసీనది, దాంట్లోకి నీరు మోసుకువచ్చే నాలాలు, నగరమంతటా విస్తరించి ఉన్న వందలాది చెరువులు చూసిన ఆయన వెనిస్ లా మనకూ రోడ్ల బదులు జలమార్గాలు ఉండాలని, చౌకైన పడవలతో ప్రయాణాలు సాగించవచ్చని ఒక సుందరమైన కలను ఆవిష్కరించారు.

ఆయన అన్న మాటలు విన్నారో లేదో కానీ మన పాలకులు మరోలా ఆయన అభీష్టం నెరవేర్చే ప్రయత్నం చేసారు. హైదరాబాద్ నగరాన్ని గత కొన్నేళ్ళుగా విపరీతంగా శ్రమించి, వందల కోట్లు వెచ్చించి 'అభివృద్ధి' చేశారు. దాని ఫలితంగానే ఇప్పుడు చినుకు పడితే చాలు రహదారులు గోదారిని తలపింపజేస్తున్నాయి. ఒకప్పటికీ ఇప్పటికీ వర్షపాతం గణనీయంగా తగ్గినా పల్లపు ప్రాంతాలు పలుసార్లు నీట మునుగుతున్నాయి. దేశమంతా 'అభివృద్ధి' కి నమూనాగా చూపెడుతున్న హైటెక్ హైదరాబాద్ సాధించిన అభివృద్ధి ఎంత ఘనమైనదో - అసలు ప్రజలూ, ప్రభుత్వాలూ నేడు అభివృద్ధిగా పిలుస్తున్నది నిజమైన అభివృద్ధి అవునో కాదో తాజా పరిణామాలు ప్రశ్నిస్తున్నాయి.

ఎప్పుడో వందేళ్ళ క్రితం ఇదే భాగ్యనగరాన్ని వరదలు ముంచెత్తితే అప్పటి నిజాం ప్రభుత్వం తీసుకున్న చర్యలకీ, ఇప్పటి మన ప్రభుత్వాలు చేపడుతున్న చర్యలకీ హస్త మశకాంతరం ఉన్నది.

అప్పటిది రాచరికపు వ్యవస్థ అయినా, సాంకేతికంగా ఇప్పటంత పరిజ్ఞానం లేకున్నా ప్రజల బాగు పట్ల, భవిష్యత్ పట్ల నిజాం రాజుకున్న దార్శనికత ముందు మన ప్రస్తుత పాలకుల 'విజన్' వెలవెల బోతున్నది. అంతర్జాతీయ ద్రవ్య సంస్థల నుండి వందలకోట్లు తెచ్చి ఆశ్రితులకు లాభం చేకూర్చే పైపై మెరుగుల అభివృద్ధి, వరదల తాకిడికి కొట్టుకు పోతోంది. చుట్టూ కొండలు, స్వచ్ఛమైన నీటితో అలరారే తటాకాలు, జీవనది మూసీ ఒడ్డున నిర్మితమై ఆనాడే ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన మన భాగ్యనగరం కాలక్రమేణా ఎలా నగరవాసపు క్షుద్రక్రీడలో చిక్కి వరుస ప్రభుత్వాల బాధ్యతారాహిత్యానికీ, అవినీతికీ గురై ఇంతటి దయనీయ స్థితికి దిగజారిందో తెలుసుకుంటే - అభివృద్ధికి ఇవ్వాళ ఇవ్వబడుతున్న నిర్వచనం తప్పనీ, భవిష్యత్‌లోనైనా సమగ్రమైన అభివృద్ధి ప్రాధాన్యాలను గుర్తించాలనీ అవగతమవుతుంది.

### అప్పటి దార్శనికత్వం

1908 లో మూసీ నదికి వచ్చిన వరదలు నగరాన్ని అతలాకుతలం చేశాయి. అనేక మంది మృత్యువాత పడ్డారు. జరిగిన నష్టాన్ని చూసి చలించిన ఆరవ నిజాం, ప్రముఖ ఇంజనీరు సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యను మైసూరు నుండి రప్పించారు. హైదరాబాద్‌ను ఇలాంటి వరదలు మరోసారి ముంచెత్తకుండా ఒక శాశ్వత ప్రణాళిక ఇవ్వాలని కోరారు. మూసీ, ఈసీ నదులపై హిమాయత్ సాగర్, ఉస్మాన్‌సాగర్‌ల నిర్మాణం, మూసీ నదికి ఇరువైపులా రక్షిత గోడల ఏర్పాటు, నగరంలో డ్రైనేజి వ్యవస్థ ఏర్పాటు వంటి చర్యలు ఆనాడు మోక్షగుండం విశ్వేశ్వరయ్య ఇచ్చిన ప్రణాళిక పుణ్యమే. అంతే కాదు హైదరాబాద్‌కు మంచినీటి సరఫరాకు ఉపయోగపడే హిమాయత్‌సాగర్, ఉస్మాన్‌సాగర్‌లే కాక ఫ్రెంచి ఇంజనీర్లను పిలిపించి మీర్ ఆలం ట్యాంక్‌ను కూడా నిర్మింపజేశాడు అప్పటి నిజాం.

### నగరనాశనం

1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడి హైదరాబాద్ రాజధానిగా మారిన తరువాత నగరం పెరుగుదల వేగం పుంజుకున్నది. ఈ పెరుగుదల 80లలో, 90లలో తారాస్థాయికి చేరింది. విద్య, వైద్యం, ఉద్యోగం, ఉపాధి ఇలా రకరకాల కారణాల వల్ల హైదరాబాద్ చేరే జనం సంఖ్య ఎక్కువైంది. ఇళ్ళ స్థలాల కొరకు డిమాండ్ కూడా తదనుగుణంగానే పెరిగింది. పారిశ్రామికీకరణ వల్ల హైదరాబాద్ నగరంలో, శివారు ప్రాంతాలలో వందల వేల పరిశ్రమలు వెలిసాయి. అడ్డదారిన నాలుగు రాళ్ళు వెనకేసుకుందామనుకున్న కొద్దిమంది రియల్ ఎస్టేట్ దళారులు, వారికి దన్నుగా నిలబడ్డ అక్రమార్కులైన అధికారులు, రాజకీయ నాయకులు, కాలుష్యాలను వెదజల్లే పరిశ్రమాధిపతులూ కలిసి హైదరాబాద్ రూపురేఖలను సమూలంగా మార్చేశారు. చెరువులు, కుంటలు, నాలాలు కలుషితమైపోయాయి, కబ్జాకు గురయ్యాయి, మురికివాడల్లాంటి కాలనీలు పుట్టగొడుగుల్లా పుట్టుకువచ్చాయి. అడ్డుకోవలసిన అధికారులు, నాయకులు ఈ పాపపు సొమ్ములో తమ వాటా తాము భోంచేసి బ్రేవ్‌మని త్రేన్చారు. అక్రమాలు యథేచ్ఛగా సాగుతుంటే నిద్రనటించారు.

### వెయ్యితటాకాల నగరం

హైదరాబాద్, దాని శివారు గ్రామాలన్నిటితో కలిపి దాదాపు వెయ్యి చెరువులు, కుంటలు ఉంటాయని ఒక అంచనా.

సహజంగా ఏర్పడ్డవి కొన్నైతే అప్పటి కుతుబ్‌షాహీ, అసఫ్ జాహీ,పాలకులు తవ్వించినవి కొన్ని. ఇందులో చాలా వరకు గొలుసుకట్టు చెరువులు అంటే ఒకటి నీటితో నిండితే దాని అలుగు గుండా నీరు ఒక కాలువ (నాలా) ద్వారా కింద ఉన్న ఇంకొక చెరువుకు చేరుతుంది. ఇబ్రహీం పట్నంలో గల చెరువుకు ఇలా దాదాపు 70 కిమీ నీరు ప్రయాణించి వస్తుందని చెబుతారు. ఎంతో ముందుచూపుతో ప్రకృతి వనరులను ఉపయోగించుకునే అప్పటి జీవన విధానానికి ఈ గొలుసు కట్టు చెరువుల పద్ధతి ఒక ప్రబల తార్కాణం.

అయితే రాష్ట్రావతరణ తరువాత ఆ పరిస్థితి మారింది. సెప్టెంబర్ 2004 లో సెంటర్ ఫర్ ఎకనామిక్ అండ్ సోషల్ స్టడీస్‌కు చెందిన సి రామచంద్రయ్య, షీలా ప్రసాద్ ప్రకటించిన 'ఇంపాక్ట్ ఆఫ్ అర్బన్ గ్రోత్ ఆన్ వాటర్ బాడీస్ - ది కేస్ ఆఫ్ హైదరాబాద్ ' అనే పరిశోధనా పత్రంలో ఇలా పేర్కొన్నారు: 'ఉమ్మడి ప్రకృతి వనరులు ప్రైవేటు ఆస్తిగా, ప్రభుత్వ ఆస్తిగా మారడం వల్ల కలిగే దుష్పరిణామాలు మనకు హైదరాబాద్ చెరువుల అనుభవం చూపుతుంది.'

**అభివృద్ధికి కొత్త భాష్యాలు**

చంద్రబాబు హయాంలో హైదరాబాద్ అభివృద్ధికి అనేక కొత్త పథకాలు ప్రకటించారు. ఇందులో చాలా మట్టుకు అంతర్జాతీయ ద్రవ్యసంస్థల సహకారం, లేదా ప్రైవేటు భాగస్వామ్యంతో జరిగినవే. అయితే సహజంగానే ఇందులో ప్రజల బాగు కొరకు కన్నా కొన్ని సంస్థలకు, వ్యక్తులకు లాభం చేకూర్చే పనులే ఎక్కువ.

పర్యాటకాభివృద్ధి పేరుతో చేపట్టిన బుద్ధపూర్ణిమ ప్రాజెక్టు వల్ల హుస్సేన్‌సాగర్ పరిసరాల్లో అందంగా ఉద్యానవనాలైతే వెలిశాయి గానీ సాగర్ నీటి నిలువ సామర్థ్యం గణనీయంగా తగ్గిపోయింది. అంతే కాదు చుట్టూ పెరిగిన వ్యాపారాల వల్ల కలిగే కాలుష్యం కూడా సాగర్‌ను నానాటికీ భ్రష్టుపట్టిస్తోంది. రు.150 కోట్ల వ్యయంతో నెదర్లాండ్స్ ప్రభుత్వం సహకారంతో చేపట్టిన 'గ్రీన్ హైదరాబాద్ ఎన్విరాన్‌మెంట్ ప్రాజెక్ట్' హైదరాబాద్ సరస్సులకు పైపై మెరుగులు దిద్దేందుకే పరిమితమైంది తప్ప నిజంగా వాటిని పరిరక్షించే కార్యక్రమమేదీ జరగలేదు.

మొదటి దశలో సఫిల్‌గూడ, సరూర్‌నగర్, మీరాలం చెరువులను గ్రీన్ హైదరాబాద్ పథకం కింద 'అభివృద్ధి' పరిచారు. చుట్టూ వేసిన నెక్లెస్ రోడ్లు, పార్కులు ఈ చెరువుల విస్తీర్ణాన్ని ఇంకా తగ్గించి వేశాయి. ఫలితంగా ఈ చెరువుల నీటి నిల్వ సామర్థ్యం బాగా తగ్గింది. ఈ పథకం క్రింద చెరువు నీటిని శుద్ధిచేయడానికి ఏర్పాటు చేసిన ఎఫ్లుయెంట్ ట్రీట్ మెంట్ ప్లాంట్లు కూడా ఉత్సవ విగ్రహాలుగా మారిపోయాయి. ఈ చెరువుల్లో పై నుండి వచ్చి కలిసే డ్రైనేజీ, కలుషిత నీటిని ఆపకుండా చెరువులో నీటిని ఎంత కాలం శుద్ధి చేసినా లాభంలేదని అధికారులకు తెలియకనో, లేక ఈ ప్లాంట్ల ఏర్పాటులో ఉన్న లాభం వల్లనో!

అంతే కాదు యూసుఫ్‌గూడాలో చెరువును పూడ్చివేసి కృష్ణకాంత్ పార్క్‌ను, మాసాబ్‌ట్యాంక్‌లో చెరువును పూడ్చివేసి చాచా నెహ్రూ పార్క్‌నూ నిర్మించారు మన 'విజన్' ఉన్న పాలకులు. నిజాం కాలంనాటి సాతమ్ చెరువు, జమాలి కుంటలను పాక్షికంగా పూడ్చివేసి హైదరాబాద్ గోల్ఫ్ అసోసియేషన్ ఒక గోల్ఫ్ కోర్సు నిర్మిస్తున్నది. బతుకమ్మకుంటలో షాపింగ్ మాల్ కట్టాలా లేక స్టేడియం కట్టాలా అని తీవ్రంగా యోచిస్తున్నది మన ప్రభుత్వం. జూబిలీహిల్స్‌లో లోటస్‌పాండ్, దుర్గం చెరువులు సుందరీకరణ పేరుతో సగానికి సగం కుదించబడ్డాయి. ఆ తటాకాల చుట్టూ వెలసిన ఫుడ్‌కోర్టులూ, అమ్యూజ్ మెంట్ పార్కులు, పూలవనాలు చూసి మైమరచిన మన మధ్య తరగతి మేధావులు 'అబ్బో హైదరాబాద్ చాలా డెవలప్ అయ్యిందహో' అని గర్వంగా ప్రకటించేశారు.

అయితే జరుగుతున్న విధ్వంసం అందరూ చూస్తూ కూర్చోలేదు. 1995లోనే రాష్ట్ర హైకోర్టులో కొద్దిమంది పర్యావరణవేత్తలు హైదరాబాద్ సరస్సులు రక్షించాలని ఒక ప్రజాప్రయోజన వ్యాజ్యం వేశారు.

స్పందించిన హైకోర్టు 170 చెరువులను ప్రభుత్వం వెంటనే పరిరక్షించాలని, వాటి చుట్టుపక్కల ఎటువంటి నిర్మాణాలు చేయరాదనీ ఆదేశించింది. సొసైటీ ఫర్ ప్రిజర్వేషన్ ఆఫ్ ఎన్విరాన్‌మెంట్ అండ్ క్వాలిటీ ఆఫ్ లైఫ్ (ఎస్.పి.ఇ.క్యు.ఎల్.) 2001లో చేసిన ఒక పరిశోధనలో నగరంలో ఇప్పుడు మాయమైన చెరువులు, కుంటలు సరిగా ఉంటే దాదాపు 16,47,56,000 క్యూబిక్ మీటర్ల నీటిని నిలువుకోగలిగేవని వెల్లడైంది. ఎస్‌పిఇక్యుయల్, ఫోరమ్ ఫర్ బెటర్ హైదరాబాద్ వంటి స్వచ్ఛంద సంస్థలు అనేకసార్లు హుస్సేన్‌సాగర్ తీరాన బుద్ధపూర్ణిమ ప్రాజెక్టు పేరిట జరుగుతున్న అవక తవక నిర్మాణాలపై కోర్టుకు ఎక్కాయి. అయితే ప్రతిసారీ ప్రభుత్వ మొండితనమే నెగ్గింది.

**కలలనుండి వాస్తవంలోకి**

అగస్ట్ 2000లో చాల ఏళ్ళ తరువాత హైదరాబాద్‌ను వరదలు వణికించాయి. నగరంలో హుస్సేన్‌సాగర్ నిండడంతో నాలాల్లోకి విడుదల చేసిన నీరు పోటెత్తి చాలా కాలనీలను ముంచెత్తింది. అనేక చెరువులు గట్లు తెగి ప్రవహించాయి. జననష్టం, ఆస్తినష్టం భారీగా జరిగింది. ప్రజలకు సహాయం అందించడానికి ప్రభుత్వం పడవలను దించాల్సి వచ్చింది. హైదరాబాద్ అలా వెనిస్ నగరాన్ని తలపించింది.

*(మిగతా 50వ పేజీలో)*

# సంక్షోభంలో తెలుగు చలనచిత్ర పరిశ్రమ

- గుడిపూడి శ్రీహరి

**ఈ రోజున తెలుగు సినిమాకు పట్టిన దుర్గతికి కారణం - తాడూబొంగరం తెలియని సరికొత్తతరం నిర్మాతలు. వీళ్ళందర్నీ 'సినిమా మోజు' నిర్మాతలనాలి. బాగా మదించిన వారు కొందరయితే, సరదాకోసం ఓసినిమా తీసి ఆ వెలుగులో ఓ వెలుగు వెలగాలన్న తపనవున్నవారు కొందరు. వెనుకటి రోజుల్లోకూడా కొత్తనిర్మాతలు రావడంకద్దు. కాని వాళ్ల అదృష్టం, ఆ రోజుల్లో చాలామంది పాతుకుపోయిన ప్రొఫెషనల్ నిర్మాతలుండే వారు ఆదర్శంగా. అంటే నేర్చుకోవడానికి ఓ ఆసరాదొరికేది. కనీసం సలహాలడగడానికన్నా వుండేవారు. ఇప్పుడు కారణాంతరాలవల్ల సాంప్రదాయబద్ధంగా చాలకాలంనించి చిత్ర నిర్మాణంలోవున్న అనేకసంస్థలు మూసుకపోయాయి. ఈ రోజున మహాఅయితే పదో పన్నెండో సంస్థలు మిగిలాయి. ఆ సంస్థలనుంచి వచ్చే చిత్రాల సంఖ్యా తగ్గింది.**

ఈతరంలో రియల్ ఎస్టేట్ వ్యాపారం నుంచి వచ్చినవారు ఎక్కువ. లేక తత్సంబంధమైన నిర్మాణసంస్థలు, కాంట్రాక్టర్‌లు వంటివారు. ఈవచ్చినవారికి సినిమా నిర్మాణంగురించి, దాని లోతుపాతుల గురించి - మనసులో ఊహ మాత్రంగా ఏదైనావున్నా, తీరుతెన్నులు తెలియవు. ఇటువంటివారిని రంగంలోకి దింపి నాలుగు సొమ్ములు చేసుకునేవారు వున్నారు.

ఒక సినిమా తయారీకి కావలసింది నిర్మాత, ఒక మంచికథ. మిగతావన్నీ తర్వాతనే. పాతరోజుల్లో ఈ పనులన్నీ సమష్టిగా నిర్మాణ సంస్థల్లోనే జరిగేవి. కాని ఇప్పుడు ఎవరి ధోరణివారిదే ఎవరిగోలవారిదే. కథకి నెలల సమయం పట్టేది-ఇప్పుడు క్షణాల్లో చెప్పేస్తున్నారు. దీన్ని సింగిల్‌లైన్ స్టోరీ అంటారు. అంటే-ఆ కథలో చెప్పదల్చుకున్న పాయింటు ఒక్కటే. అంటే అదే ఆ కథకి ఆయువుపట్టు అన్నమాట. వాళ్ళు చెప్తున్న కథలు వింటూవుంటే మాలాంటి వాళ్ళకి మతిపోతుంది. నిన్నరాత్రి చూసిన సినిమాలాగవుంటుంది. పెద్దవాళ్ళు, నిజమైన సినలైన రచయితలుపోయి, కుర్రాళ్ళు స్టూడియోల చుట్టూ, నిర్మాతల చుట్టూ తిరుగుతున్నారు. సామాన్యంగా వాళ్ళెవరూ అందరు. ఏదోసినిమా తీయాలన్న తాపత్రయం వున్నవాళ్ళు తగుల్తారు. వాళ్లదగ్గరికి మరొకళ్ళు తీసుకెళ్తారు. లేకపోతే ఆ కథవిన్న వాళ్ళు తమకు తెలిసిన నిర్మాతకాదల్చుకున్న వ్యక్తికి చెప్తారు. దాంతో ఆ కుర్రాడే కథకుడు. ఆ తర్వాత-"ఇంతబాగా కథచెప్పావు నువ్వే దర్శకుడివి" అనేస్తాడు నిర్మాత. ఇట్లా జరుగుతున్న సందర్భాలు చాలావున్నాయి.

'చిత్రం' అనే సినిమా వచ్చింతర్వాత ఒక్కసారిగా ఇండస్ట్రీలో మార్పువచ్చింది. ఆ 'చిత్రం' తక్కువ ఖర్చుతో తీసిన సినిమా అవడంతోటి విజయవంతంగా నడవడంతోటి ఓరకమైన క్రేజ్ వచ్చింది. ఆక్రేజ్ ఎటువంటిదంటే-'యూత్'తో సినిమా తీస్తే ఇంత సక్సెస్ అవుతుందా అన్నక్రేజ్. యూత్ సినిమా అనగానే ప్రేమకథ. ప్రేమ కథలు మునుపు లేకపోలేదు. కాని ఆ రోజుల్లో ప్రేయసీ ప్రియులు ముప్పయిలు, నలభయిలు వయసున్నవాళ్ళు. అవన్నీ ఓల్డేజ్ ప్రేమ కథలు. ఇవి టీనేజ్ ప్రేమ కథలు. ఈ తరానికి చెందిన వారికే ఈ తరహా చిత్రాలు తీయడం వస్తుందన్న భ్రమ కొందరిది. కాలేజిల్లో జరిగేతంతులు, లెక్చరర్లను పట్టుకొని ఏడ్పించడాలు, అమ్మాయిలని రాగింగ్ చేయడాలు, రెండు వర్గాల స్టూడెంట్సు మధ్య ఘర్షణలు, వాళ్ళే అనుభవంగా తీయగలరు అనేదృష్టి.

అటువంటి యూత్ చుట్టు అల్లుకునే కథల్నీ బాగా రాయగల పెద్దతరం రచయితలున్నా గౌరెకసాయిని నమ్ముతున్నట్లు మరీ అలవాటువడ్డ కొందరినే ఎంచుకుని రాయించుకోవడం అలవాటైంది. కొందరు నిర్మాతల జ్ఞానం కూడా అంతంతమాత్రమే కదా! ఇక ఆర్టిస్టులంతా యూత్. మాస్ బుకింగ్ లాంటిదే. దానికి కాంట్రాక్టర్సు పుట్టుకొచ్చారు. ఆర్టిస్టు సప్లైయర్స్. డిగ్రీస్టూడెంటు వేషాలు వేసేవాళ్ళు చాలమంది హైస్కూలు మొహమే సరిగ్గా చూడనివాళ్ళు. ఇహ కాలేజినేపథ్యంలో వచ్చిన ఏ ప్రేమకథ కూడా సక్సెస్సవకపోవడానికి కారణం కాలేజీలో అనాగరికత, రౌడీయిజం, 'ప్రేమ' అంటూ ఒకళ్ళవెనకాలఒకళ్ళు పడడం, ప్రేమించింది దక్కకపోతే మొగ ప్రేమికులు, వారి స్నేహితులు కూడా భోరుమని ఏడవడం, లేకపోతే దారుణాలకిదిగడం - అంతా గందరగోళంగా తయారయి, ఆడియన్స్‌ని థియేటర్‌కు లాగడానికి-కొన్ని అశ్లీలమార్గాలు కూడావేశారు. ఈ మధ్యలో ఈమోతాదు కాస్తతగ్గింది.

వరుసపెట్టి దివాళా తీసాయి ఆ తరహాచిత్రాలన్నీ. పరిశ్రమలో ఇటువంటి నిర్మాత సంగతి ఎట్లావున్నా, పంపిణీ ప్రదర్శనరంగాల్లో వున్నవారు మరీ దెబ్బతిన్నారు. దీనికికొంత కారణం ఈ మధ్యవరకూవున్న స్లాబ్‌సిస్టం. సినిమా హాల్లో పదిమందికూడా లేకపోయినా, మొత్తం హాలంతానిండే కెపాసిటీ మీద వేసే పన్ను అది.

ఇంతసేపూ-ఈ యూత్ సినిమాలగురించే ఎందుకు మాట్లాడాలనిపించిందీ అంటే-ఈ తరంలోవున్న పరిశ్రమకు జరిగే హాని వాటి మూలంగానే కాబట్టి. ఎక్కడో ఒకటో రెండో ఫామిలి డ్రామాలు మినహా అన్నీ గోవిందా.

మొత్తం సంవత్సరంలో విడుదలయ్యే చిత్రాల్లో-ఈ తరహా చిత్రాలే మెజారిటీ. మరి పరిశ్రమ దిగజారిందీ అంటే దిగజారదా!

స్టార్ సిస్టం వచ్చింతర్వాత, నిర్మాణపు ఖర్చులు పెరిగాయి. ఈ రోజున కొందరు ఆర్టిస్టులు కోట్లల్లో రెమ్యూనరేషన్ తీసుకుంటున్నారు. హీరోయిన్లు, ప్రధానపాత్రల్లోఉన్న కారెక్టర్ ఆర్టిస్టులు, టెక్నిషియన్సు ఆస్థాయిలోనే వున్నట్లు లెక్కకాబట్టి-వారి పారితోషికాలు తదనుగుణంగా పెరగడంతో సినిమా నిర్మాణానికి అయ్యేమొత్తం ఖర్చు-సినిమా సక్సెస్‌ఫుల్‌గా ఆడినా, అంతరెవెన్యూ తీసుకురాలేని పరిస్థితి-మన రాష్ట్ర మార్కెట్‌ది. ఫుల్‌కెపాసిటి రాబడికన్నా నిర్మాణానికి అయ్యేఖర్చే ఎక్కువయితే నష్టాలురాక మరేమవుతుంది? బలయ్యేవాళ్ళు ఎక్కువగా ఆచిత్రాన్ని కొన్న

**నిర్మాణదశలో పెట్టేఖర్చు, పరిమితులను దాటిపోతోంది. నిర్మాత గల్లాపెట్టె దగ్గర కూచొని డబ్బు పంచే వ్యాపారి అయిపోయాడు. కథ తెలియదు, డైలాగ్ తెలియదు, పాట తెలియదు, ఆట తెలియదు. అంతా మాయ.**

బయ్యర్లు, ఎడ్వాన్సులిచ్చిన డిస్ట్రిబ్యూటర్లు, చిత్రాన్ని కొనుక్కొని ఆడించిన ఎగ్జిబిటర్లు. అప్పులు చేసి నిర్మాణానికి దిగిన నిర్మాతల సంగతి సరేసరి. చిత్రం చివరినిమిషంలో-ఫైనాన్సియర్‌కి తనడబ్బు తనకి వడ్డీ అసలు ఫాయిదాలతోసహా ముట్టకపోతే-ఆచిత్రం ప్రింట్లు లాబొరేటరీనుంచి బయటికిరావు. ఇవన్నీ ముందు చేసుకున్న అంగీకారాల్లోని భాగాలు. దాంతో మొత్తం పోతుంది.

ఇహ టాప్‌స్టార్ల రెమ్యూనరేషన్ సంగతి. అసలీ టాప్‌స్టార్ ఎవరు? ఆ మధ్యవరకు వేషాలకోసం, నువ్వా నువ్వా అంటూ స్టూడియోల చుట్టూ తిరిగి ఇచ్చింది పుచ్చుకొని నటించినవారే. రెండు సినిమాలు సక్సెస్సయ్యేసరికి వీళ్ల రేట్లు దానికి రెండింతలు పెరిగిపోతాయి. ఈ విషయంలో స్టార్ల మధ్యనేపోటీ. అంటే ఫలానా స్టార్ ఇంత పుచ్చుకుంటున్నాడు అని ఘనంగా చెప్పుకునే గొప్పదనం, దాన్ని చూసి అంతకన్న నాకెక్కువ ఇస్తున్నారు అని మరొకడు చెప్పుకుంటే అవతలివాడుగొప్ప. ఇక్కడ పోటీ నటనలో, సినిమాగొప్పదనంలో కాదు, నిర్మాతనించి పుచ్చుకునే పారితోషికం మొత్తాన్నిబట్టి.

ఇదిలా ఉంటే ప్రింట్లసంఖ్యా పెరగడంతో-దానిమీద కొంతఖర్చు, థియేటర్లరెంట్లు, పబ్లిసిటిఖర్చు టీవీలు వచ్చింతర్వాత మరింత పెరగడం అంతామొత్తం ఇండస్ట్రీని అతలా కుతలం చేసింది. పైగా వచ్చే రాబడికి గండి కొట్టడంలా-సి.డి. పైరసీలు. ఎన్నిచట్టాలొచ్చినా-ఈ సినిమా దొంగలు తమపని తాము చేసుక పోతూనేవుంటారు. వీటి పుణ్యమా అనికొంత, సినిమా హాళ్ళకు వెళ్లకుండానే ఇంట్లో టీవీల్లో వచ్చేదేదో చూసుకోవచ్చన్న కారణంకొంత, థియేటర్ల టికెట్ ధరలు పెరగడంవల్ల కొంత-సినిమాహాళ్లకి వెళ్ళి సినిమా చూసేవారి సంఖ్య పడిపోయింది.

ప్రభుత్వ పరంగా ఎన్నిచర్యలు తీసుకున్నా సినిమాలో చూడతగ్గ అంశాలు, నాణ్యత లేకపోతే ప్రేక్షకులు సినిమా హాళ్ళకురారు అన్న విషయాన్ని ఈ మధ్య టిక్కెట్‌రేట్లు తగ్గించినా కూడా రాని జనం నిరూపించారు. మంచిసినిమా అని టాక్ వస్తేనే వెళ్ళిచూస్తారు. చివరికి టాప్‌హీరో సినిమా రిలీజప్పుడు గుమిగూడిన ప్రేక్షకులు ఈ సినిమా బాగలేదని టాక్‌వచ్చిన ఆ సాయంత్రానికే పలుచ బడిపోతారు.

ఇప్పుడు రావాల్సిన మార్పు చిత్రనిర్మాణంలోనే. మంచిసినిమా అంటే మంచికథ, మంచిటేకింగుతప్ప, మంచిఖర్చు, నంబర్ ఆఫ్ ప్రింట్స్‌కాదు. నిర్మాణదశలో పెట్టేఖర్చు, పరిమితులను దాటిపోతోంది. నిర్మాత గల్లాపెట్టె దగ్గర కూచొని డబ్బు పంచే వ్యాపారి అయిపోయాడు. కథ తెలియదు, డైలాగ్ తెలియదు, పాట తెలియదు, ఆట తెలియదు. అంతా మాయ. దాన్లో కూరుకపోయి సొమ్ము పోగొట్టుకోవడంలో ఎక్స్‌పర్ట్‌గా మారాడు. ఇహనిర్మాణానికి పెట్టే ఖర్చులో అధికభాగం-తెరపై కనపడవలసిన విషయాలపైన కన్నా ఇతర విషయాలకే మంచినీళ్ళలా ఖర్చయిపోతోంది. ముడిఫిలిం ఈ రోజుల్లో ఖర్చయినంత ఎప్పుడూ జరగలేదు. నిర్మాత, దర్శకుడు, రచయిత, హీరో కాంబినేషన్ ఎప్పుడో పోయింది. ఎవరిదారి వారిదే. రిలీజుగాని సినిమాలు డబ్బాల్లో మూలుగుతూ బోల్డన్నివున్నాయి. ప్రొడ్యూసర్ హీరో చేతిలో కీలుబొమ్మ. ఈ మధ్యకాలంలోదర్శకుడి హవా కూడా పెరిగింది. కొందరు హీరో స్థాయిలో డబ్బులు తీసుకుం టున్నారు.

వీటన్నింటిమీదా కంట్రోలు వుండాల్సింది రాష్ట్ర ఫిలింఛాంబర్‌కి. దీన్లో పరిశ్రమకి చెందిన అన్ని విభాగాలవాళ్ళు వుంటారు. మూవీ ఆర్టిస్ట్స్ ఎసోసియేషన్ పేరిట నటీనటులకి వేరే సంస్థవుంది. ప్రొడ్యూసర్స్ కౌన్సిల్‌వుంది. ఇన్నివున్నా, సమన్వయలోపంవల్ల పరిశ్రమ తల్లకిందులవుతూ వస్తోంది. అన్నింటికన్నా ఎక్కువ బాధించే విషయం-చిత్రాల్లో నాణ్యతలేకపోగా-చౌకబారుతనం విపరీతంగా పెరిగింది. పరిశ్రమ బాగు పడాలంటే ఒక ఉద్యమంగా, అన్ని పరిశ్రమల రంగాలవాళ్ళూ కలిసి కదలాలి. మొన్న స్లాబ్ఎత్తేయమని అడిగినట్లు, తమకికావలసిపడిగి చేయించేసుకుంటున్నారుగాని ప్రేక్షకులపట్ల, సమాజంపట్ల తమబాధ్యతలు పట్టించుకోవడంలేదు. అదిపోవాలి. ❑

# భారత రక్షణ విధానం పునాది ఏమిటి?

-మేజర్ జైపాల్ సింగ్

వీక్షణం మే/జూన్ 2005 సంచికలో దిగుమర్తి నరసింహారావు గారు రాసిన 'భారత రక్షణ విధానం సవ్యంగానే ఉందా?' అనే వ్యాసం అనేక అసత్యాలతో, తప్పుడు వాదనలతో, జాతీయ దురహంకారంతో, జరిగిన వాస్తవాలను విస్మరించే గుడ్డితనంతో ఉంది. ఇటువంటి వ్యాసం వీక్షణం పుటలలో అచ్చుకు నోచుకోవడమే ఆశ్చర్యకరం. భారత రక్షణ విధానాన్ని, భారత పాలకుల రక్షణ వ్యూహాలను బేషరతుగా, నిర్విమర్శగా అంగీకరిస్తున్న ఆ వ్యాసాన్ని వాస్తవాల ఆధారంగా చాలా తీవ్రంగా ఖండించవచ్చును. మౌలికంగా ఆ వ్యాసం పునాదిగా పెట్టుకున్న ఆలోచనలలోనే చాలా తప్పుడు అవగాహనలున్నాయి. ''మనదేశం'', ''మన ప్రభుత్వం'' చేసిందంతా సరైనది, పొరుగుదేశాలు, ప్రభుత్వాలు చేసేదంతా తప్పు అనే వైఖరితో ఆవ్యాసం రాసినట్టు కనబడుతోంది. భారత ప్రభుత్వాన్ని, భారత పాలకులను, వారి విధానాలను దేశం లోపల తీవ్రంగా విమర్శించే వారు కూడా, విదేశీ వ్యవహారాలలో, రక్షణ వ్యవహారాలలో ప్రభుత్వ విధానాలను నిరభ్యంతరంగా సమర్థించే ఒక తప్పుడు ధోరణి చాలా కాలంగా ఉంటూ వస్తున్నది. ఈ వ్యాసం కూడా అందుకు ఒక ఉదాహరణ.

''సామ్రాజ్య కాంక్షలేకుండా, పొరుగుదేశాల భూభాగాల్ని హరించాలన్న దురుద్దేశ్యం లేని భారతదేశం వంటి శాంతి కాముక దేశాలు'', ''మన రక్షణ విధానాలను, మన పొరుగు దేశాలు మన దేశం పట్ల అవలంబిస్తున్న వైఖరిననుసరించి ఎప్పటికప్పుడు రూపు దిద్దుకుంటున్నది'', ''భారత దేశానికి ఏదేశ భూభాగంపై దాడి చేసి, దురాక్రమణ ద్వారా సరిహద్దులను విస్తరించాలన్న కోరిక ఎప్పుడూ ఏనాడూ చరిత్రలో కాని, వర్తమానంలోకాని లేదు'' వంటి వ్యక్తీకరణలు ఆ వ్యాసం నిండా ఉన్నాయి. వీటిలో ఏ ఒక్కదాని లోను నిజం లేదు.

నిజానికి భారత రక్షణ విధానం 1947 నుంచీ కూడ నాలుగు తప్పుడు పునాదుల మీద ఆధారపడి ఉంది. ఆ పునాదులలో ఏ ఒక్కటి కూడ భారత ప్రజలను రక్షించడం, భారత సార్వభౌమత్వాన్ని పరిరక్షించడం అనే అంశాలపై ఆధారపడి లేవు. స్వయంగా ప్రభుత్వ ఆర్థిక, రాజకీయ విధానాలు దేశ సార్వభౌమత్వాన్ని అగ్రరాజ్యాల పాదాల దగ్గర తాకట్టుపెడుతుండగా స్వతంత్ర రక్షణ విధానాన్ని ఊహించడమే అసాధ్యం. అయినా వీలయిన చోట్ల కూడ రక్షణ విధానంలో స్వతంత్రంగా ఉండకుండా, అగ్రరాజ్యాలకు, ఆయుధవ్యాపారులకు, బహుళజాతి సంస్థలకు దాసోహం అనడమే ఒక విధానంగా భారత పాలకులు అమలుచేస్తూ వచ్చారు. అందువల్ల 1950 ల నుంచి ఇప్పటిదాకా కొనసాగుతున్న భారత రక్షణ విధానానికి పునాదిగా ఉన్న అంశాలను స్థూలంగా కింది నాలుగు తప్పుడు పునాదులుగా విభజించవచ్చు:

1. విదేశీ బూచి, సమస్యల వక్రీకరణ, అంతర్గత సమస్యల నుంచి తప్పించుకోవడానికి ఒక సాధనంగా విదేశీబూచి, యుద్ధం.
2. విస్తరణవాదం, దక్షిణాసియాలో పెద్దన్నగా వ్యవహరించడం, పొరుగు దేశాల మీద కయ్యానికి కాలు దువ్వడం.
3. 1990 ల వరకూ అటు సోవియట్ యూనియన్, ఇటు అమెరికా సైనిక, రాజకీయ, ఆర్థిక ప్రయోజనాలకు అనుగుణంగా రక్షణ విధానం రూపొందించుకోవడం. 1990 ల తర్వాత స్థూలంగా అమెరికాకు అనుకూలంగా, ప్రత్యేకించి ఆయుధ వ్యాపారులకు అనుకూలంగా రక్షణ విధానం తయారు చేసుకోవడం.
4. దేశ రక్షణను వాస్తవికంగా కాక అతిశయోక్తులతో, ఆయుధ వ్యాపారుల ప్రయోజనాల కోసం అంచనా వేయడం. అందువల్ల విపరీతంగా ఆయుధాలు కొనుగోలు చేయడం, రక్షణ వ్యయం ఇబ్బడి ముబ్బడిగా పెంచుతూపోవడం, ఆ వ్యయంలోంచి విపరీతంగా ముడుపులు తీసుకుని దేశవిదేశాల్లో ఆస్తులు పోగేసుకోవడం.

ఈ నాలుగు అంశాలను వివరిస్తూ, ఒక్కొక్క అంశం మీద గడిచిన 57 సంవత్సరాల చరిత్రను వివరిస్తూ విస్తృతంగా రాయవచ్చు. ఇక్కడ కేవలం నరసింహారావు గారి వ్యాసం మీద విమర్శగా ఈ నాలుగు అంశాల మీద స్థూలంగా వివరణ ఇస్తాను.

1. గడిచిన 57 సంవత్సరాలలో నిజంగా భారత దేశానికి పొరుగుదేశాలతో వచ్చిన సమస్య ఏమి లేదు. మన ఇరుగు పొరుగు దేశాలలో చైనాకు మినహా మరే ఇతర దేశానికి సైనిక పాటవంలో భారతసైన్యానికి ఉన్నదానిలో నాలుగోవంతు శక్తి సామర్థ్యాలు కూడ లేవు. చైనాతో కూడ మొదటి 15 సంవత్సరాలు నడిచినమైత్రి, 'పంచశీల' చెడిపోయి 1962 యుద్ధం రావడానికి ఇరువైపుల నుంచీ కారణాలున్నాయి. ఇక పాకిస్తాన్‌తో జరిగిన మూడు నాలుగు యుద్ధాలు స్థానిక ఘర్షణలే తప్ప నిజంగా యుద్ధంగా చెప్పగల స్థాయివి కావు. ఒక్క చైనా మినహా మిగిలిన సరిహద్దు దేశాల

ఆర్థిక వ్యవస్థలు, జాతీయాదాయాలు, ఆ జాతీయాదాయంలో రక్షణవ్యయం వాటా భారత ఆర్థిక వ్యవస్థతో, జాతీయాదాయంతో, రక్షణవ్యయంతో పోల్చదగినవి కానే కాదు. అయినా భారత పాలక వర్గాలు (అధికారంలో ఉన్న ముఠాలు, ప్రతిపక్షంలో ఉన్న ముఠాలు కూడా) ఏకకంఠంతో భారత సైన్యాలు ఎల్లప్పుడూ యుద్ధ సన్నద్ధంగా ఉండడం గురించి మాట్లాడుతున్నాయి. రక్షణవ్యయం ఇంకా ఇంకా పెరగాలని కోరుతున్నాయి. ప్రజలలో జాతీయ దురహంకారాన్ని, యుద్ధోన్మాదాన్ని రెచ్చగొట్టడానికి ప్రయత్నిస్తున్నాయి.

రక్షణ విధానంలో ఇటువంటి వైఖరి నిజానికి ఆంతరంగిక విధానాలకు ప్రతిఫలనమే. ఆంతరంగికంగా ప్రజల నిత్యావసరాలేవీ తీర్చలేకపోయిన పాలకవర్గాలు, ఆ నిత్యజీవితసమస్యలపై ప్రజలు పోరాడకుండా, ఆలోచించకుండా చేసేందుకు ఒక ఎత్తుగడగానే విదేశీ బూచిని చూపిస్తూ వచ్చాయి. ప్రతి సంవత్సరం బడ్జెట్ ప్రవేశపెట్టబోయే ముందు సరిహద్దు ప్రాంతాలలో ఘర్షణలు జరుగుతున్నాయనే వార్తలు రావడం, ఆ వార్తలు నిజమో కాదో ప్రజలు తేల్చుకునేలోపలే, ఆ ఘర్షణల వల్ల రక్షణవ్యయం పెరగవలసిన అవసరం ఉందని ప్రకటించి, బడ్జెట్ కేటాయింపులు పెంచడం పరిపాటి అయింది. సంక్షేమ కేటాయింపులు నిలకడగా ఉండడమో, తగ్గించడమో జరుగుతుండగా రక్షణ కేటాయింపులలో వేల కోట్ల రూపాయల పెరుగుదల ఉంటోంది.

నిజంగా సరిహద్దు దేశాలతో సమస్యలు ఉన్న సందర్భాలలో కూడ ఆ సమస్యలను సామరస్య పూర్వకంగా, చర్చల ద్వారా పరిష్కరించే బదులు ఘర్షణ వైఖరిని, ఉద్రిక్తతా పూర్వక వైఖరిని తీసుకోవడం, సమస్యలను పెంచడం, యుద్ధమేఘాలు వ్యాపించేలా ప్రవర్తించడం భారతపాలక వర్గాలకు అలవాటయింది. ఇది కూడా దేశంలో యుద్ధోన్మాదాన్ని రెచ్చగొట్టి నిజమైన సమస్యల గురించి ఆలోచించకుండా చేయడానికి ఒక సాధనంగా మారింది.

భారత రక్షణ విధానం ఇప్పుడున్న అపసవ్యస్థితి నుంచి మారాలంటే మొట్ట మొదట పాలకవర్గాలు అనుసరిస్తున్న ఈ వక్రీకరణ పద్ధతి మారాలి. ప్రజల నిత్యజీవిత సమస్యలు పరిష్కరించడమే దేశ రక్షణకు మొదటి మెట్టని గుర్తించాలి. ఆ సమస్యల విస్మరణకు, మసిబూసి మారేడు కాయ చేయడానికి రక్షణ విధానం ఒక సాధనమని అనుకోగూడదు.

2. భారతదేశానికి సామ్రాజ్యకాంక్ష లేదని, పొరుగు దేశాన్ని కబళించాలనే లక్ష్యం లేదని నరసింహారావు గారు చాల సర్టిఫికెట్లుఇచ్చారు. భారత ప్రజలు శాంతి కాముకులనడంలో సందేహం లేదు. కాని భారత పాలకులు - వారి జెండాలూ ఎజెండాలూ ఏమయినప్పటికీ - పొరుగుదేశాల మీద పెత్తనం చలాయిస్తూ వస్తున్నారు. దక్షిణాసియాలో తమ పెద్దరికం నడవాలని, మిగిలిన దేశాలన్నీ తమ బొటనవేలి కింద ఉండాలని, గతంలో సోవియట్ యూనియన్‌కో, ఇప్పుడు అమెరికాకో దక్షిణాసియాలో తామే పెద్ద పాలేరుగా ఉండాలని భారత పాలకులు ప్రయత్నిస్తున్నారు. ఈ విషయం గ్రహించడానికి గత ఐదారు దశాబ్దాల చరిత్రను నిష్పక్షపాతంగా చదివితే సరిపోతుంది.

మొట్టమొదట, భారత విస్తరణ కాంక్షకు భారతరాజ్యాంగమే ఆమోదముద్ర వేసింది. అధికరణం 1 లో భారతదేశం అంటే ఏమిటో వివరణ ఇస్తూ రాజ్యాంగం "రాష్ట్రాల భూభాగాలు, కేంద్రపాలిత భూభాగాలు"తో పాటు "ఆక్రమించుకునే/సంపాదించుకునే ఇతర భూభాగాలు" అని అంది. అంటే భారతప్రభుత్వం ఏ దేశంమీదనైనా, ఏ భూభాగం మీదనైనా దాడి జరిపి ఆ భూభాగం తనదే అని చెప్పుకుంటే అది భారతదేశంలో భాగమవుతుంది. 1975 లో ఇందిరాగాంధీ ప్రభుత్వం సిక్కిం అనే స్వతంత్రరాజ్యం పైన అట్లాగే సైనిక దాడి జరిపి, దాన్ని భారతదేశంలో ఒక రాష్ట్రంగా మార్చివేసింది.

రెండవది, భారత ప్రభుత్వం, ముఖ్యంగా 1970 ల నుంచీ పొరుగు దేశాల ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం చేసుకుంటూ, ఆయాదేశాల ప్రభుత్వాల మెడలు వంచడానికి ప్రయత్నం చేస్తోంది. తూర్పు పాకిస్తాన్‌లో పెల్లుబికిన న్యాయమైన ప్రజాగ్రహాన్ని తన సొంతం చేసుకోవడానికి ముక్తిబాహిని అనే కిరాయి సైన్యాన్ని తయారు చేసి పాకిస్తాన్‌ను రెండు ముక్కలు చేయడంలో భారత ప్రభుత్వం ప్రధాన పాత్ర వహించింది. బంగ్లాదేశ్ ఏర్పడినప్పటి నుంచీ నదీ జలాల పంపిణీలో, విదేశీ వాణిజ్యంలో ఆ దేశపు ప్రభుత్వాలతో ఘర్షణకు దిగుతోంది. శ్రీలంకలో తమిళులకు, సింహళీయులకు ఘర్షణలు తలెత్తినప్పుడు భారత ప్రభుత్వమే తమిళనాడులో ఎన్నోచోట్ల ఎల్‌టిటిఇ కార్యకర్తలకు సైనిక శిక్షణ ఇచ్చింది. ఆ కార్యకర్తలు తన చేయి దాటి పోయారనుకున్నప్పుడు శ్రీలంక ప్రభుత్వంతో చేయి కలిపి భారత శాంతి పరిరక్షణ సైన్యాన్ని ఏర్పరచి శ్రీలంక భూభాగం మీద ఎల్‌టిటిఇతో యుద్ధం చేసింది. సముద్రతీరం లేనందువల్ల విదేశీ సంబంధాలకు భారతదేశం మీద ఆధారపడే నేపాల్, భూటాన్ ప్రభుత్వాల మెడలు వంచి ఆదేశాల ప్రజల ప్రయోజనాలకు అవమానకరమైన షరతుల మీద సంతకాలు పెట్టించింది. ఇక పాకిస్తాన్ ప్రభుత్వంతో భారత ప్రభుత్వం వ్యవహరించే వైఖరి గురించి ఎంత తక్కువ చెప్పుకుంటే అంత మంచిది. కాకపోతే కుయుక్తులు పన్నడంలో, శత్రు వ్యూహాలు రచించడంలో ఈ రెండు ప్రభుత్వాలూ ఒకదానికొకటి ధీ అంటే ధీ అనే స్థితిలో ఉన్నాయిగనుక భారత ప్రభుత్వపు విస్తరణకాంక్ష, పెద్దరికం అక్కడ చెల్లుబాటు కావడం లేదు.

పొరుగు దేశాలతో సంబంధాల విషయంలో భారత ప్రభుత్వం

అనుసరిస్తున్న విధానం అటు పంచశీలకుగాని, ఇటు అలీనోద్యమ స్ఫూర్తికి గాని, కనీసం దక్షిణాసియాదేశాల సమాఖ్య అవగాహనకు గాని అనుకూలమైనది కాదు.

3. భారత రక్షణ విధానంలో పొరుగుదేశాల పట్ల ఇటువంటి వైఖరి ఉండడానికి పూర్తి బాధ్యత భారత పాలకవర్గాలది మాత్రమే కాదు. అసలు వ్యూహాత్మకంగా దక్షిణాసియా తమ ప్రభావ ప్రాంతంగా ఉండాలని ప్రచ్ఛన్నయుద్ధం రోజులలో అటు సోవియట్ యూనియన్, ఇటు అమెరికా చేసిన ప్రయత్నాలు, పన్నిన కుట్రలు భారత రక్షణ విధానాన్ని తయారు చేశాయి. 1947 నుంచి ఒక దశాబ్దం పాటు అటు రష్యావైపు, ఆ తర్వాత మరొక దశాబ్దం పాటు అమెరికావైపు మొగ్గు, ఆ తర్వాత అలీనోద్యమం పేరుతో మళ్ళీ రష్యావైపు మొగ్గు, ఈ మధ్యలో ఇరు పక్షాలతో బేరసారాలాడుతూ విదేశాంగ విధానాన్ని లాభ నష్టాల స్థాయికి దిగజార్చడం, చివరికి 1990 ల తర్వాత పూర్తిగా అమెరికాకు దాసానదాసులుగా ప్రవర్తించడం, ఇప్పుడు ఆయుధ వ్యాపారుల ప్రయోజనాల కొరకే రక్షణ, విదేశాంగ విధానాలను తయారు చేయడం జరుగుతోంది. ఈ ఊగిసలాట వైఖరి, దాసోహంగా వ్యవహరించే వైఖరి అగ్రరాజ్యాలకు రాజకీయంగా, ఆయుధ వ్యాపారులకు ఆర్థికంగా ఉపయోగపడిందేగాని భారత ప్రజానీకానికి ఎందుకూ పనికి రాలేదు.

4. భారత ప్రజానీకపు ప్రయోజనాలను పట్టించుకోని ఈ విధానాలు భారతపాలక వర్గాలలోని ఒక చిన్న ముఠాకు వందల వేల కోట్ల రూపాయలు సంపాదించి పెట్టడానికి పనికి వచ్చాయి. అసలు రక్షణవ్యయం పేరు మీద వేల కోట్ల రూపాయలు కేటాయించేటప్పుడే అందులో ఎంతోకొంత శాతం ముడుపులుగా తమ సొంత ఖాతాల్లోకి చేరుతాయని భారత పాలకులకు తెలుసు. బోఫోర్స్ ఉదంతం నుంచి ప్రస్తుతం దాకా దాదాపు ప్రతి సిఎజి నివేదికలోనూ ఈ అవినీతి కుంభకోణాలు వెలుగు చూస్తూనే ఉన్నాయి. ఇక రక్షణ వ్యవహారాలు అధికారిక రహస్యాల కిందికి వస్తాయి కాబట్టి బైటపడని కుంభకోణాలు మరెన్నో రెట్లు ఉంటాయి. రక్షణశాఖ కేటాయింపులు, కాంట్రాక్టులు పాలకవర్గాలకు కామధేనువులుగా పనిచేస్తున్నాయి. ఈ అంశాన్ని పరిగణనలోకి తీసుకోకుండా రక్షణ విధానం గురించి, ఆయుధ కొనుగోళ్ళ గురించి ఎంత మాట్లాడినా ప్రయోజనం లేదు. ❑

*(19వ పేజీ తరువాయి)*

ఉంచగలిగే ప్రణాళికలను ప్రభుత్వాలెందుకు అమలు పరచడం లేదు? ప్రతి ఏటా కల్తీ విత్తన కాటుకు కోట్లాది రూపాయల పెట్టుబడులను నష్టపోతున్న సమస్యకు పరిష్కారం లేదు. వ్యవసాయోత్పత్తులకు మద్దతు ధరలు దొరికి పెట్టుబడైనా మిగిలిందన్న సంతృప్తి రైతుకు దక్కడం లేదు. కరెంటుకోత, కొరతలతో వేలాది ఎకరాల్లో పంటలెండి, పంపుసెట్లు కాలడంతో జరుగుతున్న నష్టాలకు ప్రభుత్వాలది బాధ్యత కాకుండా పోతుంది. ఇలా అనేక సమస్యలపై ఆందోళనలు - పోరాటాలు లేకుండా ఫలానా ఏడాది ఫలానా సీజన్ గడిచిందన్న దాఖలాలేదు.

వ్యవసాయంలో నెలకొన్న సంక్షోభానికి సాగునీరొక్కటే సమస్య కాదు. సాగునీటి సౌకర్యం కల్పించడం సర్వరోగనివారిణి కాదనేది ప్రభుత్వానికి తెలియని విషయమేమికాదు. అయినా జలయజ్ఞం పేరుతో చేస్తున్న హడావుడి వెనుకగల అసలు విషయం, పేదరైతుల నుండి కంపెనీ, కార్పొరేట్, సంపన్నవర్గాల చేతిలోకి బదలాయించబడుతున్న భూములకు సాగునీటిని గ్యారంటీ చేయడం కోసమే! ప్రభుత్వాల ప్రభు భక్తికి ఇంతకు మించిన నిదర్శనం అక్కరలేదు. స్వతంత్రానికి మరో రెండేళ్లలో షష్టిపూర్తి ముగిసి పోతున్నా పేదల భూములకు నీళ్లివ్వాలని ఆలోచించని ప్రభుత్వాలు, ఆ భూములకు సంపన్న వర్గాలు యజమానులు కాగానే సాగునీటి సౌకర్యాన్ని కల్పించడం కోసం తెగ ఉబలాట పడిపోతున్నాయి. ఇప్పటిదాక అధికారంలోకి వచ్చి పోతున్న ప్రభుత్వాలన్నింటికి ఈ ఆలోచన ఉన్నా, దీన్ని అమలు పరిచిన ఘనత మాత్రం రాజశేఖరుని ప్రభుత్వానికే దక్కుతుంది! ప్రాజెక్టుల నిర్మాణాల్లో వేగం ఎంతో ఉందో తెలియదు కాని, సన్న-చిన్నకారు రైతుల భూ విక్రయాలు మాత్రం శరవేగంగా కొనసాగుతున్నాయి. ప్రభుత్వానికి తాను నిర్మించబోయే ప్రాజెక్టుల ద్వారా పేదరైతాంగ భూమిని తడపాలని ఏ మాత్రం చిత్తశుద్ధి ఉన్నా, ఆ రైతులు భూములు అమ్మకుండా ఉంచ గలిగే ప్రణాళికలను అమలు చేయగలగాలి. అప్పుడే జలయజ్ఞానికి సార్థకత. ❑

'వీక్షణం' మే/జూన్ 2005 సంచికలో అచ్చయిన మూడు వ్యాసాలను గుంటూరు నుంచి వెలువడే 'ట్రేడ్ ట్రెండ్స్' పత్రిక రచయితల పేర్లుగాని, 'వీక్షణం'లో అచ్చయ్యాయనే ప్రస్తావనగాని లేకుండా పునర్ముద్రించించి. 'వీక్షణం'లో అచ్చయిన వ్యాసాలకు ఎంత ఎక్కువ ప్రచారం జరిగితే అంత మంచిదే కాని రచయితలకు, పత్రికకు క్రెడిట్ ఇవ్వడం మంచి పత్రికా సంప్రదాయమని అనుకుంటున్నాం.

జూలై 2005 సంచికలో ఎం. రామాంజనేయులు రచనగా అచ్చయిన 'దళితులు-విద్య' ఆయన రచన కాదని తెలియజేయడానికి విచారిస్తున్నాము. ఆ వ్యాసం నిజానికి దళిత్ హ్యూమన్ రైట్స్ ఫోరం పత్రిక 'సాక్షి'లో కట్టా వెంకటేశ్వర్లు రాసిన వ్యాసానికి అనుకరణ. జరిగిన పొరపాటుకు మూల రచయితకు, తొలిసారి ప్రచురించిన పత్రిక సంపాదకులకు క్షమాపణలు తెలియజేస్తున్నాం.

- సంపాదకుడు

# వ్యవసాయ సంస్కరణల గురించి...

(గతసంచిక తరువాయి)

- వెన్నెలకంటి రామారావు

"పెట్టుబడిదారీ వ్యవసాయంలో సమస్త ప్రగతి, కళలో ప్రగతే. అది కార్మికుణ్ణే కాక, భూసారాన్ని కూడా దోచుకునే కళలో ప్రగతి. ఆసారానికి గల శాశ్వత మూలాధారాలను నాశనం చేయడంలో ప్రగతే. ఒకదేశం, ఉదాహరణకు అమెరికాలాగ ఆధునిక పరిశ్రమల పునాదిపై అభివృద్ధి చెందడం ప్రారంభించిన కొద్దీ, ఈ విధ్వంసన క్రమం మరింత త్వరితగతిలో సాగుతుంది. కాబట్టి పెట్టుబడిదారీ ఉత్పత్తి సమస్త సంపదకు మూలాధారాలను, అంటే నేలను, శ్రామికుణ్ణి పీల్చి పిప్పి చేయడం ద్వారా మాత్రమే సాంకేతిక విజ్ఞానాన్ని, సామాజిక ఉత్పత్తి ప్రక్రియల సమ్మేళన స్థాయిని అభివృద్ధి పరుస్తుంది."

సామ్రాజ్యవాద విధానాన్ని వ్యతిరేకిస్తూ భూ వికేంద్రీకరణ రూపంలోని అంటే దున్నేవానికి భూమి రూపంలో అమలు జరిగే భూ సంస్కరణలే సరైనవనే వాదనను ప్రజాస్వామిక వాదులు, విప్లవకారులు ముందుకు తెస్తున్నారు. పెట్టుబడిదారీ పూర్వ సమాజాలలోని చిన్న కమతాల సేద్యం పర్యావరణ పరిరక్షణకు అనుకూలమైనదని, వాటి ద్వారా ఉత్పత్తి, ఉత్పాదకత గణనీయంగా పెంచవచ్చుననీ కొందరు పర్యావరణవాదులు వాదిస్తున్నారు.

అయితే ప్రపంచ ఆర్థిక వ్యవస్థలోని వ్యవసాయ అధికోత్పత్తి సంక్షోభం కారణంగా మనలాంటి దేశాలలో అధికోత్పత్తికి దోహదపడే భూ కేంద్రీకరణ క్రమం గిడసబారి పోవడంతో, దాదాపు 80 శాతం చిన్న కమతాలు మన వ్యవసాయ రంగంలో కొనసాగుతున్నాయి. ఎదుగుబొదుగులేని ఉత్పత్తి పద్ధతులతో నష్టాల ఊబిలో కూరుకుపోయి 2002-2003 సం॥ నాటికి ఒక మన రాష్ట్రంలోనే 1.28 కోట్ల ఎకరాల సాగుభూమి బీడుభూమిగా మారిపోయింది. ఉత్పాదకత గణనీయంగా పడిపోయింది. భూవికేంద్రీకరణ రూపంలోని భూ సంస్కరణలు చిన్న కమతాలు ఉనికిలో ఉండడం రూపంలో దేశంలో కొనసాగుతున్నాయి. ఈ నేపథ్యంలో దున్నేవానికి భూమి అనే రూపంలోని భూసంస్కరణలు అమలు జరగాలనే డిమాండ్ అర్థరహితమైనది. కేవలం భూ సంస్కరణల అమలు వల్ల, భూముల పంపిణీ వల్ల సమస్య పరిష్కారం కాదు. ఆ రంగానికి కావలసిన ఉపకరణాలు, నూతన టెక్నాలజీ, సాగునీరు, రుణసౌకర్యం, మార్కెట్ వనరులను కూడా కల్పిస్తేనే వ్యవసాయం గిట్టుబాటు అవుతుంది. అయితే ప్రపంచ బ్యాంకు ఆదేశిత విధానాల ప్రకారంగా నడుచుకునే ప్రభుత్వాలు ఇలాంటి వనరులను కల్పించలేవు. దాంతో రైతాంగం భూములను తెగనమ్ముకొనవలసిన పరిస్థితులలోకి నెట్టబడుతుంది. అలా తిరిగి భూకేంద్రీకరణ క్రమం సాగుతుంది.

బ్యురాక్రటిక్ పెట్టుబడిదారుల (ప్రత్యక్ష-పరోక్ష) చేతులలో భూమి కేంద్రీకరింప బడుతుంది.

చిన్న భూ ఆస్తికి, అత్యధిక ప్రజానీకం గ్రామీణులై ఉండాలి. సామాజిక శ్రమకాక, ఒంటరి శ్రమ, ప్రబలంగా ఉండాలి. చిన్న కమతాల యాజమాన్యం ప్రబలంగా ఉన్న చోట పెట్టుబడి రూపొందడం అనేది, సామాజిక పునరుత్పత్తి సాపేక్షికంగా బలహీనంగా ఉంటుంది. కనుక అటువంటి పరిస్థితులలో పునరుత్పత్తి దాని భౌతిక, ఆత్మిక అవసరాల సమృద్ధి, అభివృద్ధి అన్నవి అసాధ్యం. హేతుబద్ధ వ్యవసాయానికి అవసరమైన పరిస్థితులు కూడా దుర్లభం అవుతాయి. వివిధ చారిత్రక దేశాలలో వ్యవసాయక ఉత్పత్తి సంబంధాలు (వ్యవసాయ ఆస్తి సంబంధాలు + వ్యవసాయ శ్రమ సంబంధాలు వ్యవసాయ+పంపిణీ సంబంధాలు) కేంద్రీకరణ వికేంద్రీకరణలకు గురవుతూ, వస్తుగతంగా అభివృద్ధి చెందుతాయి. ఉనికిలో ఉన్న ఆధిపత్య వర్గశక్తుల వద్ద అదనపు విలువ పోగయ్యేందుకు కేంద్రీకరణ ఉపయోగపడితే, భవిష్యత్తు సమాజాలలోని ఆధిపత్య వర్గ శక్తులు ఉనికిలోకి వచ్చేంత వరకు వికేంద్రీకరణ క్రమం ఉపయోగపడుతుంది. ఇదొక వస్తుగత సామాజిక నియమం. ఫ్యూడల్ కేంద్రీకరణ నుండి పెట్టుబడిదారీ కేంద్రీకరణకు మధ్యకాలంలో వికేంద్రీకరణ క్రమం అత్యంత కీలకమైనది. కేవలం వికేంద్రీకరణ క్రమమే అభివృద్ధికరమైంది కాదు. అది అంతటితో నిలువదు. దానికదే ఏదేని వర్గ శక్తుల పునాదిగా కేంద్రీకరించ బడుతుంది. అందువలన భూ వికేంద్రీకరణ రూపంలోని భూ సంస్కరణలు ఉమ్మడి వ్యవసాయక ఉత్పత్తి సంబంధాల ప్రాతిపదికగా కేంద్రీకరించబడకపోతే పాత ఆధిపత్య వర్గం శక్తుల చేతుల్లోకి తిరిగి కేంద్రీకరించబడుతుంది. దున్నేవానికి భూమి విధానంతో వికేంద్రీకరింపబడిన భూమి సహకార వ్యవసాయం, సమష్టి వ్యవసాయాల రూపంలో ఉమ్మడి ఆస్తి సంబంధాల ప్రాతిపదికన కేంద్రీకరింపబడకపోతే దోపిడీ వర్గాల చేతులలో (నూతన రూపాలతో) తిరిగి కేంద్రీకరింపబడుతుంది. మనదేశంలో వామపక్ష ప్రభుత్వాలున్న పశ్చిమబెంగాల్, కేరళ రాష్ట్రాలలో దాదాపు పూర్తి స్థాయిలో వికేంద్రీకరణ రూపంలో (దున్నేవానికి భూమి) సంస్కరణలు అమలు జరిగాయనేది రికార్డులలో ఉంది. అంతవరకే పరిమితమై అంతకంటె ఉన్నతమైన సహకార, సమష్టి వ్యవసాయ ఉత్పత్తి సంబంధాల రూపం తీసుకోవడంలోని వైఫల్యం వలన భూమి తిరిగి బురాక్రటిక్ పెట్టుబడిదారుల (ప్రత్యక్ష, పరోక్ష) చేతుల్లో కేంద్రీకరించబడింది. గతంలో రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత అమెరికా పాలకులు జపాన్, కొరియా, తైవాన్‌లలో భూసంస్కరణలు అమలు చేశారు. అది ఫ్యూడల్ భూకేంద్రీకరణ

స్థానంలో పెట్టుబడిదారీ కేంద్రీకరణకే దారితీసింది. ఈ నేపథ్యం నుండి చూస్తే విప్లవ పార్టీలు భూ వికేంద్రీకరణ రూపంలోని భూ సంస్కరణలు (దున్నేవానికి భూమి) అమలు చేసినప్పటికీ తమ ప్రభావిత ప్రాంతాలలోనూ, అధీన ప్రాంతాలలోనూ, సహకార వ్యవసాయ, సమష్టి వ్యవసాయాలను ఆర్గనైజ్ చేయకపోతే మార్కెట్ చలన నియమాలకు లోబడి భూమి తిరిగి కేంద్రీకరింప బడుతుంది. మార్కెట్ నియమాలలో భూకేంద్రీకరణ అనేది ప్రయత్న రహిత కేంద్రీకరణ అయితే సహకార వ్యవసాయం, సమష్టి వ్యవసాయాలను ఆర్గనైజ్ చేయడమనేది చైతన్యయుతమైన భూకేంద్రీకరణ అవుతుంది. ఎటొచ్చీ భూకేంద్రీకరణ తప్పదు. కేవలం సాంప్రదాయక అర్థంలో మాత్రమే భూస్వామ్యం ఉనికిలోలేని దక్షిణార్ధగోళ వ్యవసాయక పాలిమేర దేశాలలో వ్యవసాయక ఉత్పత్తి సంబంధాలు కలగాపులగంగా ఉంటాయి.

1. ఒకే దగ్గర వేలాది ఎకరాలు సొంతం చేసుకుని బలవంతపు అదనపు విలువ సమీకరణ రూపంలోను, 2.ఇంకొక దగ్గర చిన్న చిన్న కమతాలలో జరిగే ఉత్పత్తి విధానం కొనసాగే వ్యవసాయ ఉత్పత్తి సంబంధాల రూపంలో తమ అదనపు విలువ విత్తనాలు, పురుగుమందులు, వ్యాపారుల జేబుల్లోకి తరలిపోతున్న రూపంలో భూస్వామ్యం ఉంది. 3. అదే సమయంలో వ్యవసాయ ఉత్పత్తి కారకాలు, వడ్డీవ్యాపారం, వ్యవసాయ ఉత్పత్తుల దళారీతనాలు, కలగల్సిన రూపంలో బ్యూరాక్రటిక్ పెట్టుబడిదారీ విధానంలో అంతర్భాగమైన రూపంలో భూస్వామ్యం ఉంది. అందువలన మనలాంటి దేశాలలో సామాజిక విప్లవ కేంద్రకర్తవ్యాన్ని వ్యక్తం చేసేందుకు ఒకే విధమైన నినాదం (ఉదా॥ దున్నేవానికి భూమి) ఉండదు. మిశ్రమ ఉత్పత్తి సంబంధాలను ప్రతిబింబించే విధంగా మిశ్రమ రూపంలో నినాదాల్ని రూపొందించాల్సి వుంటుంది.

చిన్న కమతాలు అభివృద్ధికరమైనవా, లేక పెద్ద కమతాలు అభివృద్ధికరమైనవా అని కాక చారిత్రక సందర్భం నేపథ్యంలో అంచనా వేయాలి. సొంత ఆస్తి పునాదిగా వుండే కేంద్రీకరణ లేక వికేంద్రీకరణ క్రమాలేవైనా అభివృద్ధి నిరోధకమైనవే.

''చిన్న రైతుస్వామ్యం సమాజానికి అవల సగం దూరంలో నిలబడిన బర్గరుల వర్గాన్ని, ఆదిమ సామాజిక రూపాల మొరటుతనాన్నంతటిని, నాగరిక దేశాల ఆవేదనతోనూ, దారిద్ర్యంతోనూ కలగలిపే వర్గాన్ని సృష్టిస్తుంది. కాగా పెద్ద భూస్వామ్యం శ్రమశక్తిని చివరి రంగంలో బలహీనపరుస్తుంది. ఈ రంగంలోనే శ్రమశక్తి ఆశ్రయాన్ని కోరుతుంది. జాతుల జీవశక్తి పునరుత్పత్తి కోసం రిజర్వునిధిగా తన బలాన్ని నేలలోనే నిల్వ ఉంచుతుంది. భారీస్థాయి పరిశ్రమ, భారీస్థాయి యాంత్రీకృత వ్యవసాయం కలిసే పనిచేస్తాయి. మొదటిది ప్రధానంగా శ్రమశక్తిని, మానవుల సహజ శక్తిని వృధా చేస్తుంది, విచ్ఛిన్నం చేస్తుంది. కాగా రెండోది మరింత సూటిగా నేలయొక్క సహజ సిద్ధమైన జీవశక్తిని అంతం చేస్తుంది. తర్వాత అభివృద్ధి క్రమంలో కూడా అవి రెండూ చేతులు కలుపుతాయి. గ్రామీణ ప్రాంతంలో కూడా పారిశ్రామిక వ్యవస్థ కార్మికుల్ని భౌతికంగా క్రుగందీస్తుంది. గ్రామీణ ప్రాంతంలో కూడా పారిశ్రామిక వ్యవస్థ కార్మికుల్ని భౌతికంగా క్రుంగదీస్తుంది. పరిశ్రమా వాణిజ్యము నేలసారాన్ని అంతం చేసే సాధనాలను వ్యవసాయానికి సరఫరా చేస్తాయి.''

*-కారల్‌మార్క్స్ 'పెట్టుబడి' గ్రంథం 3వ సంపుటి పేజి. నెం.324, విశాలాంధ్ర ప్రచురణలు.*

విచక్షణారహితంగా జరుగుతున్న ప్రకృతి, ఉత్పత్తుల ప్రైవేటీకరణ క్రమాన్ని వెనుకకు మళ్ళించకుండా మానవ సమాజ పురోగతి సాధ్యంకాదు. మానవాళి పురోగమించాలంటే ప్రకృతి, ఉత్పత్తుల సామాజికీకరణ తప్ప మరొక మార్గం లేదు. ఉత్పత్తి, ప్రకృతి సామాజికీకరణాలు పరస్పర పూరకాలుగా ఉంటాయి. అందుచేత భూసంస్కరణలు (కేంద్రీకరణరూపం, వికేంద్రీకరణ రూపం) సమష్టి ఉత్పత్తి సంబంధాలు రూపుదిద్దుకునేందుకు అవసరమయిన పూర్వావసరాలను అనుకూలింపజేసే విధంగా ఉండాలి. అంటే సామాజికీకృత మానవులు అంటే, సహచరులైన ఉత్పాదకులు ప్రకృతితో తమ పరస్పర ప్రవర్తనను ఇంగిత జ్ఞానంతో క్రమబద్ధం చేసుకుంటూ - ప్రాకృతిక అంధ శక్తులకు లోనై, ప్రకృతికి తలవొగ్గి నడుచుకోవడానికి మారు - దాన్ని తమ ఉమ్మడి ఆధిపత్యంలోకి తెచ్చుకోవడం, భూమి, ఉత్పత్తి సాధనాలను మానవుల ఉమ్మడి అంశాలుగా పరిగణించే సొంత ఆస్తిలేని సామాజిక వాతావరణంలో మనిషి-ప్రకృతి మధ్య యంత్రాల వ్యవస్థ స్థానంలో క్రమాల వ్యవస్థ ఉనికిలోకి వచ్చి; ఏదో ఒక శ్రమ విభజన ద్వారానే వ్యక్తం కాకుండా సామాజిక వ్యక్తులుగా అంటే సామూహిక ఉత్పత్తి దారులుగా ఆవిర్భవించిన సమాజంలో ప్రకృతి సమాజానికి మధ్యగల ఆదాన-ప్రదాన క్రమం సహజంగా, సజీవంగా వుండే విధంగా సర్వసాధారణ జనావాసాలు వెలుస్తాయి. (పట్టణాలు-పల్లెలు అనే తేడా లేని) మానవ కార్యకలాపంలో ప్రకృతికి - మనిషికి మధ్యగల అభిన్నత చైతన్యయుతంగా ప్రతిబింబిస్తుంది.

పైనేపథ్యం నుండి అసమ ఆర్థికాభివృద్ధితో కూడుకున్న మనదేశ ఆర్థిక వాస్తవికతలను దృష్టిలో వుంచుకుని స్థల, కాలాలను బట్టి కేంద్రీకరణ లేదా, వికేంద్రీకరణ రూపంలోని భూ సంస్కరణల నినాదాలను, పథకాలను, ప్రణాళికలను రూపొందించాలి, ఆచరించాలి.

''మొత్తం సమాజం ఒక జాతి లేదా భూగోళం పై ఉన్న సమాజాల మొత్తం - భూగోళానికి యజమానులు కాదు. వారు దానిని కేవలం కలిగి ఉన్నారు. దాని నుంచి లాభం పొందుతారు అంతే. వారు మంచి కుటుంబ యజమానుల లాగా దానిని మరింత మెరుగైన పరిస్థితులతో రాబోయే తరాలకి అందించాల్సి వుంది.''

*- కారల్‌మార్క్స్ 'పెట్టుబడి' గ్రంథం 3వ సంపుటి పేజి నెం.324, విశాలాంధ్ర ప్రచురణలు.*

❑

**ఆరోగ్యం అందరి ప్రాథమిక హక్కు. ఇది అందరం పొందగలగాలి. ఇది పొందడానికి మనం పోరాడాలి. సంరక్షణ, దయ-జాలి, ఒకరి పట్ల ఒకరికి గౌరవం, విద్య అనేశక్తివంతమైన ఆయుధాల సహాయంతో ఈ పోరాటంసాగాలి. 'అందరికీ ఆరోగ్యం' అభివృద్ధిలో ఒకభాగం. దీనిని పొందడానికి మనందరం చేయి చేయి కలిపి ముందుకుసాగుదాం!**

# అందరికీ ఆరోగ్యం ఎట్లా సాధ్యం?

- డా॥ పి. రాంమోహనరావు,
అధ్యక్షులు, ఐ.ఎం.ఎ., నిజామాబాద్

1977లో ప్రపంచ ఆరోగ్య సదస్సులో '2000 సంవత్సరంనాటికి అందరికీ ఆరోగ్యం' అన్ననినాదం ఆరంభమైంది. తరువాత 1978 లో ఆల్మాఆటా లో ప్రాథమిక ఆరోగ్యసదుపాయాలపై జరిగిన సభలో పైనినాదంపై సభ్యదేశాలన్నీ మనదేశంతో సహా సంతకాలు పెట్టాయి.

**ఆరోగ్యం అంటే**

- శారీరకంగా, మానసికంగా, సామాజికంగా ఆనందంగా వుండడం, కేవలం రోగం లేకపోవడంకాదు, బాగుండటం.
- ఇది అన్ని దేశాలు (బీద, ధనిక ) పట్టించుకోవలసిన అంశం.
- అర్థవంతమైన మంచి జీవన విధానం.
- ఆర్థిక, సామాజిక అభివృద్ధికి అందరికీ ఆరోగ్యం మూలాధారం అని ఆ తీర్మానం నిర్వచించింది.

**ఈ తీర్మానం ప్రకారం**

1. ప్రజల ఆరోగ్య బాధ్యత ప్రభుత్వాలదే.
2. ఆరోగ్య విధానాల తయారీలోనూ, అమలులోనూ ప్రజల భాగస్వామ్యం ఉండాలి.
3. శాస్త్ర బద్ధంగా అంగీకరించబడిన ఆరోగ్యజాగ్రత్తలు, వైద్య సదుపాయాలు, పేదదేశాలకు, నిరుపేద ప్రజలకు అందుబాటులో ఉండాలి.
4. ముఖ్యమైన ఆరోగ్య సమస్యలకు సంబంధించిన వైద్యం అది క్యూరెటివ్ (చికిత్స) గాని, ప్రివెంటివ్ (నిరోధకం) గాని, రిహ్యాబిలిటేటివ్ (పునఃపోషకం) గాని, ప్రాథమిక ఆరోగ్య రక్షణ వ్యవస్థలోనే చేర్చబడాలి.

**తీర్మానంలో ముఖ్యాంశాలు**

1. ఆరోగ్యసమస్యలపై ప్రజలకు అవగాహన కల్పించడం, వాటి పరిష్కారాలకు సూచనలు ఇవ్వడం.
2. అందరికీ రక్షిత మంచినీరు అందించటం, అలాగే పారిశుధ్య పరిస్థితిని మెరుగుపరచడం.
3. అందుతున్న ఆరోగ్య సదుపాయాలలో వున్న తేడాలను తగ్గించడం.
4. పౌష్టికాహార లోపాలను సవరించటం కొరకై స్పష్టమైన ప్రణాళిక.
5. తక్కువ ఖరీదుతో ఆరోగ్యసదుపాయాలను అందించే నిపుణత్వాన్ని పెంపొందించటానికై పరిశోధనచేయటం.

1946లో భోర్ కమిటీ, 1962లో మొదలియార్ కమిటీ, 1975లో శ్రీవాస్తవ్ కమిటీ ఇలా అనేక కమిటీలు మన దేశ ప్రజల ఆరోగ్యపరిస్థితులను అభివృద్ధి పరచడానికై ముఖ్యమైన సిఫారసులను ఎన్నింటినోచేశారు.

ముఖ్యంగా భోర్ కమిటీ సూచించిన

- 20 వేల జనాభాకు ఒక ఆరోగ్య కేంద్రం;
- ఆరోగ్యకేంద్రం, పడకల సౌకర్యం కలిగి వుండటం;
- ఆరోగ్యకేంద్రంలో డాక్టర్లూ, నర్సులూ, ఆయాలు ఇతర ఉద్యోగస్తులు వుండటం;
- ప్రెవెంటివ్, క్యూరేటివ్ సేవలు ఒకచోటనే కలిసి వుండటం;
- శిక్షణా కార్యక్రమాలను నిర్వహించి గ్రామస్థాయి దాయాలను, హెల్త్‌గైడ్‌లను, మల్టీపర్పస్ హెల్త్ వర్కర్లను తయారు చేసుకోవటం;

ఇలాంటి అంశాల ప్రాతిపదికగా, ఆల్మా ఆటా తీర్మానానికి అనుగుణంగా భారతప్రభుత్వం 1983లో జాతీయ ఆరోగ్య విధానం తయారు చేసుకున్నది.

## ఆరోగ్యంగా వుండాలంటే

ఆహారం, రక్షిత మంచినీరు, మంచి వ్యక్తిగత అలవాట్లు, నివసించే దగ్గర పరిశుభ్ర వాతావరణం, అందుబాటులో ఆరోగ్య సేవలు, పనిచేసేదగ్గర మంచి పరిస్థితులు, జీవనాధారమైన పని, ఆరోగ్యకరమైన వాతావరణం తప్పనిసరిగా ఉండాలి.

## అనారోగ్యానికి ముఖ్య కారణాలు

1. ఆహారలోపం
2. కలుషిత నీరు
3. దుర్భరమైన పని ప్రదేశాలు
4. విపరీతమైన ఆందోళన
5. మంచి ఆరోగ్యసేవలు అందుబాటులో లేకపోవటం
6. దుర్భరమైన నివాస ప్రాంతాలు
7. పురుషాధిక్యత

### జాతీయ ఆరోగ్య విధానం లక్ష్యాలు

1. ప్రతి ఐదు వేల గ్రామీణ జనాభాకి ఒక ఆరోగ్య సబ్ సెంటర్, ఇద్దరు ఆరోగ్య కార్యకర్తలు (ఒక పురుషుడు, ఒక స్త్రీ) గిరిజన ప్రాంతాలలో అయితే మూడువేల జనాభాకి ఒక సబ్ సెంటర్.
2. ప్రతి ముప్పైవేల గ్రామీణ జనాభాకి (గిరిజన ప్రాంతాలలో 20 వేలు మాత్రమే) ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రం.
3. ప్రతి 80 వేల నుండి 1,20,000 జనాభాకు ఒక కమ్యూనిటీ హెల్త్ సెంటర్.
4. ప్రతి గ్రామంలోను లేక ప్రతి 1000 మంది జనాభాకు ఒక గ్రామీణ హెల్త్గైడ్‌ను తయారు చెయ్యడం.
5. గ్రామాలలో తరతరాలుగా కాన్పులు చేస్తున్న స్త్రీలను గుర్తించి వారికి దాయా శిక్షణను ఇప్పించటం.
6. ఇతర ఉద్యోగస్తులను, మల్టీపర్పస్ కార్యకర్తలను తయారు చేసుకోవడం.

### ప్రాథమిక ఆరోగ్య సంరక్షణ వ్యవస్థ ముఖ్య ఉద్దేశ్యాలు

ఎ) సమానపంపిణీ: వ్యక్తుల ఆర్థికస్తోమతకి సంబంధం లేకుండా అందరికీ సమానంగా వైద్యసదుపాయాలు అందచేయాలి. (ముఖ్యంగా గ్రామీణ పేద జనానికీ, పట్టణ మురికి వాడలలో ఉన్న జనానికీ). 70% జనం గ్రామాలలో ఉన్నారు కానీ ఆరోగ్య బడ్జెట్‌లో 70% పట్టణాలలో ఖర్చవుతుంది. ఇది గమనించాలి.

బి) ప్రజల భాగస్వామ్యం: వ్యక్తుల, కుటుంబాల, కమ్యూనిటీల భాగస్వామ్యం ఆరోగ్య ప్రణాళికలను తయారుచేయడం లోను, అమలు పరచడంలోనూ ఉండాలి. స్థానిక మానవ వనరులనూ, ఇతర వనరులనూ ఉపయోగించుకోవాలి. ఇందులో భాగంగానే శిక్షణ పొందిన దాయాలు, హెల్త్గైడ్‌లు తయారవుతారు.

సి) మిగతా రంగాలతో సమన్వయం - ఆరోగ్యం అభివృద్ధి చెందాలంటే మిగతా అనేక రంగాలు దీనితో కలసి పని చేయాలి.

ఉదాహరణకు వ్యవసాయరంగం, పరిశ్రమలరంగం, జలవనరుల రంగం మొదలగునవి.

డి) తగిన సాంకేతిక నిపుణత్వం: అంటే శాస్త్రబద్ధమైన, స్థానిక అవసరాలకు మరల్చుకోగల, ఎవరికోసం అది వాడబడుతుందో వారికి ఆమోదయోగ్యమైనటువంటి, ప్రజలే నిర్వహించుకోగలిగిన సాంకేతిక నిపుణత్వాన్ని, తగిన (అప్రోప్రియేట్) నిపుణత్వం అనవచ్చు. మరొక రకంగా చెప్పాలంటే కేంద్రంలో రూపకల్పన చేసిన ఆరోగ్య సదుపాయాలను గ్రామాలలోనికి తీసుకొని వెళ్ళడం కంటే, గ్రామాల్లోనే ఆరోగ్య సదుపాయాల రూపకల్పన జరగాలి. దానర్థం ప్రజల ఆరోగ్యం ప్రజల చేతుల్లో ఉండాలనే.

మనకు స్వాతంత్ర్యం వచ్చాక వివిధ పద్ధతుల ద్వారా ప్రజలకు ఆరోగ్య సేవలు అదించడానికి ప్రయత్నాలు జరిగాయి.

1. సమగ్ర ఆరోగ్య రక్షణ వ్యవస్థ: దీనిలో వ్యాధి నిరోధకవైద్యం, వ్యాధి నయమగుటకు వైద్యం కలిసి ఒకటిగా ఉండాలి. వైద్య రంగం ప్రజలకు దగ్గరగా వుండాలి. సంబంధిత ప్రజలకు వైద్య రంగానికి, ఆరోగ్య సేవలకు మధ్య అవినాభావ సంబంధ సహకారాలు వుండాలి. బలహీన వర్గాల పట్ల, వైద్య సదుపాయాలు అందుకోలేని వర్గాలపట్ల, ఎక్కువగా వైద్య సదుపాయాలు అవసరమైన వర్గాల (మహిళలు, పిల్లలు) పట్ల, మరింత జాగ్రత్త వహించాలి.
2. బేసిక్ హెల్త్ సర్వీసెస్: ఆరోగ్యంగా ఉండటానికి అవసరమైన ఇతరరంగాలకు, ఆరోగ్యరంగానికి మధ్య సమన్వయ పూర్వకమైన కార్యక్రమం ఉండాలి.
3. ప్రాథమిక ఆరోగ్య రక్షణ: 1978లో ఆల్మా ఆటా తీర్మానం తరువాత ప్రాథమిక ఆరోగ్య రక్షణ విధానం అమలులోకి వచ్చింది. ఇందులో ఆరోగ్య రక్షణ వ్యక్తులకు అందుబాటులోను, వాళ్ళకు అంగీకార యోగ్యంగాను, వారి భాగస్వామ్యంతోను వుంటుంది. అంతే గాక వీటికయ్యే ఖర్చు ఆ దేశం లేక ఆ సమాజం భరించుకోగలిగేటట్లుగా వుండాలి.

*ముఖ్య శీర్షికలు:*

1. ఆరోగ్య విద్య - ప్రాంతీయ ఆరోగ్య సమస్యలపై అవగాహనతో పాటు వాటిని పరిష్కరించుకొనేందుకు, అలాంటివి రాకుండా చేసుకునేందుకు సూచనలు వుంటాయి.

2. ఆహారం అందునా అవసరమైన పౌష్టిక ఆహార సరఫరాని పెంచుకోవటం.
3. రక్షిత మంచినీటి సరఫరా, పరిసరాల పారిశుధ్యం.
4. తల్లి, పిల్లల ఆరోగ్య సంరక్షణ, కుటుంబ సంక్షేమం.
5. అంటు వ్యాధులు రాకుండా వ్యాధి నిరోధక టీకాలు.
6. ప్రాంతీయంగా ప్రతి యేడాదీ వచ్చే జబ్బుల నివారణ, నియంత్రణ.
7. సామాన్య జబ్బులకు, చిన్న చిన్న గాయాలకు తగిన వైద్యం.
8. అవసరమైన మందులను అందుబాటులో ఉంచడం.

**రిఫరల్ సిస్టమ్**

ప్రైమరీ లెవల్ హాస్పిటల్: ప్రాథమిక ఆరోగ్య సంరక్షణ మన దేశంలో హెల్త్ సబ్‌సెంటర్స్ ద్వారాను, ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ద్వారాను, మల్టీపర్పస్ ఆరోగ్యకార్యకర్తల ద్వారాను, గ్రామీణ హెల్త్‌గైడ్స్, శిక్షణ పొందిన దాయాల ద్వారాను అందించబడుతుంది.

సెకండరీ లెవల్: దీనిలో వైద్యానికి సంబంధించిన జటిలమైన సమస్యలకు వైద్యం, కొన్నిశస్త్ర చికిత్సలు అందజేయబడతాయి. ఈ సదుపాయం కమ్యూనిటీ హెల్త్‌సెంటర్ ద్వారాను, తాలుకా ఆసుపత్రి ద్వారాను అందజేయబడుతుంది. దీనినే ఫస్ట్‌లెవల్ రెఫెరెల్ సెంటర్ అంటారు.

**ఆరోగ్య సేవలను గ్రామీణ జనాభాకి అందించడంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం నిన్న మొన్నటి వరకు ప్రధాన పాత్ర నిర్వహించింది. వీటిని ప్రైవేటుపరం చేయడం ఏమి న్యాయం?**

టెర్షరీ లెవల్ హాస్పిటల్స్: ప్రత్యేక వైద్య వసతులు, ఎక్కువగా నిపుణత్వం పొందిన డాక్టర్ల, నర్సులద్వారాను అందజేయబడుతాయి. ఇలాంటి వసతులు ప్రత్యేక హాస్పిటల్స్‌లోను, మెడికల్ కాలేజి హాస్పిటల్‌లోను, రీజనల్ హాస్పటల్‌లోను అందుతాయి. ఈ రకంగా ప్రాథమిక స్థాయినుండి తృతీయ స్థాయివరకు వైద్య వసతులు ప్రభుత్వ పరంగా అందజేయబడుతూ వచ్చాయి.

**ప్రైమరీ హెల్త్‌కేర్ వ్యవస్థ**

1. గ్రామస్థాయి:

ఎ) గ్రామీణ హెల్త్‌గైడ్‌లను తయారుచేసుకోవాలి. వీరు మామూలుగా మహిళ అయి ఉంటే బాగుంటుంది. ఆ గ్రామంలో వుంటూ, కొద్దిగా చదవటం, రాయటం వచ్చినవారై వుండి గ్రామంలో ఎక్కువమందికి అంగీకారంగా వుండి రోజుకు 2,3 గంటలు ఆరోగ్య కార్యక్రమాలకు వెచ్చించగలిగే వారై వుండాలి. వీరు శిక్షణ పొందిన తరువాత కొద్దిపాటి సామాన్య వ్యాధులకు వైద్యం చేయటం, అవసరమైనచోట్ల ప్రథమచికిత్స చేయటం, మాతా శిశుసంరక్షణ కార్యక్రమాలు, కుటుంబ సంక్షేమ కార్యక్రమాలు, ఆరోగ్యవిద్య, పరిశుభ్రత లాంటి విషయాలపై పనిచేస్తారు.

బి) **స్థానిక దాయా:** గ్రామీణ ప్రాంతాలలో తరతరాలుగా శిక్షణ లేనప్పటికి కాన్పులు నిర్వహిస్తూ వున్నటువంటి స్త్రీలను గుర్తించి వారికి దాయా శిక్షణను ఇచ్చి, శిక్షణ అనంతరం ప్రసూతికి కావలసిన సామాగ్రిని అందచేసి గ్రామాలలో కాన్పులు నిర్వహించటానికై వినియోగించబడతారు.

సి) **అంగన్ వాడి వర్కర్:** ఐ.సి.డి.యస్. పథకం క్రింద ప్రతి 1000 మంది జనాభాకు ఒక అంగన్‌వాడి వర్కర్ నియమించబడుతారు. ఒక ఐ.సి.డి.యస్. ప్రాజెక్ట్‌లో 100 మంది అంగన్‌వాడి వర్కర్లు వుంటారు. అలాంటి వారు మామూలుగా ఏ ప్రాంతంవారిని ఆప్రాంతంలోనే ఎంపిక చేసుకుంటారు. వారికి ఆరోగ్యం, ఆహారం, పిల్లల పోషణ లాంటి అంశాలమీద శిక్షణ వుంటుంది. వీరు ఆరు సంవత్సరాలలోపు పిల్లలకు, బాలింతలకు ఎక్కువగా తమ సేవలను అందించుతారు.

2. **ఆరోగ్య ఉపకేంద్రం:** ప్రతి ఐదు వేల జనాభాకు ఒక ఆరోగ్య ఉపకేంద్రం వుంటుంది. ఈ కేంద్రాలలో ఇద్దరు (ఒక పురుషుడు, ఒక స్త్రీ) మల్టీపర్పస్ ఆరోగ్య కార్యకర్తలుంటారు. వీరు ఎక్కువభాగం తల్లి పిల్లల సంరక్షణ, కుటుంబ నియంత్రణ, వ్యాధి నిరోధక టీకాలు లాంటి కార్యక్రమాలు చేస్తుంటారు. సాదారణంగా చేసే మూత్ర పరీక్షలు, గర్భిణీ స్త్రీలకు టీకాలు ఇవ్వడం లాంటి బాధ్యతలు కూడా వీరివే. వీరి పని విధానాన్ని హెల్త్ అసిస్టెంట్‌లు పర్యవేక్షిస్తారు.

3. **ప్రాథమిక ఆరోగ్యకేంద్రం:** ప్రతి 30000 గ్రామీణ జనాభాకి ఒక ప్రాథమిక ఆరోగ్యకేంద్రం వుంటుంది. 1998 నాటికి 22,991 ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు ప్రారంభించబడినాయి.

**ప్రాథమిక ఆరోగ్య కేంద్రం పనులు**

- సామాన్య జబ్బులకు వైద్యం
- మాతాశిశు ఆరోగ్య సంరక్షణ, కుటుంబనియంత్రణ
- రక్షిత మంచినీటి సరఫరా, ప్రాథమిక పారిశుధ్యం
- ప్రతి యేడాది సీజనల్‌గా వచ్చే జబ్బులనుండి కాపాడటం
- ఆరోగ్య విద్య
- ఆరోగ్య కార్యకర్తలకు, దాయాలకు శిక్షణ ఇచ్చుట.
- అవసరమైన రక్త, మల, మూత్ర పరీక్షలు చేయటం
- అవసరమైన కేసులను సెకండరీ లెవల్, టెర్షరీ లెవల్ వైద్య శాలలకు రెఫర్ చేయటం

ఈ ఆరోగ్య కేంద్రాలలో వ్యాసెక్టమీ, ట్యూబెక్టమీ, డి అండ్ సి లాంటి చిన్న చిన్న శస్త్ర చికిత్సలు చేయబడతాయి.

ప్రతి మెడికల్ కాలేజికి మూడు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు జతపరచబడతాయి.

ఈ రకంగా ఆరోగ్య సేవలను గ్రామీణ జనాభాకి అందించడంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం నిన్న మొన్నటి వరకు ప్రధాన పాత్ర నిర్వహించింది. వీటిని ప్రైవేటుపరం చేయడం ఏమి న్యాయం?

4. కమ్యూనిటీ హెల్త్ సెంటర్: 80 వేల నుండి 1,20,000 గ్రామీణ జనాభాకు ఒక కమ్యూనిటీ హెల్త్ సెంటర్ ఏర్పడుతుంది. ఈ సెంటర్‌లో 30 పడకల సౌకర్యం వుంటుంది. ఇక్కడ స్పెషలిస్టు డాక్టర్లు వుండవచ్చు.

**గ్రామస్థాయిలో ఆశించదగిన ఆరోగ్యసేవలు:**

1. మంచు గడ్డలున్న పెట్టెలో, టీకా మందులు తెచ్చి నెలనెలా వేయాలి.
2. వారానికి లేక రెండువారాలకి (ఎ.ఎన్.ఎమ్) నర్సు ఇళ్ళకు వచ్చి చూడాలి.
3. మగ ఆరోగ్య కార్యకర్త వారానికొకసారి గ్రామానికి వచ్చి చూసిపోవాలి.
4 అలా వచ్చినప్పుడు, తల్లులతో, గర్భిణీ స్త్రీలతో, బాలింతలతో సమావేశాలు జరిపి, ఆరోగ్య సలహాలు ఇస్తూవుండాలి.
5. గ్రామాలలో వున్న మంచినీటి బావులను, సరియైన పద్ధతిలో ఆరోగ్య కార్యకర్త బ్లీచింగ్ పౌడరుతో క్లోరినేషన్ చేయాలి. వానా కాలంలో ఇది మరింత జాగ్రత్తగా జరగాలి.
6. అలాగే మంచినీటి బావులలోని నీటిని తీసుకొని వెళ్ళి (సాంపుల్) క్లోరినేషన్ సరిగ్గా జరిగిందో లేదో చూడాల్సిన బాధ్యత ఆరోగ్య కార్యకర్తపైనున్నది.
7. గ్రామాలలో కాన్పులు నిర్వహించేందుకై శిక్షణ పొందిన ఆయాలుండాలి. లేనియెడల కొంత మందికి శిక్షణ ఇప్పించాలి.
8. ప్రతి గ్రామంలోను అంగన్ వాడి వుండాలి. ఇందులో ఆరు సంవత్సరాల లోపు పిల్లలకు సమతుల్యమైన ఆహారం ఇవ్వాలి. ఆహారలోపం ఉన్న పిల్లలయెడ మరింత జాగ్రత్త తీసుకోవాలి. మంచి పౌష్టికాహారం ఇవ్వాలి.
9. పిల్లల బరువు చూడటం, ఆరోగ్య పరీక్షలు, టీకాలు వేయడం, సామాన్య రోగులకు వైద్యం, ఈ అంగన్ వాడిలోనే జరపవచ్చు.
10. పి.హెచ్.సి. నుండి డాక్టరు నెలకొకసారి గ్రామానికి రావాలి. మూడునెలలకొకసారి అంగన్‌వాడి సెంటర్‌ని డాక్టరు విజిట్‌చేసి పిల్లలను పరీక్షించాలి.

## మన దేశంలో...

- మొత్తం ఆహార ధాన్యాల ఉత్పత్తి-సుమారు 20 కోట్ల టన్నులు అంటే సగటున ఒక మనిషికి రోజుకు 1500 కాలరీలు మాత్రమే.
- 1983లో సగటున 400 గ్రాముల ధాన్యం, 69 గ్రాముల పప్పులు వాడకం అయితే 1993లో 392 గ్రాముల ధాన్యం 38 గ్రాముల పప్పులు మాత్రమే.
- దాదాపు మూడోవంతు జనాభా దారిద్ర్యరేఖకు దిగువన జీవిస్తున్నారు. అంటే సుమారు 33 కోట్ల మంది జనం వస్తులుంటున్నారు. ఆహారలోపం వలన వ్యాధిగ్రస్తులవటానికి ఎక్కువ అవకాశం కలుగుతుంది. తద్వారా మరణాలు పెరుగుతాయి.
- 20 లక్షలకు పైగా చావులు పౌష్టికాహారలోపానికి సంబంధిత వ్యాధులవలన అని ఒక అంచనా.
- సుమారు 2 కోట్ల మందికి తాగునీరు అందుబాటులోలేదు.
- సుమారు 60 కోట్లమందికి మరుగు దొడ్ల సదుపాయంలేదు.
- ఐదేండ్ల లోపు పిల్లలు 7 కోట్లమందికి పైగా పౌష్టికాహారం లేదు.
- 75% మందికి ఏలిక పాముల రుగ్మత వుంది.
- దాదాపు 5 లక్షల టైఫాయిడ్ కేసులు నమోదయాయి.

11. నర్సు (ఎ.ఎన్. ఎమ్.) గర్భిణి స్త్రీలను గుర్తించి, కాన్పు అయ్యేలోపల కనీసం ఐదు సార్లు వాళ్ళని పరీక్షచేయవలసి ఉంటుంది. టి.టి, టీకాలు, ఐరన్ బిళ్ళలు ఇవ్వాలి.
12. ప్రసవించిన తరువాత బాలింతలను కనీసం మూడుసార్లు ఆరోగ్య పరీక్షలు చేసి ఏమైనా ఆరోగ్య సమస్యలుంటే వైద్యం చేయాలి.
13. గ్రామంలోనున్న పాఠశాల విద్యార్థులకు ఏడాదికొకసారి ఆరోగ్య పరీక్షలు నిర్వహించాలి.
14. రక్త హీనత, జ్వరాలు, విరోచనాలు లాంటి సామాన్య వ్యాధులకు, నర్సు గాని ఆరోగ్య కార్యకర్తగాని వైద్యం చేయాలి.
15. పురుగుమందులు స్ప్రే చేయడం, దోమలనివారణ కొరకుమందులు స్ప్రేచేయటం, మలేరియాకు రక్త పరీక్షచేయటం లాంటి పనులన్ని మేల్‌హెల్త్ వర్కర్ చేయవలసి వుంటుంది.
16. ఏదైనా ఒక జబ్బు విపరీతంగా వ్యాపించినట్లైతే వెంటనే అధికారుల దృష్టికి తీసుకురావటం, అది వ్యాపించ కుండా తీసుకోవలసిన జాగ్రత్తలు ప్రచారం చేయటంకూడా వీరి పనే.

ప్రపంచం ఆరోగ్య సంస్థ ప్రకారం ఈ రోజు వాడబడుతున్న మందులలో దాదాపు 90% అనవసరమైనవి. కొన్ని ప్రమాదకరమైనవి కూడా.

☞ అయితే డాక్టర్లు ఎందుకు రాస్తున్నారు?

☞ కంపెనీలు ఎందుకు తయారు చేస్తున్నాయి??

☞ ప్రభుత్వం చూస్తూ ఎందుకు ఊరుకుంటోంది???

ఈ పనులన్నీ కూడా ఫీజు తీసుకోకుండా చేయాలి. అదే సమయంలో గ్రామస్తులుకూడ, పనులన్నీ సక్రమంగా జరిపేందుకు సహకరించాలి. ఈ క్రమంలో గ్రామస్తులు ఆరోగ్యకమిటీలు ఏర్పరచుకొని, ఆరోగ్య సదుపాయాలు అందరికి అందుబాటులో వుండేటట్లు చూడవచ్చు. అలా జరగనట్లైతే, ఆరోగ్యశాఖ అధికారుల దృష్టికి తీసుకొని వెళ్ళవచ్చు. వైద్యసేవలు అందించవలసిన వారు, సరిగా హాజరు కాకపోయినా, వారుఇచ్చే సేవలలో నాణ్యత లోపించినా, ఫిర్యాదు చేయాలి. డాక్టరు లేకపోవటం, స్టాఫ్ లేకపోవటం, వున్నా రోగులపట్ల వారి ధోరణి, ఫీజు వసూలు చేయుటం లాంటి వెన్నో నిరోధించవచ్చు. అలాగే కావలసిన మందులు దొరకక పోవటం. ఎప్పుడైనా ఎక్కువమంది వత్తిడి తీసుకువచ్చినట్లైతే సామాజిక న్యాయం జరిగే అవకాశం వుంది.

అలాగే ప్రతి గ్రామంలోను హెల్త్ క్యాలెండరును తయారు చేసుకుని దానిని కమిటీ మెంబర్ల ఇంటి దగ్గర, అందరికి కనిపించేటట్లుగా ప్రదర్శించితే బాగుంటుంది. తద్వారా ఏయే పనులు, ఏసమయంలో జరగాలి, ఎవరు ఏరోజు ఆ గ్రామానికి రావాలి, ఇలా అనేక విషయాలు గుర్తుచేస్తుంది ఆ క్యాలెండరు. అలా జరగనపుడు ప్రశ్నించటానికి వీలుంటుంది. ఆయా తేదీలలో వారు వచ్చినపుడు క్యాలెండరు మీద సంతకం చేసి వెళతారు.

ఈ రకంగా జనమే వారి ఆరోగ్యకార్యక్రమాలను పర్యవేక్షించగలుగుతారు. వీటిలో చాల వరకు ఇంకా జరగాల్సే వుంది కాబట్టి ఆశించదగిన ఆరోగ్య సేవలు అన్నారు. ❑

## ఆంధ్రప్రదేశ్ ఆరోగ్య రంగం: కొన్ని గణాంకాలు

### వైద్య సౌకర్యాలు

| సంవత్సరం | | సంఖ్య |
|---|---|---|
| 1956 | డిస్పెన్సరీలు/ఆసుపత్రులు | 396 |
| | డాక్టర్లు | 1094 |
| | పడకలు | 13995 |
| 2003 | జనరల్ ఆసుపత్రులు | 379 |
| | ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు | 1386 |
| | పడకలు | 34,948 |
| | డిస్పెన్సరీలు | 263 |
| | డాక్టర్లు | 7978 |

### అరకొర వైద్యం

1999-2004సం॥ల మధ్య 188 కొత్త ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు మంజూరు జేసిన ప్రభుత్వం కేవలం 86 కేంద్రాలనే నెలకొల్పింది. రాష్ట్ర వ్యాప్తంగా ఉండాల్సిన ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకన్నా, 26 శాతం తక్కువ ఉన్నాయని 2004 కాగ్ నివేదిక రాష్ట్ర ప్రభుత్వానికి మొట్టికాయ వేసింది.

### ఎయిడ్స్‌లో మనమే ఫస్ట్

అయితే ఇదేమీ ప్రగతి సూచకం కాకపోవడమే విషాదం. రాష్ట్రంలోని 2.02 శాతం గర్భిణీ స్త్రీలకు హెచ్.ఐ.వి. సోకింది. ఇది దేశంలో అన్ని రాష్ట్రాలకన్నా ఎక్కువ. ఎయిడ్స్ వ్యాప్తి ఎక్కువగా ఉన్న 6 రాష్ట్రాలలో మన పేరూ ఉంది.

### ఆసుపత్రిలో చేరిన కారణాలు - 1998

| | అంటు వ్యాధులు | ఇతర వ్యాధులు | ప్రమాదాలు (శాతం) |
|---|---|---|---|
| ఉత్తర తెలంగాణ | 70 | 18 | 13 |
| దక్షిణ తెలంగాణ | 62 | 22 | 17 |
| హైదరాబాద్/ రంగారెడ్డి | 55 | 36 | 8 |
| రాయలసీమ | 63 | 24 | 13 |
| ఉత్తర కోస్తా | 60 | 22 | 18 |
| దక్షిణాంధ్ర | 59 | 28 | 12 |
| ఆంధ్రప్రదేశ్ | 62 | 24 | 14 |

### మన్యంలో దైన్యం

రాష్ట్రంలోని గిరిజన ప్రాంతాలలో ఆరోగ్య సేవలు అందక గిరిజనులు దయనీయమైన పరిస్థితిలో ఉన్నారు. ప్రతి ఏడూ వ్యాధుల బారిన పడి వందల సంఖ్యలో ప్రాణాలు కోల్పోతున్నారు. రాష్ట్రంలోని మిగతా ప్రాంతాలలో ప్రతి 10,907 మందికి ఒక డాక్టరు ఉంటే గిరిజనులు అధికంగా ఉండే ఆదిలాబాద్‌లో ప్రతి 42,511 మందికి, తూర్పు గోదావరిలో ప్రతి 34,087 మందికి, ఖమ్మంలో ప్రతి 22,480 మందికి, విశాఖ పట్టణంలో ప్రతి 41,844 మందికి ఒక డాక్టరు ఉండడం పరిస్థితికి అద్దం పడుతుంది. ఈ ఏడు కూడా మలేరియా మన్యం ప్రజల ఉసురు తీస్తోంది.

# ఆరోగ్యంపై ప్రపంచీకరణ ప్రభావం - పరిష్కారాలు

- డా॥ పి.వి.ఆర్.భాస్కరరావు

## ప్రపంచీకరణ అంటే ఏమిటి?

**నిజంగానే ప్రపంచీకరణ అంటే మానవాళికి చూపించే ప్రేమ, ఆదరణలయితే అటువంటి పురాతన తాత్విక నేపథ్యం ఈ నేలకు ఎప్పుడూ ఉంది. వేలాది ఏళ్ళుగా వసుదైక కుటుంబ భావన, సర్వేజనా సుఖినో భవంతు, లోకా సమస్తా సుఖినోభవంతనే భావనలు ధార్మిక భావనలుగా ప్రపంచంలో ఉన్నాయి. వీటినుంచే విశ్వప్రేమ, సోదరభావం, ఈర్ష్య, అసూయ, ద్వేష భావాలు లేకపోవడం, శత్రుభావన లేకపోవడం పరివ్యాప్తమయ్యాయి. అటువంటి విశ్వమానవ ధర్మాన్ని ఆచరించడానికి, నిర్ణయాలు చేయడానికి ఎవ్వరూ అడ్డు చెప్పేవారు లేరు. ప్రపంచీకరణ అర్థం ఇదే అయితే నేను ఇష్టపడేవాణ్ణి. కాని నేటి ప్రపంచీకరణ అర్థం ప్రపంచం మొత్తాన్ని ఒక పెద్ద మార్కెట్‌ను చేయడం. జీవితపు అన్ని పార్శ్వాలనూ, అవసరాలకు అమ్మే సరుకుగా మార్చేయడం. కొన్ని ధనికదేశాలే ప్రపంచ విధానాలను నిర్ణయిస్తాయి. ఆర్థిక సమైక్యత పేరుతో పేదదేశాల సార్వభౌమత్వాన్ని దెబ్బతీసే చర్య ఈ ప్రపంచీకరణ. వారి ఉద్దేశ్యాలను ప్రపంచబ్యాంకు, ఐ.ఎమ్.ఎఫ్.ల ద్వారా 1980ల నుంచి స్థూల ఆర్థిక సుస్థిరత, సంస్థాగత సర్దుబాట్ల కార్యక్రమం, అభివృద్ధి పేరుతో ఇచ్చే అప్పులకు షరతులు విధించి అమలు చేస్తున్నారు. ప్రపంచ బ్యాంకు, ఐ.ఎమ్.ఎఫ్.లు చూపిస్తున్న ఇటువంటి "ప్రేమ" లక్షలాదిగా జనాన్ని దుర్భర దారిద్ర్యంలోకి నెట్టివేస్తోంది. బహుళ జాతి సంస్థల ప్రయోజనాలను తీర్చడానికి పేదదేశాలను తమ నయావలసలుగా మార్చడంలో ప్రపంచబ్యాంకు, ఐ.ఎమ్.ఎఫ్., డబ్ల్యు.టి.ఒ.లు ప్రపంచ ఆర్థిక వ్యవస్థలను నియంత్రిస్తున్నాయి. ఇది ప్రపంచీకరణ అర్థం. ఈ ప్రపంచీకరణ ప్రజలకు శత్రువు.**

## ఆరోగ్యంపై ప్రభావం

ఆరోగ్యం అనగానే మందులు, డాక్టర్లు, శస్త్ర చికిత్సలు, ఆస్పత్రులు అనే తప్పుడు అర్థం ఉంది. ఆరోగ్యం అనేది సామాజిక న్యాయ సూచిక. ఆరోగ్యం గురించి ఎంత చెప్పుకున్నా ఎన్ని పాలసీలు చేసినా ఆరోగ్యం కలగజేసే ప్రభావాలు మాట్లాడకపోతే డొల్లనే. ప్రపంచ ఆరోగ్య సంస్థ, అల్మా అటాలు ఆరోగ్య మంటే "శారీరకంగా మానసికంగా, సామాజికంగా బాగా ఉండడం. ఏదో జబ్బు, శారీరక మానసిక బలహీనతో ఉండడమో లేకపోవడమో కాదు" అని బలంగా తీర్మానించాయి. ప్రజల కనీస అవసరాలైనటువంటి కూడు, గూడు, గుడ్డ, మంచినీరు, పారిశుద్ధ్యం మొ॥ తీర్చకుండా ఏ ప్రభుత్వమైనా ఆరోగ్యం గురించి మాట్లాడితే ఆత్మవంచనే అవుతుంది. ఆరోగ్యానికి, దారిద్ర్యానికి ఉండే సంబంధాన్ని ఐక్యరాజ్య సమితి తన అధ్యయనం (ఏప్రిల్, 2001)లో "పేదరికం మూలంగానే పసిపిల్లలకు రోగనిరోధక వేక్సిన్‌లను చేయించుకోరు. మంచినీళ్ళు, పారిశుద్ధ్యం అందదు. ఔషధ చికిత్సలు అందవు. కొన్ని సందర్భాలలో తల్లులు ప్రసవ సమయంలోనే మృతి చెందుతున్నారు" అంది. ప్రపంచ బ్యాంకు ఆర్థిక విధానాలతో ఆత్మహత్యలు, ఆకలి చావులు, కిడ్నీలమ్ముకోవడం జరుగుతోంది. ఈ సంస్కరణలతో ప్రపంచ బ్యాంకు "పేదరిక నిర్మూలనకాదు, పేదల నిర్మూలనే ధ్యేయం"గా పెట్టుకుందని అర్థం చేసుకోవాలి.

## ప్రైవేటీకరణ - సరళీకరణ

కొద్దిమంది ప్రయోజనాలు ఈడేర్చడానికి, డబ్బు, మరింత డబ్బు చేసుకోవడానికి అన్ని జీవనరంగ పార్శ్వాలను సరుకు చేసి అమ్ముకోవడానికి ప్రభుత్వాలన్నీ ఈ ప్రైవేటీకరణ, సరళీకరణలను జపిస్తున్నాయి. వ్యవస్థాగత సర్దుబాట్లలో భాగంగా ఆరోగ్యంతో సహా అన్ని రంగాలనూ ప్రైవేటీకరిస్తున్నారు. ప్రపంచ వ్యాప్తంగా అటువంటి విధానాలను వేగంగా అమలు పరుస్తున్న ప్రాంతాల్లో మన ఆంధ్రప్రదేశ్ కూడా ఉంది. జి.ఒ.283 25.07.1997 ప్రకారం జిల్లాకు రెండు లేక మూడు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను స్వచ్ఛంద సంస్థల నిర్వహణకు అప్పగిస్తారు. మా సంస్థ పీమ్ ద్వారా మేము ఆ జి.ఒ.ను ప్రశ్నించాం. 7.7.1998 కోర్టు స్టే ఇచ్చింది. మేము ఆ పాలసీని అమలు చేయమని అప్పటి ప్రభుత్వం కోర్టులో ప్రకటించాక మేము పిటిషన్‌ను 21.7. 1999న ఉపసంహరించుకున్నాం. అయితే మరొక జి.ఒ. 162, 6.5. 2001తో అదే పాలసీని పునరుద్ధరించింది. మళ్ళీ మేము పోరాడ్డానికి సిద్ధమవుతున్నాం. ప్రపంచ బ్యాంకుకు ఈ ప్రాజెక్టుపై ఆసక్తి ఉంది. ఫస్ట్ రిఫరల్ హెల్త్ సర్వీసు ప్రాజెక్టుకై రు.600 కోట్లు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల వసతుల మెరుగుదలకై రు.322 కోట్ల అప్పును ప్రపంచ బ్యాంకు ఇచ్చింది. అయితే ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ప్రపంచ బ్యాంకు షరతుల మేరకు, అంతర్జాతీయ ప్రమాణాల స్థాయి వేలంతో భవనాలను నిర్మించింది. సిబ్బంది లేకుండా పరికరాలు కొనుగోలు చేసింది. వీటితో ప్రజల ఆరోగ్యం మెరుగుపడలేదు కానీ, భవనాలు నిర్మించి సొమ్ము చేసుకున్న కాంట్రాక్టర్లు, పరికరాల ఉత్పత్తిదారులు మాత్రం బాగుపడ్డారు.

సంక్షిప్తంగా ఇది మార్కెట్ సంస్కృతి. ఇప్పుడు నీటిని కూడా ప్రైవేటు యాజమాన్యంలోకి తెచ్చే ఎజెండాతో ప్రపంచ బ్యాంకు ముందుకొస్తోంది. చెరువులు, సరస్సుల ప్రైవేటీకరణ లక్ష్యంగా

సాగుతోంది. అలాగనక జరిగితే పేదలకు తాగడానికి నీళ్ళు కూడా దొరకని స్థితి. అది మరిన్ని ఆరోగ్య సమస్యలకు దారితీస్తుంది. నీళ్ళు కొనుక్కోలేని పరిస్థితుల్లో మురుగు నీరు కూడా తాగాల్సి వస్తుంది. అప్పుడు తీవ్రమైన అనారోగ్యం ఏర్పడుతుంది. కొన్ని సందర్భాల్లో చనిపోవచ్చు కూడా.

### సాంకేతిక విజ్ఞాన ఆధారంగా వైద్యం

ప్రపంచీకరణలో భాగంగా సాంకేతికవిజ్ఞానాధారిత వైద్యాన్ని ప్రభుత్వం ప్రోత్సహించింది. సాంకేతిక విజ్ఞానం ఎక్కువగా అవసరమయ్యే, ఎక్కువ ఖర్చుతో కూడిన రోగాలనే పట్టించుకుంది. అటువంటి రెండు ముఖ్యమైనవి ఒకటి హృద్రోగ సంబంధమైనవి, రెండు కిడ్నీ సంబంధమైనవి. వీటికొరకు ఎన్నో ఆస్పత్రులు పుట్ట గొడుగుల్లా పుట్టుకొచ్చాయి.

ఒక్క హైదరాబాద్‌లోనే ఇటువంటి ఆస్పత్రులు 13 ఉన్నాయి. ఇందులో ఐదు కేవలం హృద్రోగాల కొరకు మాత్రమే. వీటిల్లో ఏడు ఆసుపత్రులు కిడ్నీ వ్యాధులను కూడా చూస్తాయి. సాంకేతిక అభివృద్ధి మరింత ఖర్చుకు దారి తీస్తోంది. మార్కెట్ సంస్కృతిలో భాగంగా ఒక మోడల్ పోయి ఇంకో మోడల్ వచ్చినట్లు సాంకేతిక అభివృద్ధి సాధించేకొద్దీ, మార్పులు పొందే కొద్దీ ఈ ఖర్చు మరింత పెరుగుతోంది.

### రోగ నిరోధక వైద్య సేవల నిర్లక్ష్యం

మార్కెట్‌లాభాలే ఉద్దేశ్యంగా ఉండే ఆర్థిక వ్యవస్థలో ఉద్దేశ్య పూర్వకంగానే రోగనిరోధక వైద్య సేవలను తుంగలోకి తొక్కడం జరుగుతోంది.

అయినప్పటికీ రోగనిరోధక వైద్య సేవల ముసుగులో జరుగుతున్న దోపిడీకి కొన్ని ఉదాహరణలను మనమిక్కడ చూడవచ్చు.

1) సాధారణ ఉప్పు వాడకాన్ని నిషేధిస్తూ అయోడైజ్‌డ్ ఉప్పునే వాడాలని ప్రభుత్వం గతంలో ఉత్తర్వులు జారీ చేసింది. అయోడిన్ లోపంతో వచ్చే వ్యాధిని దృష్టిలో ఉంచుకుని ఈ నిర్ణయం చేసింది. అయితే ఆ లోపంతో బాధపడేవారి సంఖ్య చాలా తక్కువ. అయినప్పటికీ నిర్బంధంగా ప్రజలచేత అయోడైజ్‌డ్ ఉప్పును మార్కెట్ ప్రయోజనాల కోసం అనుమతించింది. ప్రపంచ ఆరోగ్య సంస్థ, యూనిసెఫ్‌లు సిఫారసు చేస్తున్నాయి. మా సంస్థ పీమ్ ఈ విషయాలను వెలుగులోకి తెచ్చింది. కేవలం 50% ప్రజలే నిర్బంధంగా ఈ అయోడైజ్‌డ్ ఉప్పును తింటారనుకున్నా ఏటా రు.1277.5 కోట్ల వాణిజ్యం జరుగుతోంది. మా సంస్థ పీమ్ సాధారణ ఉప్పు వాడకం నిషేధించడాన్ని కోర్టులో సవాలు చేసి స్టే తీసుకు వచ్చింది.

2) వ్యాక్సిన్‌లు - వ్యాధి నిరోధక ముసుగులోనే అనేక వ్యాక్సిన్‌లు కూడా మార్కెట్‌ను ముంచెత్తుతున్నాయి. ఆకోవలోకే హెపటైటిస్ -బి వ్యాధి కూడా వస్తుంది. ఈ వ్యాధి సోకిన వంద మందిలో తొంభై అయిదు మంది సాధారణంగా కోలుకుంటారు. అయితే వ్యాక్సిన్ అమ్ముకోవడానికి అది ప్రాణాంతక వ్యాధిగా దుష్ప్రచారం చేస్తున్నారు. ప్రతి ఒక్కరూ కచ్చితంగా వ్యాక్సిన్ వాడాలని నిర్బంధిస్తున్నారు. స్మిత్ క్లైన్ బీమ్ అనే అమెరికన్ కంపెనీ ఈ ఒక్క వ్యాక్సిన్‌తో 200 మి.డాలర్లు లాభం చేసుకుంది. మరోపక్క ఐ.సి.ఎమ్.ఐర్. తన 20 ఏళ్ళ పరిశోధనతో బి.సి.జి. వ్యాక్సిన్ అవసరం లేదని తేల్చింది. అయినా ఇప్పటికీ ఈ వ్యాక్సిన్ వాడుతూనే ఉన్నారు.

3) ఎయిడ్స్ పేరుతో పెద్ద ఎత్తున చేపట్టిన ప్రచారం కాండోమ్ కంపెనీలకు లాభాలు పండిస్తే, 12-16% కాండోమ్‌లు ఫెయిలవుతున్నాయనేది కఠినమైన వాస్తవం.

### స్త్రీల ఆరోగ్యంపై ప్రపంచీకరణ ప్రభావం

ప్రపంచీకరణ వల్ల విద్య, వైద్యం అందని ద్రాక్షగా మారుతుంటే స్త్రీలకు అవి మరింత అందకుండా పోయేస్థితి. పౌష్టికాహారం, విద్య, వైద్యం అనేవి ప్రైవేటీకరణ నేపథ్యంలో అందుబాటులో లేకుండా అయిపోతున్నాయి. ఇదే క్రమంలో ఆడపిల్లపై ఉండే వివక్ష వల్ల ఇవి మరింత అందకుండా పోతున్నాయి.

### టూరిజం - ప్రపంచీకరణ

మెకన్సీ అండ్ కం. తయారు చేసిన విజన్-2020 వెలుగులో ఆంధ్రప్రదేశ్‌ను పర్యాటకులకు భూతల స్వర్గంగా మలచవచ్చని దానికి ప్రైవేటు భాగస్వామ్యం అవసరమని సూచన చేసింది. ఇప్పటికే కరువు పరిస్థితుల వల్ల నగరంలో వేలాదిమంది తమ జీవనాన్ని రోడ్లపైనే వెళ్ళదీస్తున్నారు. పర్యాటక రంగం పేరుతో స్త్రీలను అంగడి సరుకుగా మార్చేందుకే ఈ ప్రణాళిక. అప్పటి ముఖ్యమంత్రిగారు మరొక అడుగు ముందుకేసి వేశ్యావృత్తిని చట్టబద్ధం చేయాలని సూచించారు. అప్పుడు కచ్చితంగా హైదరాబాద్ మరో లాస్ వెగాస్‌గానో, బ్యాంకాక్‌గానో, గోవాగానో పరిణామం చెందుతుంది.

### ప్రపంచీకరణ - మందుల పరిశ్రమలు

అమెరికా తెచ్చిన మేధో సంబంధ ఆస్తి హక్కులు అనేవి మూడో ప్రపంచ దేశాల పేదలకు నష్టం చేసేవిగా, బహుళజాతి సంస్థలకు లాభం చేకూర్చేవిధంగా ఉన్నాయి.

యు.ఎన్.ఐ.డి.ఓ. గుర్తింపు ప్రకారం భారతదేశం స్వంతంగా తన దేశ అవసరాలకు మందులను ఉత్పత్తి చేసుకోగలదు. దేశవ్యాప్తంగా చిన్న, పెద్ద, మధ్యతరహా పరిశ్రమలన్నిటిని కలిపి లెక్కిస్తే 23,000 వరకు ఉన్నాయి.

డబ్ల్యు.టి.ఓ. అసమ వాణిజ్యాన్ని పెంపొందించి, బహుళజాతి సంస్థల ప్రయోజనాలనే నెరవేరుస్తోంది. వాణిజ్యపరమైన మేధో సంబంధ ఆస్తి హక్కుల పేరుతో వైద్య సేవలు మరింత ఖర్చుతో కూడిన వ్యవహారంగా చేస్తోంది. ఇతర దేశాలలో ఔషధాల ధరలను చూస్తే, మన దేశంలో ఔషధాల ధరలు 5-10 రెట్లు పెరిగిపోయే అవకాశం పేటెంట్ల వల్ల కలుగుతుంది. ఉదాహరణకు గ్లాక్సో కంపెని తయారు చేసే రానిటిడిన్ అనే మందు భారతదేశంలో రు.7.20కు, పాకిస్థాన్‌లో రు.65కు, అమెరికాలో రు.545కు అమ్ముతున్నారు. ఈ రకమైన స్వేచ్ఛ పేటెంట్ దారునికి ఉంటుంది. డబ్ల్యు.టి.ఓ. ఒడంబడికల కారణంగా మన ప్రభుత్వానికి ధరల నియంత్రణలో అదుపులేదు. మందుల ధరలు అదుపులో, అందుబాటులో ఉండవు గాబట్టి పేదరిక నిర్మూలన కాక పేదలనిర్మూలన జరుగుతుంది. ఇదే ప్రపంచ బ్యాంకు, ఐ.ఎమ్.ఎఫ్., డబ్ల్యు.టి.ఓ.ల విధానం.

### కొత్త రోగాలు - తిరగబెడుతున్న పాతరోగాలు

వివిధ దేశాల మధ్య పెరిగిన వాణిజ్య సంబంధాలు, పెరిగిన రవాణా సదుపాయాలు, వేగవంతమైన నగరీకరణ, పెరుగుతున్న జనాభా వెరసి కొత్త రోగాలు కూడా పుట్టుకొస్తున్నాయి. గత 20 ఏళ్ళలో మరో 30 కొత్త రోగాలు ఉన్న జాబితాలో చేరాయి. 15 ఏళ్ళ క్రిందట తెలియని ఎయిడ్స్ వల్ల 24 మిలియన్ల ప్రజలు రోగ గ్రస్తులయ్యారు. ఇదేకాక మందులను తట్టుకుంటూ ముదురుతున్న మలేరియా, క్షయ వ్యాధులు మరింతగా జనాన్ని పీడిస్తున్నాయి. రాబోయే 20 ఏళ్ళలో 70 మిలియన్ల ప్రజలు రోగం వల్ల ప్రాణం పోయే పరిస్థితి క్షయ ఎక్కువగా పేద ప్రజలకు వచ్చే రోగం.

ప్రపంచీకరణలో భాగంగా పనిచేసే స్థలంలో సంభవించే ప్రమాదాలకు, అనారోగ్యాలకు కంపెనీల బాధ్యత తగ్గించే దిశగా కొత్త సడలింపులను ఉన్న చట్టాలకు చేరుస్తున్నారు. ఐ.ఎల్.ఓ. ముఖ్యులు డా॥ జుక్కాటకాలా వివిధ పరిశ్రమల్లో 25 కోట్ల ప్రమాదాలు సంభవిస్తే 3.35 లక్షల కార్మికులు చనిపోతున్నారని తన నివేదికలో తెలియజేశారు.

పరిశ్రమలు చిమ్ముతున్న కాలుష్యం, విషపదార్థాల వల్ల 16 కోట్ల మంది రోగ గ్రస్తులయితే వారిలో పది లక్షల మంది చనిపోతున్నారు. పరిశ్రమలు చిమ్ముతున్న రసాయనాలలో 350 కేన్సర్ కారకంగానూ, 3000 రసాయనాలు ఎలర్జీని కలుగజేస్తాయని గుర్తించారు.

### ప్రపంచీకరణ - పసిపిల్లల ఆరోగ్యం

తీవ్రమైన శ్వాసకోస వ్యాధుల తరువాత పిల్లలకు డయేరియా ప్రాణాంతకంగా ఉంది. డయేరియాకు పేదరికమే కారణం. శుభ్రత లేకపోవడం, పోషకాహార లోపం డయేరియాను మరింత వికటింపజేస్తాయి.

పిల్లల ఆరోగ్యానికి తల్లిపాలే శ్రేష్టమయినప్పటికీ, పిల్లల ఆహార ఉత్పత్తులు చేసే కంపెనీలు విపరీతమైన లాభాలు ఆర్జిస్తున్నాయి. సీసాపాలు తాగడం వల్ల ఏటా 15 లక్షల మంది పిల్లలు పేద దేశాల్లో చనిపోతున్నారు. పౌష్టికాహార లోపంతో మనదేశంలో రోజుకు ఐదు వేలమంది పిల్లలు చనిపోతున్నారు. ఒక నెస్లే కంపెనీ ఈ ఉత్పత్తులతో వచ్చే లాభాల్లో 35.5% వాటా కలిగి వుంది.

ఒకపక్క గోడౌన్లనిండా ధాన్యపురాసులుండగా మరోపక్క పౌష్టికాహార లేమితో పిల్లలు చనిపోతున్నారు. 1991 నూతన ఆర్థిక విధానాలు మొదలయ్యాక ఆహార ధాన్యాల ధరలు 70-80 శాతం పెరిగిపోయాయి. కూరగాయలు మధ్యతరగతి వారు కూడా కొనుక్కోలేని స్థితి ఉంది. బహుళజాతి సంస్థలు జన్యుపరంగా మార్పులు చేసిన ఆహార పదార్థాలను పేదదేశాలకు ఎగుమతి చేస్తున్నారు.

జన్యుపరంగా మార్పులు చేసిన ఆహార ఉత్పత్తులతో అనేక ప్రమాదాలున్నాయి. (1) విషప్రభావం ఉంటుంది (2) అలెర్జీ కారకాలు (3) ఆంటిబయాటిక్ మందులు పనిచేయవు (4) పోషక విలువల్లో మార్పు (5) పర్యావరణానికి హాని (6) ఆహారపు అభిరుచులపై ప్రభావం వేస్తాయి.

పేదరికం వల్ల పసిపిల్లలను పనికి పంపక తప్పని స్థితి ఒకవైపు మరోవైపు సరైన ఆహారం లేకపోవడం వెరసి పిల్లల పరిస్థితి మరింత దిగజారుతోంది.

### ప్రపంచీకరణ - సాంప్రదాయక ఔషధాలు

మన ఇంట్లో మామ్మలకు, అమ్మమ్మలకు వైద్య పరిజ్ఞానం ఉంది. రోగం తీవ్రతను పాదాల వేడిని బట్టి కనుక్కోగలిగేవారు. ఆపద్ధతిని ఇప్పటికీ అనుసరిస్తున్నారు. మన సాంప్రదాయక వైద్య విధానంలో ఆరోగ్యాన్ని పెంపొందించడం, రోగం రాకుండా చూడడం, రోగానికి చికిత్స ఉండేవి. బ్రిటిష్ వాళ్ళు సాంప్రదాయక వైద్యాన్ని దెబ్బతీస్తే, ప్రపంచీకరణ మొత్తంగా ఆ ఆలోచననే పూడ్చి పెట్టింది.

ఇప్పుడు వైద్యం వ్యాపారంగాను, రోగి కస్టమర్‌గాను, ఆస్పత్రులు దుకాణాలుగా, వైద్యుడు దుకాణ యజమానిగా అర్థం మారిపోయింది. రోగి ప్రాణాలతో చెలగాటమాడి లాభార్జనే ప్రధాన ధ్యేయంగా విలువలు మారిపోయాయి.

### ఈ మొత్తం క్రమాన్నీ విశ్లేషిస్తే....

ప్రపంచీకరణ చూపుతున్న ప్రభావాలు

- పేదలకు వైద్యం అందే పరిస్థితి లేదు
- వైద్య సేవలను వాణిజ్యంగా మార్చేయడం
- సాంకేతికతతో కూడిన వైద్యాన్ని ప్రోత్సహించడం
- పాత వ్యాధులు ప్రాణాంతకంగా మారడం

- వ్యాధి నిరోధక వైద్యాన్ని నిర్లక్ష్యం చేయడం
- సాంప్రదాయక వైద్యాన్ని ధ్వంసం చేయడం
- ప్రజల ఆకాంక్షలను, ఆరోగ్య అవసరాలను నిర్లక్ష్యం చేయడం
- సామాజికన్యాయంతో సంబంధం లేకుండా వైద్యాన్ని ప్రత్యేకంగా చూడడం జరుగుతోంది.

**మన రాష్ట్రంలో పరిస్థితి**

ప్రపంచ వ్యాప్తంగా పరిశీలిస్తే ప్రపంచబ్యాంకు ఆర్థిక నమూనాను యథాతథంగా అమలుచేస్తున్న ఏకైక రాష్ట్రం బహుశా ఆంధ్రప్రదేశ్ అనడంలో అతిశయోక్తి లేదు.

అప్పటి ప్రభుత్వం ఆరోగ్య రంగంతో సహా అన్ని రంగాల్లోనూ ప్రపంచ బ్యాంకు నిర్దేశించిన విధానాలనే అమలుచేసారు. యూజర్ చార్జీలు విధించడం, తెల్లకార్డులను 80% నుంచి 30%కి కుదించడం. (ఇప్పటికే 50% శాతానికి తగ్గించారు) జరిగింది. తెల్లకార్డులు లేకుండా చేసి ఉచిత వైద్యం నుంచి తప్పించుకునే ప్రణాళికలో భాగంగా ఈ కుట్ర జరిగింది. వైద్యప్రైవేటీకరణ ఒక పథకం ప్రకారం సాగుతోంది. మొదట హాస్పటళ్ళు స్వయం సమృద్ధి సాధించాలనే నిబంధన విధించడం, కార్పోరేట్ ఆస్పత్రులతో కలిసి పని చేయాలనడం, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను స్వచ్ఛంద సంస్థల కప్పగించడం, ఆస్పత్రులకు మందుల సరఫరా నిలిపేసి అక్కడే మందుల షాపులు నిర్వహించడం ఇలాగ ఒక క్రమంలో జరిగిపోతోంది ఈ ప్రైవేటీకరణ.

**పరిష్కారాలు**

ప్రపంచీకరణను ఎదుర్కునే పరిష్కారాలేవయినా అవి ఆరోగ్యాన్ని ప్రాథమిక హక్కుగా గుర్తించాలి. తరతమ భేదం లేకుండా ఒకే విధమైన వైద్యాన్ని అందివ్వాలి. వైద్యసేవ సమగ్రంగా ఉండాలి. ఆరోగ్యం ఒక ప్రజా ఉద్యమం కావాలి. ఆరోగ్యం పోరాడి సాధించుకోవాలేగాని ఒకరిచ్చేది కాదు. విశాల ప్రాతిపదికన పోరాడేవారంతా ఒకే లక్ష్యంతో పోరాడాలి. గత ఎన్నికల్లో అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ కూడా అవే విధానాలను కొనసాగించేందుకు సమాయత్తమవుతోంది. ప్రజా ఉద్యమాల బలంతోనే ఈ ప్రభుత్వ విధానాల్ని మార్చుకోగలం. ఇదొక దీర్ఘకాలిక యుద్ధం. ప్రపంచ బ్యాంకును, ప్రపంచీకరణను ఎదుర్కోడానికి ఎత్తుగడలను బలంగానే రూపొందించుకోవాలి. ❑

## ఆంధ్రప్రదేశ్ ఆరోగ్య రంగం : కొన్ని గణాంకాలు

**బడ్జెట్ కేటాయింపులు: 2002-03**

**దక్షిణాది రాష్ట్రాలలో మన పరిస్థితి**

| రాష్ట్రం | మొత్తం బడ్జెట్ (రు.కోట్లు) | ఆరోగ్య సంబంధ విభాగాలకు కేటాయింపులు(రు.కోట్లు) | మొత్తం బడ్జెట్‌లో శాతం |
|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 28,157 | 1,718 | 6.10 |
| కర్నాటక | 21,404 | 1,369 | 6.40 |
| కేరళ | 13,893 | 1,003 | 7.22 |
| తమిళనాడు | 26,862 | 1,544 | 5.75 |

**జనాభా వివరాలు**

| | 1961 | 1971 | 1981 | 1991 | 2001 |
|---|---|---|---|---|---|
| జనాభా (లక్షలు) | 359.83 | 435.03 | 535.5 | 665.08 | 757.27 |
| పెరుగుదల రేటు (శాతం) | 15.6 | 20.9 | 23.9 | 24.2 | 13.8 |
| జననాలు (ప్రతి వెయ్యికి) | 39.7 | 34.8 | 35.1 | 26.0 | 18.6 |
| మరణాలు (ప్రతి వెయ్యికి) | 25.2 | 14.6 | 13.8 | 9.7 | 10.7 |
| శిశు మరణాల రేటు | 75.36 | - | - | 73.0 | 65.80 |
| లింగ నిష్పత్తి | 981 | 977 | 975 | 972 | 978 |

# ప్రజారోగ్య విప్లవం

## మేము, ప్రజారోగ్య ఉద్యమం చేస్తున్నాం, ఎందుకంటే...

జూనియర్ డాక్టర్ల సమ్మె | ఎవరికోసం? | ఎందుకోసం?

నేటి రోజుల్లో తమ స్వార్థంకోసం కూడా పోరాడలేని స్థితిలో ఉన్న ప్రస్తుత సమాజంలో, పేద ప్రజల ఆరోగ్యం కోసం, ధర్మాసుపత్రుల పరిరక్షణకై, ప్రజలకు కనీస వసతులతో కూడిన ఉచితవైద్యం అందించుటకై జూనియర్ డాక్టర్‌లు చాలా రోజులుగా ఉద్యమిస్తున్నారు. ఈ విషయాన్ని ప్రజలందరూ అర్థం చేసుకొని గత సంవత్సరం నిర్వహించిన 43 రోజుల సమ్మెను విజయవంతం చేసి ప్రభుత్వాసుపత్రులలో యూజర్ చార్జీలు లేకుండా ఉచితవైద్యం అందించుటకు మీ అమూల్యమైన సహాయ సహకారాలు అందించినందుకు మేము మీకు కృతజ్ఞులైయున్నాము.

కాని, నాడు ప్రతిపక్షనేతగా వున్న వై ఎస్ ఆర్ యూజర్ చార్జీలకు ప్రత్యామ్నాయంగా ధర్మాసుపత్రులకు నిధులను కేటాయిస్తామని ఇచ్చిన హామీలను మరిచి నేడు ప్రభుత్వాసుపత్రుల స్థితిని మరింత దిగజార్చాడు. ఇది కాకుండా ప్రభుత్వ ఆసుపత్రికి సరిపడ నిధులను కేటాయించకుండా వైద్యవిద్యను మరింత దయనీయస్థితికి చేర్చాడు. ఇలాంటి సందర్భంలో జూనియర్ డాక్టర్‌లు రాష్ట్రవ్యాప్తంగా ప్రభుత్వాసుపత్రులకు సరిపడ నిధులను కేటాయించాలని, 24 గంటలు వైద్యసేవలకు వీలు కల్పించే రెసిడెన్షియల్ సిస్టమ్‌ను అమలుపరచాలని, ప్రజారోగ్య వ్యవస్థపై సంపూర్ణ అధ్యయనం చేసి తగు సిఫార్సులు తెలియజేయుటకు శాశ్వత ప్రాతిపదికన హెల్త్ కమిషన్‌ను నియమించాలని, జస్టిస్ జీవన్‌రెడ్డి కమిటీ నివేదికలో పేర్కొన్నట్టుగా చట్టవిరుద్ధంగా ఇచ్చిన 15 మెడికల్ కాలేజిల పర్మిషన్‌లను రద్దుచేయాలని ఉద్యమిస్తూ జూనియర్ డాక్టర్‌లు మరోసారి మీ సహాయార్థం మీ ముందు కొచ్చారు.

మేము ఏ రాజకీయపార్టీకి సంబంధించినవారముకాము మరియు ఏ రాజకీయ ఉద్దేశదురుద్దేశాలు మాకు లేవు. ప్రభుత్వాసుపత్రులలో కనీస వసతులు లేని కారణంగా కోల్పోతున్న ప్రాణాలకు మేమే ప్రత్యక్ష సాక్షులు కావడంవలన, తమ హక్కులకోసం ప్రభుత్వంతో పోరాడలేక క్రుంగి - క్రుశించి - నీరసించి - నశించి పోతూవున్న ప్రజలలో మేమూ ఒకరు కావడం వలన, ప్రభుత్వ నిర్లక్ష్యంచే భ్రష్టు బడుతున్న వైద్యవ్యవస్థను చూసి సహించలేక ఉద్యమిస్తున్నాము. మరొక్కసారి మీ మద్దతును మాకు అందించి అధ్వాన్నస్థితికి చేరు తున్న వైద్యవ్యవస్థకు ఊపిరి పోయవలసిందిగా ప్రార్థిస్తున్నాము.

### మా డిమాండ్లు

1. యూజర్ చార్జీల ద్వారా వచ్చు మొత్తాన్ని వెంటనే విడుదల చేసి దీనావస్థలో ఉన్న ప్రభుత్వ ఆసుపత్రులను ఆదుకుంటానని ముఖ్యమంత్రి వై ఎస్ రాజశేఖర రెడ్డి ఇచ్చిన హామీని నిలబెట్టుకోవాలి.
2. ప్రభుత్వ బోధన ఆసుపత్రులలో నిరంతర (24 గంILల) ఉచిత వైద్యసేవకు వీలుకల్పించే "రెసిడెన్షియల్ సిస్టమ్‌ను" వెంటనే అమలు పరచాలి.
3. వైద్య ఆరోగ్య వ్యవస్థపై సంపూర్ణ అధ్యయనం చేసి అందులోని లోటుపాట్లను గుర్తించి పరిష్కారం చూపుట కొరకై శాశ్వత ప్రాతిపదికన హెల్త్ కమీషన్ ఏర్పాటు చేయాలి.
4. జస్టిస్ జీవన్ రెడ్డి కమిటీ నివేదిక సూచించిన విధంగా గత ప్రభుత్వం దొడ్డిదారిన ఇచ్చిన 15 ఆవశ్యక పత్రాలను వెంటనే రద్దు చేయాలి.
5. రఘువీరా రెడ్డి (వ్యవసాయ శాఖ మంత్రి) గారు హామీ ఇచ్చిన విధంగా ప్రైవేటు వైద్య మరియు దంతవైద్య కళాశాలలో బోధనా సిబ్బంది జాబితాను వెంటనే విడుదల చేయాలి.
6. రఘువీరా రెడ్డి (వ్యవసాయ శాఖ మంత్రి) గారు హామీ ఇచ్చిన విధంగా ప్రైవేటు కళాశాలలోని 25% సి. క్యాటగిరి సీట్లను కామన్ ఎంట్రెన్స్ టెస్ట్ ఆధారంగా భర్తీ చేయాలి లేని పక్షంలో ఎమ్‌సెట్ ద్వారా భర్తీ చేయాలి.

క్యాపిటేషన్ మరియు లక్షలకొలది డొనేషన్ ఫీజులను రద్దుచేయాలి. ప్రజలారా ఈ మా డిమాండ్లన్ని సరియైనవని జస్టిస్ జీవన్ రెడ్డి కమిటీ ప్రభుత్వానికి తెలియచేసినది కాని ఇంతవరకు ప్రభుత్వం వాటిని అమలుపరచలేదు. కాబట్టి ఈ మాటమార్చిన, నీతిమాలిన, నిర్లక్ష్యపు ప్రభుత్వాన్ని ఎదిరించేందుకు ముందుకు వచ్చిన ఎపి జూనియర్ డాక్టర్ల సంఘానికి మీరందరూ సహాయ సహకారాలు అందించవలసిందని ప్రార్థన.

- ఆంధ్రప్రదేశ్ జూనియర్ డాక్టర్స్ అసోసియేషన్

*(సమ్మెసందర్భంగా విడుదల చేసిన కరపత్రం)*

# మానవీయ విలువలకోసం పోరాటం

(2004 జూనియర్ డాక్టర్ల సమ్మె సందర్భంగా రాసిన వ్యాసం)

- ప్రొ॥ హరగోపాల్

గత మూడు నాలుగు వారాలుగా పదకొండు వేల మంది జూనియర్ డాక్టర్లు ఒక చారిత్రకమైన సమ్మె చేస్తున్నారు సమ్మెలు స్వప్రయోజనం కొరకే చేస్తారు. అనే భావనను సమాజం విస్తృతంగా నమ్ముతున్న సందర్భంలో, తమ స్వప్రయోజనాలకు కాక వారు సమాజంలోని అట్టడుగు వారి తరపున ప్రభుత్వం ముందు కొన్ని డిమాండ్లను పెట్టారు. అయితే ప్రపంచ బ్యాంకు దుర్మార్గపు ఆలోచనల అత్యంత ప్రభావానికి గురైన పాలకులకు ఈ డిమాండ్లు అర్థం కావటం లేదు. అర్థంకావు కూడా! తమ స్వంత ప్రయోజనాలు లేకుండా సమ్మె ఎందుకు చేస్తున్నారు అన్నది మొదటి సందేహమయితే, డబ్బు బలమున్న వారి ప్రయోజనాల కొరకే ఆలోచించే ప్రభుత్వాలు - సమాజంలో ఇంకా ఇతర మనుషుల పట్ల స్పందించే వారున్నారనేది నమ్మలేకపోతున్నారన్నది రెండవ అంశం. ఈ జూనియర్ డాక్టర్లలాగే ఉపాధ్యాయులు, అధ్యాపకులు, మేధావులు, విద్యార్థులు, కార్మిక సంఘాలు, ప్రజాస్వామ్యవాదులు సంఘటితంగా ఆలోచిస్తే, ప్రపంచ బాంకు ఆట కట్టినట్లే. అందుకే ఈ సమ్మె వెనక ఎవరున్నారు, సమ్మె లోపల ఎవరున్నారు అని ఆలోచిస్తున్నారేకాని సమాజంలో అత్యంత ప్రతిభ కలిగిన యువతీ యువకులైన డాక్టర్లు సమాజాన్ని గురించి, కొన్ని మానవ విలువల గురించిన ప్రశ్నలను చాలాకాలం తర్వాత ప్రజా జీవనంలోకి (జన జీవన స్రవంతిలోకి) తీసుకొచ్చారని హర్షించడం లేదు. ఇదే ఒక విషాదం.

ప్రపంచ బ్యాంకును మొత్తంగా తప్పు పట్టనవసరం లేదు. అది అప్పులిచ్చి లాభాలు చేసుకునే ఒక కాబూలీవాలా. ఆ సంస్థకు డబ్బులద్వారా ఆలోచించడం, డబ్బుల గురించి ఆలోచించడమే సాధ్యమవుతుంది. కాని, డబ్బులకు మించిన మానవీయ విలువలుంటాయని, తల్లి, పిల్లల ప్రేమ, డాక్టరు రోగి మధ్య విశ్వాసం, ఉపాధ్యాయుడు విద్యార్థి మధ్య ఆత్మీయత, పారిశ్రామికవేత్త కార్మికుడి మధ్య పరస్పర గౌరవం, ప్రజా ప్రతినిధులు ప్రజలమధ్య గౌరవభావం, రాజ్యం పౌరుడి మధ్య సంక్షేమ భావన అనే విలువలుంటాయని ప్రపంచ బ్యాంకుకు తెలియదు. ఇలాంటి మానవ సంబంధాలు మనిషి ప్రాముఖ్యతను పెంచి సంపద ప్రాముఖ్యాన్ని తగ్గిస్తాయి. అలా ధనం ప్రాధాన్యత తగ్గితే ప్రపంచబ్యాంకు భవిష్యత్తు ప్రశ్నార్థకమే. ఈ ప్రపంచంలో అన్ని పనులకు మూలం ధనమని నమ్మే వారితో నాగరికతకే ప్రమాదం. ఈ సమ్మెలో డాక్టరుకు రోగికి మధ్య ఎలాంటి సంబంధముండాలి అనే ప్రశ్న ముందుకు వచ్చింది. ఆరోగ్యం సరుకుకాదని, అది ఒక సేవాభావమని గుర్తించాలి.

## రోగుల వద్ద ఫీజులు

ప్రభుత్వ ఆసుపత్రిలో వినియోగదారుడు డబ్బు కట్టడం మంచి ప్రయోగం కాదని డాక్టర్లు వాదిస్తున్నారు. డబ్బులున్నవాళ్లు డబ్బులు చెల్లిస్తారు. వాళ్ల దగ్గర డబ్బులు తీసుకుంటే మీకేం ఇబ్బంది? డబ్బులు లేని వాళ్ళ దగ్గర తీసుకోం. సరిపోతుంది కదా. ఇది కేవలం డబ్బు ఉన్నవాడు, లేనివాడు అనే సమస్య కాదు. జబ్బు పడ్డ మనిషికి డబ్బుతో సంబంధం లేదు. డబ్బులున్న వాళ్ళకు కావలసినన్ని దోపిడీ హాస్పిటల్స్, రోగులను నిరంతరం పీడించే డాక్టర్లు చూసుకుంటారు. వాళ్ళదగ్గరికి డబ్బులున్న వాళ్ళని వెళ్ళనివ్వండి. అక్కడకు వెళ్ళి ఆడాక్టర్ల మీద విశ్వాసంలేక, వాళ్ళు రాసే పరీక్షలను భరించలేక, భరించినా అవన్నీ అనవసరంగా రాస్తున్నారని డాక్టర్లను రోజు శాపనార్థాలు పెడుతూనే ఉన్నారు. నా చిన్నతనంలో డాక్టర్లను ఆరాధ్య భావంతో చూసేవారు. మా తాలూకా హాస్పిటల్‌లో పని చేస్తున్న డాక్టరు ఫోటో మా ఇంట్లో ఉండేది. ఆ డాక్టరు పేరును మా అమ్మ ఒక తమ్ముడికి పెట్టి ఆ డాక్టరు మీద తన గౌరవాన్ని చాటుకుంది. ఇప్పటి డాక్టర్లు సాయంత్రం ఐదునక్షత్రాల హోటల్‌లో తిని, విలువైన కారులో తిరిగితేనే జీవితానికి అర్థం అనుకుంటున్నారు. రోగులు ఏం తిట్లు తిడుతున్నా వాళ్ళకు పట్టింపు లేదు. ఈ మాటంటే మిగతా రంగాల సమస్యేమిటి? విశ్వవిద్యాలయాలు బాగున్నాయా? మీరంతా విలువల కొరకే పనిచేస్తున్నారా అని ప్రశ్నించవచ్చు. ఒక ప్రశ్నకు మరొక ప్రశ్న జవాబు కాదని గుర్తించాలి. అందుకే ఈ సమ్మెలో ప్రభుత్వ హాస్పిటల్‌కు వచ్చే రోగులందరినీ సమానంగా చూడాలి. డబ్బులున్న వారు ప్రభుత్వ హాస్పిటల్‌కు వస్తున్నారంటే ప్రభుత్వం గర్వపడాలి. అంతేకాని రెండురకాల రోగులు అనే వివక్ష ఆస్పత్రి అంతర్గత సంస్కృతిని విధ్వంసం చేస్తుందని గుర్తించాలి.

## ఆరోగ్యం పట్ల నిర్లక్ష్యం

ప్రభుత్వం దగ్గర ఈ హాస్పిటల్స్ నడపడానికి వనరులు లేవు అనేవాదనను ఇపుడు అత్యంత బలమైన ఆయుధంగా ఉపయోగిస్తున్నారు. ఇంకా రాజకీయంగా పరిణతి చెందని సామాన్య ప్రజలు, విశాల సమాజాన్ని గురించి ఆలోచించలేకపోతున్న మధ్యతరగతి వారిదాకా ఈ వాదనకు బలం ఉంటుంది. ప్రభుత్వ దగ్గర వనరులు లేవంటే సమాజంలోనే వనరులులేవా, లేక

వనరులున్నా వాళ్ళ దగ్గర తీసుకోవడానికి ప్రభుత్వం సిద్ధంగా లేదా? స్టాంపుల కుంభకోణంలో 30 వేలకోట్ల మాటేమిటి? ఈ 30 వేల కోట్లతో ఎన్ని హాస్పిటల్స్‌ను ఉచితంగా నడుపవచ్చో, ఎంతమందికి ఉన్నతవిద్య కల్పించవచ్చో ఆలోచించండి. నిజానికి ఆరోగ్యం మీద జాతి ఆదాయంలో ఐదు శాతం ఖర్చు పెట్టాలని నియమం ఉన్నది. కాని కేవలం 0.46% మాత్రమే ఖర్చు పెడుతున్నారు. ఆరోగ్యానికి ఎందుకు ఇంతతక్కువ కేటాయించారని ఎవరూ అడగటం లేదు. సంపద కలిగిన వారు ఆ సంపదలో వాటా తాము జీవించే సమాజంతో పంచుకోవాలి. అలా జరిగినప్పుడే సహజీవనం కొంతవరకు సాధ్యమవుతుంది.

నేను ఈ మధ్యే స్వీడన్‌లో మూడు వారాలున్నాను. నేను వెళ్ళిన ఉప్సాలా విశ్వవిద్యాలయంలో, స్వీడన్‌లోని అన్ని విశ్వ విద్యాలయాలలో ఉన్నతవిద్య (వైద్యవిద్యతో పాటు) సంపూర్ణంగా ఉచితంగా అందిస్తున్నారు. ఆదాయాలతో సంబంధం లేకుండా ప్రతి విద్యార్థికి స్కాలర్‌షిప్ వసతి కల్పించారు. మొత్తం వైద్యాన్ని అందరు ప్రజలకు అందుబాటులో ఉండేలా చర్యలు తీసుకున్నారు. ప్రైవేటు ఆస్పత్రులు, ప్రైవేటు డాక్టర్లు లేరు. ఎవరైనా జబ్బుపడితే నామమాత్రమైన 20 క్రోనర్లు చెల్లిస్తే అది హృదయానికి సంబంధించిన సర్జరీ అయినా, కేన్సర్ ఐనా ఉచితంగా అందిస్తున్నారు. ఇక్కడ ధనికులు పేదవాళ్ళు అనే భేదం పాటించరు. మనదేశంలో ముఖ్యంగా మన రాష్ట్రంలో అధికారంలో ఉండే వాళ్ళకు స్వీడన్ పాలకులు పిచ్చివాళ్ళుగా కనిపించవచ్చు. లేదా అదొక వింతగా తోచవచ్చు. కాని ఇది నిజం. ఇది ఎలాసాధ్యమైంది అని ఆలోచిస్తే ప్రభుత్వం వ్యక్తి ఆదాయంనుండి 60 శాతం పన్నుల రూపేణా తీసుకుంటుంది. పన్నులు అధికంగా ఉన్నాయని ఎవరూ నిందించడం లేదు. నాణ్యతగల సేవలను అందరికీ అందుబాటులో ఉంచిన ప్రభుత్వం పట్ల అందరికీ గౌరవభావమే ఉన్నది. అయితే అతి సంపన్నులైన వారు ఈ మధ్యే మా ఖర్చు మేం భరిస్తాం, అందరికీ ఒకే రకమైన వైద్యమెందుకు? వైద్యంలోకూడా వైవిధ్యముండాలి, పోటీ ఉండాలనే వాదనలను ప్రపంచీకరణ నేపథ్యంలో ముందుకుతీసుకొస్తున్నారు. కాని సామాన్య ప్రజలు ముఖ్యంగా కార్మికసంఘాలవారు దీనిని వ్యతిరేకిస్తున్నారు. కార్మిక సంఘాల మద్దతుమీద సంపూర్ణంగా ఆధారపడిఉన్న ప్రభుత్వం ఈ దుస్సాహసాన్ని చేయలేకపోతున్నది.

జూనియర్ డాక్టర్ల సమ్మెలో ఎక్కడో స్వీడన్‌లాంటి సమాజాల సంక్షేమ భావన అంతర్లీనంగాఉంది. డాక్టర్లంతా అవినీతిపరులని, ఈ సమాజం బాగుపడదని, డబ్బులున్న వాళ్లకు, లేనివాళ్ళకు తేడాలు స్వతఃసిద్ధమని వాదించే వాళ్ళతో, నిరాశావాదులతో మనం ఏంచేయలేం. తెలుగు సమాజం ఒక సృజనాత్మక సమాజమని ఎన్నో సందర్భాలలో మాలాంటి వాళ్ళం భావిస్తున్నాం. ఇక్కడ ప్రపంచబ్యాంకు ప్రయోగమే కాదు, సామాజిక ప్రయోగాలు కూడా అలా జరుగుతున్నాయి. ఈ సమాజంలో అత్యంత నిజాయితీ గల అద్భుతమైన వ్యక్తులున్నారు. పలు రకాలైన ఉద్యమాలున్నాయి. భవిష్యత్తు మీద విశ్వాసంగల ఒక సంస్కృతి ఉంది. సృజనాత్మకమైన సాహిత్య సృష్టి జరుగుతున్నది. ఈ సామాజిక వాతావరణంలో డాక్టర్ల సమ్మె జరుగుతున్నది. దిగజారుతున్న సామాజిక విలువలకు, నవమున్నతమైన మానవ విలువలకు మధ్య జరిగే సంఘర్షణలో ఈ సమ్మె మానవీయ విలువల కోసం జరుగుతున్నది. పదివేల మంది చిన్న వయసులోఉన్న డాక్టర్లు - వైద్యం అందరికీ, ముఖ్యంగా అట్టడుగు ప్రజలకు అందుబాటులో ఉండాలని ఉద్యమించడమే ఒక గొప్ప అనుభవం. సమ్మె విజయమవుతుందా విఫలమవుతుందా అన్నది ప్రశ్నకాదు, విలువల కొరకు జరిగే ఏ సంఘర్షణ అయినా విలువైనదే! (వార్త దినపత్రిక, 3.1.2004) ❑

## జస్టిస్ జీవన్ రెడ్డి కమిటీ ఏమంది?

1. రెండు సంవత్సరాల గడువు పూర్తి అయినా ఉనికిలోకి రానటువంటి 15 కాలేజీల ఎసెన్షియాలిటీ సర్టిఫికెట్లను వెంటనే రద్దుచేయాలి.
2. గత ప్రభుత్వం మంజూరు చేసిన 30 ప్రైవేటు మెడికల్ కాలేజీల్లో 27 కాలేజీలకు ఆవశ్యకత పత్రాలు యం.సి.ఐ. ఫారం-2 నిబంధనలకు వ్యతిరేకంగా ఇవ్వబడ్డాయి.
3. ఫారం-2 నిబంధనలను అతిక్రమించడంవల్లే ఈ అల్లకల్లోల పరిస్థితి.
4. ప్రాంతాల ప్రాతిపదికగా మెడికల్ కాలేజీలను ఇవ్వడం నిబంధనలకు వ్యతిరేకం, ఆ అధికారం ప్రభుత్వానికి లేదు.
5. ప్రస్తుతం విద్యార్థులున్న 17 కాలేజీల్లో ప్రమాణాలపై నిపుణ కమిటీని నియమించి ఆకస్మిక తనిఖీలు నిర్వహించాలి.
6. మెడికల్ కాలేజీల అంశంపై ప్రభుత్వం సంపూర్ణంగా పునః పరిశీలన చేయాలి.
7. ప్రైవేటు కాలేజీలలో ప్రమాణాలను నియంత్రించడంలో రాష్ట్ర ప్రభుత్వానికి కచ్చితమైన బాధ్యత ఉన్నది.
8. ప్రభుత్వ మెడికల్ కాలేజీల్లో ఎన్ఆర్ఐ సీట్లు పెట్టవలసిన అవసరం లేదు.
9. కాంట్రాక్టు ఉద్యోగాలను రద్దు చేయాలి. అవికొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో పెట్టాలిగాని ఒక నియమం కారాదు.

## అయోధ్యపై మిలిటెంట్ల దాడి

# భాజపా గురివిందగింజ రాజకీయం

- వకుళాభరణం రామకృష్ణ

మిలిటెంట్ల దాడితో మళ్ళీ అయోధ్య సమస్య రెండు విధాల ఫోకస్‌లోకి వచ్చింది. ఇందులో మొదటిది, సంక్షోభంలో పడ్డ భా.జ,పా.కు, సంఘ పరివార్‌కు యిది చేతికందిన నదవకాశంగా, ఎన్.డి.ఎ. ప్రభుత్వాన్ని యిరకాటంలో పెట్టాలన్న ప్రయత్నం. రెండోది, అయోధ్య కేసుకు సంబంధించి, తిరిగి అద్వానీని 'ముద్దాయి'గా చేర్చాలని కోర్టు నిర్ణయం. అయోధ్య చారిత్రాత్మకంగా, రామజన్మ భూమి అవునో కాదో యింకా తేలలేదు. కానీ సంఘ పరివార శక్తులు, యెప్పటికప్పుడు, అవకాశం చిక్కినప్పుడల్లా, దీన్నుండి రాజకీయ లబ్ధి పొందాలని ప్రయత్నిస్తూనే ఉన్నాయి. ఈ సమస్యపైనే సోమనాథ్ నుండి, అయోధ్య దాకా, అద్వానీ రథయాత్ర సాగింది. మత తత్వ శక్తులను బాహాటంగా కూడగట్టి, మతోన్మాదాన్ని తీవ్రస్థాయికి తీసుకెళ్ళాడు. దేశంలో మత కల్లోలాలు రేకెత్తడం, విపరీతమైన జన, ధన, నష్టం సంభవించడం మనకు తెలుసు. మత వైషమ్యం రెక్కలు విచ్చుకొంది. కట్టలు తెంచుకొన్న మతోన్మాదం బాబ్రీ మసీదును కూల్చింది. ఈ విధ్వంసానికి, అద్వానీతో సహా, పలువురు పరివార్ అగ్ర నాయకులు, ప్రత్యక్ష సాక్షులుగా నిల్చారు. మసీదుని కూల్చినప్పుడు, వారక్కడే వుండడం, విధ్వంసకారులకు మరింత వూతమిచ్చింది. ఉన్మాదంతో వూగిపోయి సంఘ పరివార శక్తులు దేశమంతటా పండుగలు చేసుకొన్నారు. ఈ బాబ్రీ మసీదు శిథిలాలపై, మత కలహాలు సృష్టించిన వినాశనంపై, భా.జ.పా. తన రాజకీయ బలాన్ని గణనీయంగా పెంచుకొని, పార్లమెంటులో ఆధిక్యతను సాధించి, సంకీర్ణ ప్రభుత్వానికి నాయకత్వం వహించి, కేంద్రంలో ఆరు సంవత్సరాలు అధికారంలో వుంది. ఆర్థిక, రాజకీయ రంగా లతోపాటు, ముఖ్యంగా విద్య, సాంస్కృతిక రంగాల్లో మత తత్వాన్ని చొప్పించి, జాతి సమష్టి సాంస్కృతిక మూలాలను తిరగదోడ ప్రయత్నాలు చేసి, కొంతవరకు సఫలీకృతమైంది గూడ.

ఇది గత చరిత్ర. గత జల సేతుబంధనం ఎందుకంటారా? ఇది నేపథ్యం కాబట్టి. మొన్నా మధ్య జరిగిన అయోధ్యపై దాడిని మరోసారి తమ స్వప్రయోజనాల కోసం మతతత్వ శక్తులు యెలా వాడుకోపూనారో చూద్దాం. సంక్షోభంలో, సిద్ధాంత, నిర్మాణ రీత్యా, కూరుకుపోయిన వీరికి యిది మంచి 'సేఫ్టీ వాల్వ్'గా అక్కరకొచ్చింది అద్వానీ పాకిస్థాన్ యాత్ర చేవట్టక ముందే పరివార్‌లో ముసలం మొదలైంది. ఒక ప్రముఖ టి.వి. ఛానల్‌కు యిచ్చిన యింటర్వ్యూలో, ఆర్.ఎస్.ఎస్. నేత సుదర్శన్, నాయకత్వం నుండి 'వృద్ధ నాయకులిద్దరినీ' తప్పుకోమని సలహాలాంటి అల్టిమేటమ్ యివ్వడంతోనే యీ సంక్షోభం మొదలైంది. ఇక, పాకిస్థాన్ యాత్రలో అద్వానీ చేసిన వ్యాఖ్యలు, ఉపన్యాసాలు, దీన్ని మరింత తీవ్రస్థాయికి చేర్చింది. ఆ తర్వాత జరిగిన పరిణామాల్లో అద్వానీ రాజీనామా, నసేమిరా ఉపసంహరించుకోనని మొరాయించడం జరిగింది. ఆర్.ఎస్.ఎస్. దీంతో రాజీపడలేనని ఖరాఖండిగా చెప్పింది. సిద్ధాంత రీత్యా, భా.జ.పా. దీన్ని నీరుగార్చే ఏ ప్రయత్నం చేసినా సహించబోనని తెగేసి చెప్పింది. జిన్నాను గూర్చి తాను చేసిన వ్యాఖ్యలపై చర్చ జరగాలన్న అద్వానీ అభ్యర్థనను, ఆర్.ఎస్.ఎస్. నిర్ద్వంద్వంగా తోసిపుచ్చి, ఆ ప్రస్తావన లేకుండానే ఒక రాజీలాంటి తీర్మానాన్ని చేసి, దానికి అద్వానీ అంగీకరించాకనే, ఆయన రాజీనామాను ఉపసంహరించుకోడానికి అవకాశం కలిగింది. ఆర్.ఎస్.ఎస్.తో చిన్నప్పటి నుండి, సాన్నిహిత్యం కలిగి, ఆ సంస్థకు ముద్దుబిడ్డగా వెలుగొందుతూ వచ్చిన అద్వానీకి యీ ఘటనలు కోలుకోనంతగా దెబ్బ తీశాయి.

ఇంతలో అయోధ్యపై పాకిస్థాన్‌లోని మిలిటెంట్లు దాడి జరిపారు. అన్ని దాడుల్లాగే యిదీ అత్యంత మొండి సాహసంతో, బరితెగించి చేసిన ప్రయత్నం. టెర్రరిస్టులు, ముఖ్యంగా మతోన్మాద టెర్రరిస్టులు చేసే దాడులు, ఆకస్మికంగా, మెరుపు దాడుల్లావుంటాయి. దేశం యావత్తూ ఒక్కసారి షాక్ తింది. కానీ భద్రతా శక్తులు చూపిన అపూర్వ అప్రమత్తతవల్ల, దాడి విఫలమైంది. తీవ్రవాదులు మరణించారు. వారొచ్చిన కారు డ్రైవర్ ప్రాణాలతో బతికి బయట పడ్డాడు. పై స్థాయిలో దర్యాప్తు జరుగుతోంది. దేశంలోని యావన్మంది ప్రజలు ఊపిరి పీల్చుకున్నారు. భద్రతా దళాల సమయ స్ఫూర్తికి, సాహసానికి నివాళులర్పించారు. (గుజరాత్ ముఖ్యమంత్రి ప్రత్యేకించి, భద్రతా దళాలకు 10 లక్షల రూపాయల నజరానా ప్రకటించడం గమనార్హం). ఇలాంటి ఘటనలు భవిష్యత్తులో తిరిగి సంభవించకుండా తగిన చర్యలు చేపట్టాలని అన్ని రాజకీయ పక్షాలు ప్రభుత్వాన్ని కోరాయి. తగిన చర్యలు చేపడతామని అటు కేంద్రం, ఇటు ఉత్తర

ప్రదేశ్ ప్రభుత్వం హామీలిచ్చాయి. దేశ అంతరంగిక భద్రతను ఒక్కసారిగా కుదిపేసిన యీ ఘటన జరిగిన తర్వాత, అన్ని రాజకీయ పక్షాలు, పౌర సమాజం ప్రభుత్వానికి దన్నుగా నిలవాలి. సంఘీభావాన్ని ప్రకటించాలి. దేశ ఐక్యతకు దోహదం చేసే విధంగా, భద్రతా దళాల ధైర్య స్థైర్యాలను పెంచేవిధంగా వుండాలి. అన్ని రాజకీయ పక్షాలు, ముస్లిం సంస్థలతో సహా యీ వైఖరిని అవలంబించాయి. అయితే, యీ పరిస్థితుల్లో భా.జ.పా. చేసిందేమిటి? నిరసన ప్రదర్శనలు, ధర్నాలు, భారీయెత్తున వూరేగింపులు నిర్వహించి, కేంద్ర ప్రభుత్వ హోమ్ మంత్రి రాజీనామా కోరింది. ఉత్తర ప్రదేశ్‌లో ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయాలని డిమాండ్ చేసింది. దీన్నొక ప్రబల సమస్యగా సృష్టించి, మతోన్మాదాన్ని రెచ్చగొట్టాలని ఆశించింది. సంక్షోభంలో కూరుకుపోయి, ప్రతిష్టను కోల్పోతున్న స్థితినుండి బయటపడాలని ఆశించింది. ముఖ్యంగా అద్వానీ యీ సమస్యను తనకు వ్యక్తిగతంగా, స్వప్రయోజనం చేకూర్చే విధంగా వాడుకోవాలని ప్రయత్నించాడు. ఈ దాడి జరగడానికి కొద్ది రోజుల ముందే పాకిస్థాన్ పర్యటనలో బాబ్రీ మసీదు విధ్వంసాన్ని గూర్చి చేసిన వ్యాఖ్యలకు విరుద్ధంగా ప్రవర్తించాడు. మసీదు విధ్వంసం, తన జీవితంలో అత్యంత శోక పూరితమైందిగా వర్ణించిన అద్వానీ, యిప్పుడు అయోధ్యకు ప్రయాణం కట్టడం, మిలిటెంట్ల దాడికి 'సరైన సమాధానం' చెప్పాలని కోరడం వెనక ఏ రాజకీయ ప్రయోజనాలు దాగి వున్నాయో తెలుసుకోవడం కష్టం కాదు.

గతంలో, భా.జ.పా. అధికారంలో వున్నప్పుడు ఏం జరిగింది? 1999 సంవత్సరం డిసెంబర్ 31న, అప్పటి విదేశాంగమంత్రి జస్వంత్ సింగ్ (సీనియర్ భా.జ.పా. నాయకుడు) స్వయంగా ముగ్గురు కరడుగట్టిన టెర్రరిస్టులను తాలిబాన్ ప్రభుత్వ విదేశాంగ శాఖామంత్రికి అప్పగించాడు. ఆ ముగ్గురిలో ఒకడైన, మసూద్ అజార్ జైషే మహమ్మద్ అనే అతి ప్రమాదకరమైన టెర్రరిస్టు సంస్థను నెలకొల్పాడు. ఆ తర్వాత కాలంలో భారత దేశ పార్లమెంట్‌పై జరిపిన దాడికి యీ సంస్థ నాయకత్వం వహించడం మనం గమనించాలి. అంతేకాదు. అక్షర ధామంపై జరిగిన మిలిటెంట్ల దాడి, అదే క్రమంలో జమ్మూ-కాశ్మీర్ అసెంబ్లీపై దాడి, కాలూచక్‌పై తీవ్రవాదులు జరిపిన దాడి, యివన్నీ భా.జ.పా. నాయకత్వంలో కేంద్రంలో ప్రభుత్వం అధికారంలో వున్నప్పుడే జరిగాయి. అప్పుడు 'లోహ పురుష్' అద్వానీ హోమ్‌మంత్రిగా వున్నాడు. ఈ దాడిని మరో కోణంలో చూసినప్పుడు, భారత-పాకిస్థాన్‌ల మధ్య జరుగుతున్న శాంతి చర్చలు, ఇరు దేశాలు ఒక సయోధ్యకు జరుగుతున్న ప్రయత్నాలకు విఘాతం కలిగించే చర్యగా పరిగణించాలి. సరిగ్గా అదే దిశలోనే భా.జ.పా. ప్రయాణిస్తోందా? ఇరు దేశాల మధ్య శాంతి ప్రయత్నాలు, వారి వైఖరివల్ల భగ్నం కావా? రెండు దేశాల మధ్య శత్రుత్వం సాగినన్నిరోజులు, వారనుసరిస్తున్న మత విద్వేషవైఖరికి వూతం చేకూరుతుందని వారనుకోడం లేదా? ఈ దాడిని ఆసరాగా చేసుకొని, దేశంలో మరింత విద్వేషాన్ని రగిల్చి, తమ పబ్బం గడుపుకోవాలని ఆశించడం లేదా? ఇవి విజ్ఞులు ఆలోచించాల్సిన అంశాలు. కానీ, భా.జ.పా. ఆశిస్తున్నట్లుగా యివ్వాల్టి భారతదేశం, మసీదుని కూల్చిన 1992 నాటి స్థితిలో లేదు. ప్రజలు మతోన్మాదుల ఆటలను, ఆగడాలను గ్రహించారు. 2004లో జరిగిన ఎన్నికల తర్వాత కేంద్రంలో వామ పక్ష శక్తుల సహకారంతో యేర్పడ్డ ప్రభుత్వం, దేశ రాజకీయ వ్యవస్థను, లౌకిక మార్గంలో నడిపే విధంలో మరింతగా కృషి సల్పుతోంది. విద్యా, సాంస్కృతిక రంగాల్లో చొరబారిన హిందూత్వ భావజాలాన్ని తొలగించే చర్యలు చేపట్టింది. ఇక్కడి హిందూత్వ శక్తుల కార్యకలాపాల వల్ల, జిహాదీలు బలపడే ప్రయత్నాలను తిప్పికొట్టే విధంగా ప్రభుత్వం వ్యవహరించాలని లౌకిక, ప్రజాస్వామిక శక్తులు కోరుకుంటున్న వైనాన్ని గమనించాల్సివుంది. మతతత్వ శక్తులకు పరోక్షంగా, ప్రత్యక్షంగా బలాన్ని చేకూరుస్తూ వచ్చిన వాణిజ్య, వ్యాపార వర్గాలు, మధ్య తరగతి వర్గాలు క్రమేపీ వారి స్వప్రయోజనాల దృష్ట్యా యీ శక్తులకు దూరంగా వుండే విధంగా మార్పు చెందుతున్నారన్న ఆశాభావం కలుగుతోంది. భా.జ.పా. అనుసరిస్తున్న ద్వంద్వ ప్రమాణాలను (వారు అధికారంలో వున్న ప్పుడు ప్రవర్తించిన తీరుకు విరుద్ధంగా), రెండు నాల్కల వైఖరిని ప్రజలు గమ నిస్తున్నారు. ఇది ఆశావహమైన పరిణామం. ❑

---

వచ్చే సంచికలో......

- ఫోకస్ - ఆంధ్రప్రదేశ్‌లో మహిళల స్థితిగతులు
- సంస్కరణల ఫలితమే రైతుల ఆత్మహత్యలు - డి. వి. రామకృష్ణారావు
- గర్భంలోని ఆడపిల్లలను చంపటం ఏ నాగరికతకు నిదర్శనం? డా. పి. రాంమోహనరావు
- కోర్టు తీర్పులు - న్యాయమూర్తుల సైద్ధాంతిక అవగాహన - దిగుమర్తి నరసింహారావు

# వ్యవసాయంలో మార్పులు - మళ్ళీ చెక్కపల్లి, నూకల మర్రి

-ప్రదీప్, చలపతిరావు

(వీక్షణం మార్చ్ 1-31, 2005 సంచికలో అచ్చయిన నెల్లూరి కృష్ణమూర్తి వ్యాసం 'నక్సలైట్ ఉద్యమం - కొన్ని ఆలోచనలు'పై జరుగుతున్న చర్చలో భాగంగా వచ్చిన ప్రతిస్పందన ఇది - సం.)

కరీంనగర్ జిల్లా పాత సిరిసిల్ల తాలూకాలోని చెక్కపల్లి, నూకల మర్రి, నిమ్మపల్లి, కొదురు పాక వంటి ఎన్నో గ్రామాలు 1970ల్లో భూస్వాముల దోపిడీ, పీడనలకు వ్యతిరేకంగా సాగిన రైతాంగ ఉద్యమ కేంద్రాలుగా ఉండేవి. భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు పెల్లుబికిన ఆకాలంలో, సిరిసిల్ల తాలుకాను, జగిత్యాలతో కలిపి, ఆంధ్రప్రదేశ్ కల్లోలిత ప్రాంతాల చట్టం కింద కల్లోలిత ప్రాంతంగా ప్రకటించడంతో సహా ఎన్నో రకాల అణచివేత చర్యలను రాజ్యం అమలు చేసింది. ఆపోరాటాల చరిత్ర చెప్పడమో, రాజ్యాంగ యంత్రపు అణచివేత విధానాలని ఏకరవు పెట్టడమో ఈ వ్యాస లక్ష్యం కాదు. అప్పటికీ ఇప్పటికీ వ్యవసాయ స్థితిగతులను తులనాత్మకంగా అంచనావేసే ప్రయత్నమిది. మరోమాటల్లో చెప్పాలంటే గత 25 సంవత్సరాలలో వ్యవసాయ రంగ నిర్మాణం లోనూ, వ్యవసాయ సంబంధాలలోనూ వచ్చిన మార్పులను చర్చించే ప్రయత్నమిది.

మేము చెక్కపల్లి, నూకలమర్రి అనే రెండు గ్రామాల ఉదాహరణ తీసుకుని ఆ గ్రామాలు అంతర్గత పోరాట క్రమంలోనూ గత దశాబ్దంన్నరగా దేశం వీక్షిస్తున్న ప్రపంచీకరణ క్రమంలో భాగంగా బాహ్యశక్తుల వల్లనూ పొందిన వ్యవసాయ మార్పులను వెలికితీయడమనే గంభీరమైన ప్రశ్నను తీసుకుంటున్నాము. ఈ రెండు గ్రామాలూ ప్రస్తుతం వేములవాడ మండలంలో భాగం. డెబ్బైయవ దశకం తొలి అర్ధ భాగంలో ఇక్కడే ఉద్యమం ప్రారంభమైంది. ఈ రెండు గ్రామాలూ కూడా ప్రముఖ దేవాలయ క్షేత్రమైన వేములవాడ నుంచి పది కిలోమీటర్ల లోపు ఉన్నాయి. రెండు గ్రామాలకు వాహనాలు వెళ్ళగలిగిన రోడ్లు ఉన్నాయి. ఉద్యమం ప్రారంభమైన డెబ్బైలలో చెక్కపల్లి భగవంతరావు అనే భూస్వామి అధీనంలో ఉండేది. ఆయన నూటయాభై ఎకరాల భూస్వామి. ఆ భూమంతా ఆయన పెట్టుబడి పెట్టి సంపాదించింది కాదు. ఆదిమ పద్ధతులని చెప్పదగిన మోసకారి పద్ధతులలో ఆయన ఆ భూమి సంపాదించాడు. పది ఎకరాల దేవాలయ భూమిని ఆక్రమించుకున్నాడు. పేదలకు చెందిన పదకొండు ఎకరాల భూమిని కబ్జా చేసాడు. ఇటువంటివి ఎన్నో ఉన్నాయి. కాగా నూకల మర్రిలో భూస్వామి భాస్కరరావు నలభై ఎకరాల చెరువు షికం, పేదలకు చెందిన ఇరవై రెండు ఎకరాల పట్టా భూమి ఆక్రమించుకున్నాడు.

వాళ్ళు గ్రామం మీద సంపూర్ణమైన పట్టు సాధించి రైతాంగాన్ని ఎన్నో రకాల ఆర్థిక, ఆర్థికేతర దోపిడి రూపాలకు బలిచేసారు. గ్రామాలలో వెట్టి ఉండేది. రైతులనుంచి మిగులును దోచుకోవడానికి కౌలు, పాలు వంటివి ప్రధాన రూపాలుగా ఉండేవి. రైతులు ఈ దొరలు నిర్ణయించిన భాగాన్ని వారికి అప్పజెప్పవలసి ఉండేది. కౌలుదార్లు నిరంతర రుణ భారం కింద మగ్గిపోయేవారు. సాంఘిక అణచివేత ఎంత తీవ్రంగా ఉండేదంటే దొర భగవంతరావుగానీ, ఆయన భార్యగానీ గ్రామంలో నడుస్తున్నారంటే దారిలో ఉన్న వారెవరయినా తల ఎత్తి చూడగూడదు. తలలు వంచుకుని నిలబడవలసి ఉండేది. ఊరిలోని మామూలు ప్రజలు తయారై ఉండకూడదు. ఉతికి, ఇస్త్రీ చేసిన బట్టలు వేసుకోకూడదు. ఈ గ్రామాలలో అస్పృశ్యతా, రెండు గ్లాసుల పద్ధతీ కూడా అమల్లో ఉండేవి.

ఈ నేపథ్యంలో ఈ గ్రామాలలో డెబ్బైలలో రైతాంగ ఉద్యమం రూపం తీసుకుంది. ఇక్కడ గుర్తించదగిన అంశం భూస్వాములకు వ్యతిరేకంగా అన్ని సెక్షన్ల ప్రజల ఐక్యత. ఆ క్రమంలోనే భూస్వామ్య బంధనాలు చాలావరకు తెగిపోయాయి. ఈ దొరల కింద, ఈ దొరల కబ్జాలో అక్రమంగా ఉండిన భూములను ఆక్రమించుకొని పంపిణీ చేయడం జరిగింది. అన్నిటికన్న ముఖ్యంగా సకల రంగాలమీద కొనసాగిన ఈ దొరల ఆధిపత్యం కదిలిపోయింది. గ్రామీణ పేదలూ, దళితులూ తమ గౌరవాన్ని తిరిగి పొందినట్టే అనిపించింది. నక్సలైటు ఉద్యమాన్ని అతి తీవ్రంగా విమర్శించే వాళ్ళు కూడా ఒక వాస్తవాన్ని అంగీకరిస్తారు. అదేమంటే 1970ల రైతాంగ ఉద్యమం భూస్వామ్య ఆధిపత్యపు వెన్నుముకను నిజంగా విరిచేసింది. క్రమక్రమంగా భూస్వామ్య వర్గం స్థానాన్ని రాజ్యం ఆక్రమించిందనేది వేరే సంగతి.

ఇవాళ చెక్కపల్లిలో భిన్నమైన దృశ్యం కనబడుతుంది. 1980-81లలో ఎప్పుడో ఆత్మహత్య చేసుకుని భగవంతరావు కనుమరుగయ్యాడు. ఆయన భార్య పుట్టింటికి వెళ్ళిపోయింది. వారి భూమి కొంత పంపిణీ అయ్యింది. మరికొంత గల్ఫ్‌కు వలస వెళ్ళి ఎంతోకొంత డబ్బు సంపాదించు కున్నవారు కొనుగోలు చేసారు. ఇప్పుడక్కడ

నాలుగువందల కుటుంబాలు, దాదాపు రెండువేల జనాభా నివసిస్తున్నారు. దాదాపు ఇరవై కుటుంబాలకు తలా పదినుంచి పదిహేను ఎకరాల భూమి ఉంది. వంద కుటుంబాలకు పైగా తలా ఐదు ఎకరాల భూమికి యజమానులు, మిగిలిన వారికి ఐదు ఎకరాలకన్నా తక్కువ భూమి ఉంది. గతంలో ప్రధాన సమస్య అయిన భూమిలేని నిరుపేదరికం ఇప్పుడంత తీవ్ర సమస్యగా లేదు. భూమి లేనివారందరికీ పోరాటం వల్ల ఎంతోకొంత భూమి వచ్చింది. దాదాపు వందమంది వేరు వేరు వ్యవసాయేతర వృత్తులలో ఉన్నారు. ఒక వందమంది స్త్రీలు బీడీలు చుట్టే పని చేస్తున్నారు.

నూకలమర్రి కథ కూడా ఇటువంటిదే. ఆరువేల జనాభాతో, పదిహేను వందల కుటుంబాలతో ఈ గ్రామం కొన్త పెద్దది. దాదాపు ఆరువందల కుటుంబాలకు ఐదెకరాలో అంతకన్నా తక్కువో ఉంది. పదెకరాలకన్నా ఎక్కువ ఉన్న కుటుంబాలు దాదాపు ఐదు వందలుంటాయి. ఇప్పటికీ ఈ గ్రామంలో ఒక వంద భూమిలేని కుటుంబాలున్నాయి. ఒకప్పుడు ఊరి జనాభాలోని సగం మంది భూమి లేకుండా ఉండేవారు. గత ఇరవై ఏళ్ళలో వారిలో చాలామందికి భూమి దొరికింది. ఈ గ్రామం దొరలు గ్రామం వదిలేసివెళ్ళి హైదరాబాద్‌లో స్థిరపడ్డారు. ఇప్పటికీ గ్రామంలో నలభై ఎకరాలు పడావు పడి ఉన్నప్పటికీ చాలా భూమిని భూమిలేని నిరుపేదలకు పంచడమో, గల్ఫ్‌నుంచి వచ్చిన డబ్బులతో కొనుక్కోవడమో జరిగింది. భూస్వామి నుంచి స్వాధీనం చేసుకున్న తొమ్మిదెకరాల భూమి మీద ఇవాళ పాఠశాల నడుస్తోంది. ఈ గ్రామంలో బీడీ కార్మికుల సంఖ్య ఎక్కువ. ఐదువందలమంది స్త్రీలు ఈ పరిశ్రమలో ఉన్నారు. మొత్తం గ్రామంలో మూడు వందల బావులూ, మూడు బోర్‌వెల్స్ ఉన్నాయి. సాగునీటికి కూడా బావులే ఆధారం కానీ ఆ బావులన్నీ ఎండిపోయాయి. గత ఇరవై సంవత్సరాలలో సాంప్రదాయిక నాగలి వాడకం క్రమంగా తగ్గిపోయింది. గ్రామంలో అద్దెకు తిరిగే నాలుగు ట్రాక్టర్లు భూమిని దున్నుతున్నాయి.

ప్రస్తుతం ఈ గ్రామాలు ముక్కలయిపోయిన చిన్న రైతాంగ ఆర్థిక వ్యవస్థలుగా, గ్రామీణ ఆర్థిక వ్యవస్థ వైపునుంచీ చూసినపుడు ఎక్కువ పెట్టుబడి పోగుపడకుండా మార్కెట్‌తో సంబంధాలలో ఉన్నాయి. పెట్టుబడిదారీ వ్యవసాయం అనే భావనతో ప్రభావితమైన వారికి ఈ దృశ్యం నిరాశ గొలుపుతుంది. ఐతే అది వేరే కథ. కానీ అదే సమయంలో ఈ రెండు గ్రామాల్లోనూ మేము చూసిందేమిటంటే అంతకు ముందు మిగులును సంపాదించడానికి దొరలు ఉపయోగించిన పద్ధతులు పాలుగాని, కౌలుగాని ఇప్పుడు లేవు. వాణిజ్య పంటల ఆధిపత్యంతో సాగుపద్ధతులు మారిపోయాయి. పత్తి, మొక్కజొన్న, వరిసాగును వెనక్కి నెట్టాయి. ఇవాళ రైతాంగ సమస్యలు పెరిగిపోతున్న ఉత్పత్తి వ్యయం వంటి మార్కెట్ సంబంధిత సమస్యలు. అందువల్ల రైతులు అప్పులు చేయవలసి వస్తోంది. వ్యవస్థాగత రుణాలు ఇంకా తక్కువగానే ఉన్నాయి గనుక రైతులు ఇరవైనాలుగునుంచి ముప్పై శాతం వరకు గల అత్యధిక వడ్డీరేట్లతో అప్పుకోసం వ్యాపారుల దగ్గరికి పరిగెత్త వలసి వస్తోంది. ఈ వ్యాపారులను కూడా పాత భూస్వామ్య సమాజంలోని సాంప్రదాయక వడ్డీ వ్యాపారులతో సమానంగా చూడకూడదు. ఎందుకంటే ఈ వ్యాపారి పంట వచ్చాక రైతు నుంచి మార్కెట్‌కు పంటచేర్చి కొంత కమీషన్ సంపాదించే ఏజెంటుకూడా. ఇప్పటికీ వ్యవసాయంలో కుటుంబ శ్రమ వుంది. భూకమతపు పరిమాణం బట్టి వేతన శ్రమను వాడుకోవడం కూడా ఉంది. వ్యవసాయ కార్మికుల వేతనాలు పురుషులకు రూ.60-70, స్త్రీలకు రూ.40-50గా ఉన్నాయి. కట్టు బానిసత్వపు శ్రమ లేదు. రెండు గ్లాసుల పద్ధతి లేదు. ఇంకా కులాల మధ్య వివాహాలు జరగడం లేదు. అయినప్పటికీ గ్రామస్థుల మధ్య మంచికలయిక ఉంది. అక్షరాస్యత, విద్యాస్థాయి స్వల్పంగా మెరుగయ్యాయి. ఆసక్తికరమైన విషయమేమంటే కులసంఘాలు పుట్టుకొచ్చి దాదాపుగా 'సంఘం' స్థానాన్ని ఆక్రమించాయి. ఈ కుల సంఘాల పుట్టుకకు రాజ్య హింస కూడా ఒక కారణం కావచ్చు. అలాగే అగ్రవర్ణాల ఆధిపత్యంలోనే గ్రామీణ వ్యవస్థలన్నీ ఉండడం వల్ల వెనుకబడిన కులాలు, షెడ్యూల్డ్ కులాలు తమ అస్తిత్వాన్ని నొక్కి చెపుతూ ఉండవచ్చు.

ఈ రెండు గ్రామాలూ రెండు దశాబ్దాల కింద ఎలా ఉన్నాయో అందుకు పూర్తిగా భిన్నమైన ముఖాన్ని ఇవాళ ప్రదర్శిస్తున్నాయి. సిరిసిల్ల ప్రాంతంలోని ఇతర గ్రామాల పరిస్థితి కూడా ఇలాగే వుండవచ్చు.

మార్క్సిస్టు-లెనినిస్టు ఉద్యమ బలానికి పునాది అయిన గ్రామీణ పేదలను, రైతాంగాన్నీ సమీకరించడానికి భూస్వామ్య వర్గం, విభిన్న భూస్వామ్య పీడన రూపాలు మౌలికంగా ప్రధాన అంశాలుగా ఉండేవి. ఈ ప్రధాన అంశాలు ఇప్పుడెంత మాత్రం లేవు. ఎత్తుగడల సమస్యలపై అదనపు శక్తులను ఖర్చు పెట్టే బదులు, మార్క్సిస్టు-లెనినిస్టు ఉద్యమం ఎదుర్కొంటున్న సమస్యలను ఇక్కడే చూడాలనుకుంటాము. ఎందుకంటే ఎత్తుగడలు కూడా నిర్దిష్ట భౌతిక పరిస్థితులమీదనే ఆధారపడతాయి. ఈ రెండు గ్రామాలూ ఇతర గ్రామాల్లాగే ఒక స్పష్టమైన వర్గపోరాట పునాదిగా జరిగిన వ్యవసాయ మార్పులను చూపుతాయి. అదే సమయంలో అన్ని వైపులనుంచీ కమ్ముకొస్తున్న ప్రపంచీకరణ క్రమం రైతాంగాన్ని మార్కెట్ శక్తులకూ, రాజ్య విధానాలకూ వ్యతిరేకంగా నిలబెట్టే పరిస్థితులను సృష్టించింది. ఈ మారిన పరిస్థితుల నిర్దిష్టతనుంచి గ్రామీణ ప్రజానీకాన్ని సమీకరించి పోరాటాలు నిర్మించే కర్తవ్యాన్ని వేరుచేసి చూడలేము. ఈ గ్రామాల హృదయ పరివర్తన జరిగిందా లేదా అని చర్చించవచ్చుగానీ ఒక ఉద్యమపు జీవితాన్ని మన ఊహలకోసం బలిపెట్టలేము. ❑

# కొత్త పుస్తకాలు

'వీక్షణం' లో ఇకనుంచి ప్రతి సంచికలోనూ పుస్తక సమీక్ష, పుస్తక పరిచయం, పుస్తక స్వీకారం ఉంటాయి. అయితే సామాజిక, ఆర్థిక పత్రికగా 'వీక్షణం' ఈ శీర్షికల కింద సృజనాత్మక సాహిత్య ప్రక్రియల (కవిత్వం, కథ, నవల, నాటకం, సాహిత్య, విమర్శ, దృశ్య కళారూపాలు) పుస్తకాలను పరిచయం చేయాలనుకోవడం లేదు. ఇవాళ తెలుగులో సామాజిక, ఆర్థిక, రాజకీయ, తాత్విక, చారిత్రక అంశాలకు సంబంధించిన ఎన్నో విశ్లేషణాత్మక పుస్తకాలు వెలువడుతున్నాయి. వ్యాసం, వాదం, విశ్లేషణ, చర్చ రూపంలో ఉంటున్న ఈ పుస్తకాల సమీక్ష, పరిచయం, స్వీకారంలకు ఈ శీర్షిక పరిమితమవుతుంది. ప్రచురణకర్తలు తమ పుస్తకాలను రెండు కాపీల చొప్పున వీక్షణం కార్యాలయానికి పంపాలి.




**ఆంధ్రప్రదేశ్ రాజకీయవ్యవస్థ - తెలంగాణా రాజకీయాలు - దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్‌గ్రే- ప్రచురణ:** హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ప్రొ. బి. జనార్ధన్ రావు మెమోరియల్ ఫౌండేషన్, వెల రు. 60. **ప్రతులకు:** హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, ప్లాట్ నం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, మెహదీపట్నం, హైదరాబాద్ - 500 028




**మార్క్సిస్టు మనోవికాసం - డి. పాపారావు, ప్రచురణ:** చైతన్య పబ్లికేషన్స్, వెల. రు.15, **ప్రతులకు:** - విశాలాంధ్ర, ప్రజాశక్తి అన్ని బ్రాంచీలు, దిశ పుస్తక కేంద్రం, నవోదయ బుక్‌హౌస్, హైదరాబాద్ లేదా డి. పాపారావు, ఎ-60, జర్నలిస్టు కాలనీ, జూబ్లీహిల్స్, హైదరాబాద్ - 500 034.



**ఆరుగాలం కరువు - అనంతపురం జిల్లా వ్యవసాయ సంక్షోభంపై నివేదిక - మానవ హక్కుల** వేదిక ప్రచురణ, రు.5, **ప్రతులకు:** ఎస్.జీవన్ కుమార్, 3-12-117/ఎ-2/1, పి.ఎస్.కాలనీ, గణేష్‌నగర్, రామంతాపూర్, హైదరాబాద్ - 500 013.

---

*(26వ పేజీ తరువాయి)*

జరిగిన నష్టం కొద్దిరోజుల పాటు ప్రభుత్వ యంత్రాంగాన్ని కదిలించింది. అప్పటి ప్రభుత్వం వరదల నివారణా చర్యలు సూచించడానికి కిర్లోస్కర్ కమిటీని నియమించింది.

అయితే కమిటీ నివేదిక సూచించిన చర్యలు ఒక్కటి కూడా అప్పటి, ఇప్పటి ప్రభుత్వాలు తీసుకోలేదు. హైదరాబాద్ నగరంలో చెరువులు, కుంటల్లో కబ్జాలు తొలగించాలని, ఆక్రమణలకు గురైన నాలాలు వెడల్పు చేయాలని, డ్రైనేజ వ్యవస్థను ఆధునీకరించాలని ఇలా ఎన్నో ప్రాథమిక సూచనలు మన ప్రభుత్వాలు పట్టించుకోవడంలేదు. ఫ్లైఓవర్లు, పార్కులు, నెక్లెస్ రోడ్లు నిర్మించడానికేమో అమితాసక్తి చూపుతున్నారు. దీని ఫలితం ఈ ఏడాది వర్షాకాలం వారం రోజుల వ్యవధిలో రెండుసార్లు హైదరాబాద్ ప్రజానీకం వరదల బారిన పడింది.

గ్రేటర్ హైదరాబాద్ అని ఓ కొత్త ప్రణాళిక ప్రకటించి పక్షం రోజులు గడవకనే హైదరాబాద్‌ను ముంచెత్తుతున్న ఈ వరదలు అనేక ప్రశ్నలు లేవనెత్తుతున్నాయి. ప్రపంచ పటంలో సైబరాబాద్‌గా, హైటెక్ సిటీగా నగరాన్ని చూపించి పబ్బం గడుపుతున్న పాలకులు మౌళిక వసతుల కల్పనలో ఎంత బాధ్యతారాహిత్యంగా ప్రవర్తిస్తున్నారో ప్రస్తుత పరిస్థితులు నిరూపిస్తున్నాయి. ప్రాధాన్యాలు సరిగా నిర్వచించుకోని ప్రభుత్వాలు వేల కోట్లు దుబారా చేసి సాధిస్తున్న అభివృద్ధి మేడి పండు వంటిదనీ ఈ పంథా తక్షణం మార్చుకోవాల్సిన అవసరం ఉందనీ చినుకు పడితే ఉలిక్కి పడుతున్న హైదరాబాద్ నగర సాక్షిగా ప్రభుత్వాధినేతలు అర్థం చేసుకోవాలి.

❑

## 'వీక్షణం' చందాదారులుగా చేరండి!
## 'వీక్షణం'ను మిత్రులకు పరిచయం చేయండి!

తెలుగు నాట విలక్షణమైన ఆర్థిక, సామాజిక పత్రిక 'వీక్షణం' ను రెండు సంవత్సరాలకు పైగా ఆదరించి పోషిస్తున్న మిత్రులందరికీ 'వీక్షణం' సంపాదకవర్గం వినమ్రంగా ధన్యవాదాలు తెలుపుతోంది. అయితే తెలుగుసీమలో రాజకీయ, ఆర్థిక, సామాజిక అంశాల విశ్లేషణ కోసం ప్రజలలో, పాఠకులలో, ఆలోచనా పరులలో వ్యక్తమవుతున్న తహతహకూ, ఆ ఆసక్తిని తీర్చడంలో 'వీక్షణం' చేస్తున్న కృషికీ మధ్య చాల అంతరం ఉంది. ఆ అంతరం పూడాలంటే 'వీక్షణం' కు పాఠకుల నుంచే ఇతోధిక సహకారం అందాలి. 'వీక్షణం' చందాదారుల సంఖ్య కనీసం మూడురెట్లు పెరిగితే గాని, 'వీక్షణం' తన ముందు పెట్టుకున్న కర్తవ్యాలను తీర్చడం సాధ్యం కాదు. అంటే 'వీక్షణం' పాఠకులలో ప్రతి ఒక్కరూ తమ చందాలను క్రమం తప్పకుండా పునరుద్ధరించుకోవడంతో పాటు, కనీస మరొక ముగ్గురు మిత్రులకు 'వీక్షణం' ను పరిచయం చేసి చందాలు కట్టించాలి.

'వీక్షణం' చందాదారులుగా చేరండి!
మీ మిత్రులను 'వీక్షణం' చందాదారులుగా చేర్పండి!
ఇది వీక్షణం కు సాయం కాదు, తెలుగు సమాజం తన గురించి తాను
తెలుసుకోవడానికి చేసే అన్వేషణకు సాయం!

వీక్షణం విడిప్రతి రు. 10, సంవత్సర చందా రు. 150, దశాబ్ది చందా రు. 1,000
చందాలు కింది చిరునామాకు ఎం.ఓ./డి.డి. ద్వారా పంపవచ్చు.

వీక్షణం, సిడిఆర్‌సి, మైత్రి రెసిడెన్సీ,
3-6-394, స్ట్రీట్ నం.3, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500029.

## మీలోని రచయితను వెలికి తీయండి!
## 'వీక్షణం' మీ రచన కోసం వేచి చూస్తోంది!

మీ చుట్టూ, మీ గ్రామంలో, మీ బస్తీలో, మీ పని స్థలంలో, మీరు పనిచేసే సంఘంలో ఏదో ఒక ఘటన మిమ్మల్ని కదిలిస్తుంది. మీలో ఆలోచనలు రగిలిస్తుంది. ఆ ఘటన వెనుక ఉన్న సామాజిక, రాజకీయ, ఆర్థిక మూలాల గురించి మీరు అన్వేషిస్తుంటారు. మీ ఆలోచనలను రాయండి. సరిగ్గా 'వీక్షణం' ఎదురు చూస్తున్నది అటువంటి క్షేత్ర నివేదికల కోసమే. 'వీక్షణం' ఆర్థిక, సామాజిక పత్రిక తెలుగు సమాజం తన గురించి తాను చేసుకునే ఆలోచనలకు, అన్వేషణలకు ఒక వేదిక. మీరు అట్టడుగు నుంచి, మీ అనుభవాల నుంచి పంపే నివేదికలు ఆ ఆలోచనల్లో, అన్వేషణల్లో భాగమే.

'వీక్షణం' ను ఇటు క్షేత్ర నివేదికల, అటు నిపుణుల విశ్లేషణల మేలు కలయికగా తీర్చిదిద్దాలని సంపాదకవర్గం ప్రయత్నిస్తోంది. మన జీవితాల మీద ప్రగాఢ ప్రభావం వేయగల అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ పరిణామాల మీద నిపుణుల విశ్లేషణలు ఎంత అవసరమో, ఆ పరిణామాలు అట్టడుగు మనుషుల జీవన సరళిని ఎట్లా మారుస్తున్నాయో కింది నుంచి నివేదించడమూ అంతే అవసరం.

వీక్షణం మీ పత్రిక వీక్షణం మన పత్రిక
వీక్షణం తెలుగు సమాజం తన గురించి తాను చేసుకునే అన్వేషణ. ఆ అన్వేషణలో భాగం పంచుకోండి.
రచనలు పంపవలసిన చిరునామా:

సంపాదకుడు, వీక్షణం, సి.డి.ఆర్.సి, మైత్రి రెసిడెన్సీ,
3-6-394, స్ట్రీట్ నం.3, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500029.

PRINTED BOOK

RNI Regn. No. APTEL/2003/11482

Postal Regn. No. LII/RNP/H-HD-1029/2004-06



Owned, Printed and Published by V. Hanumantha Rao at 301, Mythri Residency, 3-6-394, Road No.3, Himayat Nagar, Hyderabad - 500 029. Ph : 55843495. Printed at Charita Impressions, Azamabad, Hyderabad. For Nutan Art Printers, Hyderabad. Editor : N. Venugopal

**VEEKSHANAM**

301, Mythri Residency,

3-6-394, Road No.3, Himayatnagar, Hyderabad - 500 029